# అక్షరాంకితం



భాష, యాస, బతుకు తరీకను

ప్రేమ, బాధ్యతతో నేర్పిన..

**అమ్మ – నాయిన**

**శ్రీమతి శీలం యాదమ్మ,**

**శ్రీ శీలం బుచ్చయ్య గారికి...**

అక్షరాంకితం...

*Sheelam Bhadraiah*
**Gangeddu:** *Telugu Stories...*





***First Edition:*** *Dec 2022*

***Copies :*** *1000*

***Cover Page illustration:***
*Sri. Kishore Kumar Bolleddu Garu*

***Cover Design:***
*Sri. SUNIL SANDA Garu*

***For Copies:***
*Sheelam Publications-Book-2,*
*Smt. Sheelam karuna*
*8-1-510, Plot 25, Padmavathi Colony,*
*Nalgonda, 508001, Ph: 9885838288*
*& All Leading book Shops*

***Printed*** *@ Lepakshi Printers,*
*Hyderabad, Ph: 9246537133*

***Price : 120/-*** *Rs.*

*ISBN No: 978-93-5493-350-9*



**డా॥ వెల్దండి శ్రీధర్** M.A., Ph. D.
తెలుగు శాఖాధ్యక్షులు
ప్రభుత్వ డిగ్రీ కళాశాల, గజ్వేల్
సిద్దిపేట జిల్లా – తెలంగాణ రాష్ట్రం

## జీవితాన్ని వస్తుగాలం పట్టిన కథలు

*'పుట్టినాక లోకానితో సంఘర్షణ పడతాం, పోయేటపుడు మనలో మనం సంఘర్షిస్తూ పోతాము. సంఘర్షణ లేకుండా పుట్టుక లేదు, చావు లేదు. బతుకు లేదు"*

తెలంగాణ నేల మీదే కాదు, భారతదేశ వ్యాప్తంగా కూడా గత నాలుగు దశాబ్దాలుగా మనిషి జీవితం అత్యంత సంఘర్షితంగా తయారయింది. బహుజన జీవితాలు మరింత సంఘర్షణాయుతంగా మారి పోయాయి. అందుకే రచయితలు, సినిమాలు అట్టడుగు వర్గాల జీవితాలను మునుపటి కంటే ఎక్కువగా పట్టించుకొని అక్షరాలకు అందని కోణాలను బలంగా చిత్రీకరిస్తున్నారు. బహుజన వర్గాల నుంచి ఎదిగి వచ్చిన కథకులు ఈ పనిని మరింత జాగ్రత్తగా చేస్తున్నారు. సాధారణంగా కవిత్వంలో ఇమడని జీవితపు పార్శ్వాలు కథల్లో బాగా ప్రతిఫలిస్తాయి. అలాంటి బహుజన సోయితోటి, మానవీయ స్పర్శతోటి కథలు రాస్తున్న Emerging Writer శీలం భద్రయ్య. 2021లోనే 'లొట్టపీసు పూలు' అనే తన తొలి కథాసంపుటితో తెలుగు కథా సాహిత్యంలో ఒక సంచలనం సృష్టించిన శీలం భద్రయ్య వెలువరిస్తున్న మరో కథా సంపుటి 'గంగెద్దు'.

1956లోనే డా. పల్లా దుర్గయ్య 'గంగిరెద్దు' అనే పద్య కావ్యాన్ని వెలువరించారు. అందులో గంగిరెద్దుల ఆటను ఆడించి జీవనం పోసుకునే వారి జీవితం, గంగిరెద్దు విన్యాసాలు చెప్పబడ్డాయి. ఇప్పుడు శీలం భద్రయ్య ప్రపంచితం చేస్తోన్న ఈ 'గంగెద్దు' కథా సంపుటి స్వరూపంలోను, స్వభావంలోనూ అందుకు భిన్నమైనది. పల్లా దుర్గయ్య 'గంగిరెద్దు' ముప్పాతిక ముప్వీసం సాధు స్వభావం గలది. కాని శీలం భద్రయ్య 'గంగెద్దు' ధిక్కార భాస్వరాన్ని మండించేది. ఆధిపత్య వర్గాల వారు ఏది చెప్పితే దానికి తలూపే రకం కాదు ఈ 'గంగెద్దు'. తన యజమాని కుటుంబానికి జరిగిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకునే రకం. ఎంతటి వాన్నైనా ఎదిరించి ఊరు, ఇల్లులేని గంగెద్దుల వాళ్లకు ఒక ఆదరువు చూపే కొత్త చూపున్నది. నిచ్చెన మెట్ల సమాజంలో అడుగునున్న వాళ్ల ఆత్మగౌరవాన్ని నిలబెట్టేది.

ప్రజల జీవితాన్ని అత్యంత దగ్గరి నుంచి పరిశీలిస్తున్న రచయిత శీలం భద్రయ్య. అందుకే ప్రజల వైపు నిలబడి, ప్రజా దృక్పథంతో ప్రతి కథలో ప్రజలనే విజేతలుగా చూపెట్టాడు. ఏ కథలో కూడా ఓడిపోయిన జీవితం లేదు. అన్నీ జీవితాన్ని గెల్చుకున్న కథలే. 'కాగడా' అనే కథ తప్ప మిగతా ఏ కథ కూడా మరణంతో ముగియలేదు. ఇందులోని కథలన్నీ చావడానికి ముందు బ్రతుకును ప్రేమించమని బోధించే కథలే.

పారిశ్రామికీకరణను అందిపుచ్చుకోవడం, అనుకోని సంఘటన జరిగితే జీవితం అక్కడితో ఆగిపోకూడదని తెల్పడం, తరాలు మారినా సంసారాన్ని ఈదడానికి 'పాకీజ' పని మినహా మరో పని దొరకని దుర్భరస్థితి, అధికార దాహం, తన 'తావు'ను తాను కాపాడుకోవడం కోసం చివరి క్షణం వరకు పోరాడాలని సూచించడం, ఏ పని చేసినా మనస్సాక్షి అనేది ఒకటి ఉంటుందని అది మనల్ని ఎప్పటికప్పుడు గమనిస్తూ హెచ్చరిస్తుందని తెలియజేయడం, ఒక్క 'యాక్సిడెంట్' ఎన్ని జీవితాలను మారుస్తుందో చూపెట్టడం, కరోనా నేపథ్యంలో 'భయం' వాకిట నిలబడ్డ మానవాళి దైన్యస్థితిని చిత్రించడం, మలి వయసులో ఎండుటాకులా రాలిపోకుండా మోడువారిన జీవితపు కొమ్మకు కొత్త చివుళ్ళు తొడగడం, 'బ్యాడ్ టచ్' ఏదో, గుడ్ టచ్ ఏదో గుర్తించే విచక్షణను, నైపుణ్యాన్ని పాఠశాలలో చదువుతున్న బాలికలకు నేర్పడం, మనిషి లోలోపల ఉండే 'ఆశ' చుట్టూ తిరిగి దీపం చుట్టు తిరిగే పురుగులా మాడిపోవడం, జీవిత సంఘర్షణను కాచి వడబోయడం, తెలంగాణ  రైతాంగ సాయుధ పోరాటంలో పల్లెలు ఎంతగా నలిగిపోయాయో చిందిన నెత్తురు సాక్షిగా రాయడం ఇలా శీలం భద్రయ్య వస్తు వైవిధ్యం అపారమైంది.

ఆధునిక కథ ప్రత్యేకత ఏమిటంటే కథలో ఏమి చెప్పామన్నదానితో పాటు ఎలా చెప్పామన్నది చాలా ముఖ్యమైనది. వాక్యానికి వాక్యానికి మధ్య (Between the lines) ఏమి చెప్పామన్నదానితో పాటు చెప్పకుండా వదిలి వేసిన దానికి చాలా ప్రాధాన్యత ఉంటుంది. కవిత్వంలోనే కాదు కథల్లో కూడా ధ్వని ఉంటుందని నిరూపించిన కథలు శీలం భద్రయ్య కథలు. ప్రతి కథలో వాక్య విన్యాసంతో పాటు ఆకట్టుకునే కథనం పాఠకుడిని ఆకర్షిస్తుంది. 'అద్దం', 'కుర్చీ' లాంటి కథల్లో చూపిన శిల్ప చాతుర్యం నూతన కథకులకు కొత్త తోవలు చూపిస్తుంది. తెలంగాణ కథలు శిల్పలేమితో బాధ పడుతున్నాయని వాపోయే వారికి ఈ కథలు ఒక చెంపపెట్టు. సాధారణంగా కథలు Flashback Technic తోనో, Chronological Order లోనో, Present Tense లోనో సాగిపోతుంటాయి. శీలం భద్రయ్య వీటన్నింటినీ దాటి Slide Technic తో కథ చెప్పడం వల్ల కథకు కొత్త

శిల్ప పరిమళాన్ని అద్దినట్టుగా తోస్తుంది. వస్తు నవ్యతతో పాటు కొత్తగా చెప్పాలనే తాపత్రయం ఈ కథల్లో తొంగిచూస్తుంది.

కథ విలుకాని బాణంలాగా నేరుగా లక్ష్యాన్ని చేరడంలో ఆసక్తి ఉండదు. కొన్ని ఊహించని మలుపులు తిరిగి కొస మెరుపుతో, కొత్త వెలుతురుతో అంచనాకు అందకుండా ముగిసిపోవడంలో ఉండే ఉత్సుకత వేరు. అలా ఊహించని విధంగా మలుపులు తిరిగి పెద్ద సస్పెన్స్‌తో కొనసాగి చివరికి ఎక్కడో ముగిసిపోతాయి ఇందులోని కథలు. ఇది కథకుడు అభ్యాసం చేసి సాధించిన నైపుణ్యంలాగా కనబడుతుంది.

సాధారణ చదువరి కథా వస్తువునే గమనిస్తాడు. కాని తెలివైన పాఠకుడు కథనం, శిల్పం, భాష, వాక్చాతుర్యం, పాత్రపోషణ, సన్నివేశ కల్పన, వాతావరణ చిత్రణ ఇలా అన్నింటినీ లోతుగా పరిశీలిస్తాడు. అలాంటి తెలివైన పాఠకులకు ఈ 'గంగెద్దు' కథలు ఒక విధంగా గొప్ప మేధో ఆహారం.'పరువు', 'ఆశ', 'సంఘర్షణ' లాంటి కథలు ఇందుకు మచ్చు తునకలు.

మనుషులుగా జీవిస్తున్నవారెవరైనా కళ్ళ ముందు జరుగుతున్న విషాద సందర్భాలకు దు:ఖించకుండా ఉండలేరు. కథకులైతే మరింత తాదాత్మ్యం చెంది లోలోపలే కుమిలిపోతారు. ఒక విధమైన చింతన, పరివేదన ఆవరించుకున్నప్పుడు కథలు రాస్తారు. అలాంటి కథలు కళ్ల నిండా కన్నీళ్లను, మనసు నిండా భావోద్వేగాలను నింపుతాయి. కఠోరమైన కాలాన్ని తొల్చుకుని వచ్చి కథలుగా రాస్తే అవి 'గంట', 'పాకీజ', 'కాగడా' కథలుగా పురుడుపోసుకుంటాయి. శీలం భద్రయ్య తనలోకి తాను తొంగిచూసుకొని, సమాజంలోకి తొంగిచూసి రాసిన ఆర్ద్రమైన కథలివి.

గుండె కొట్టుకుంటున్నంత సేపు అలజడికి గురవుతూనే ఉంటాము. గాయపడుతూనే ఉంటాము. వాటికి వెంట వెంటనే కథారూపం ఇవ్వడం శీలం భద్రయ్య లాంటి Mercury Writers కే సాధ్యమవుతుంది. మన చుట్టూత ఎన్నో కథా శకలాలు కొట్టుకుపోతుంటాయి. వాటిని ఒడుపుగా పట్టుకొని కథల్లో పొదగడం ఒక మంచి నేర్పు. 'సిగ్గు', 'బ్యాడ్ టచ్', 'సంఘర్షణ' కథలు ఇందుకు మంచి ఉదాహరణలు. ఈ కథా సంపుటిలోకెల్లా విలక్షణమైన కథ 'కాగడా'. దీనికి నేపథ్యం తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం. ఈ పోరాటం జరిగి 75 ఏళ్లు అయిపోయిన సందర్భంగా నేటి తరాలకు అప్పటి సాయుధ పోరాట వారసత్వాన్ని తెలియజేయడానికి కథకుడు చేసిన మంచి ప్రయత్నం. కథ వర్ణణతో మొదలై, సంభాషణతో కొనసాగి చివరికి మైబెల్లి మరణంతో ముగుస్తుంది. కథ చదివాక చాలా రోజుల పాటు మైబెల్లి పాత్ర వెంటాడుతుంది.

కథకులు ఉపయోగించే భాష, సందర్భోచితంగా వాడే సామెతలు, పాత్రలు, వాటి స్వభావాలు, పాత్రల పేర్లు ఇలా కథలోని ఎన్నో అంశాలు కథకుడిని ప్రజా రచయితగా నిలబెడుతాయి. ఈ సంపుటిలోని కథలన్నీ శీలం భద్రయ్యను ఒక ప్రజా కథకుడిగా ఆవిష్కరించాయి. ఏ కథలకైనా పాఠకులు తమ హృదయాల్లో కాసింత చోటు ఇవ్వాలంటే Human Touch, Readability అనే రెండు సుగుణాలుండాలి. ఈ రెండు లక్షణాలు పుష్కలంగా ఉన్న కథా సంపుటి ఇది. ఆలోచింపజేయడం, జీవితపు తడిని అంతే వాస్తవికంగా కథల్లోకి తీసుకురావడం కథలకు ఉండాల్సిన మౌళిక లక్షణాలు. శీలం భద్రయ్య వీటిని సమర్థవంతంగా సాధించాడని చెప్పవచ్చు. వ్యవహారం నుండి జారిపోయిన 'ఇబ్రీకం', 'నామర్దా', 'రోసిన', 'తబేదు' లాంటి పదాలను కథకుడు ఒడుపుగా వాడడం గమనించవచ్చు. నిఘంటువుల్లో చేరని ఇలాంటి అనేక పదాలను ఈ కథల ద్వారా సేకరించవచ్చు. భాషా పరిశోధకులకు ఇదొక ఆకరగ్రంథం.

ఈ కథలు చదివిన తరువాత మనుషులు మరింత మానవీయతా గంధాన్ని పులుముకుంటారని కచ్చితంగా చెప్పవచ్చు. రచయిత మనుషుల మనస్తత్వాన్ని, స్వభావాన్ని, తెలంగాణ జీవితాన్ని పట్టుకోవడంలో పరిపూర్ణంగా విజయం సాధించాడు. ఈ 14 కథలు రెండు ఇంద్రధనస్సుల్లాంటి జీవితాలను పరిచయం చేస్తాయి.

మొదటి కథా సంపుటి 'లొట్టపీసుపూలు' ప్రచురించి రెండు సంవత్సరాలు కూడా తిరగకుండానే చాలా వేగంగా ఈ 'గంగెద్దు'ను సర్వాంగ సుందరంగా అలంకరించి పాఠకుల హృదయ ప్రాంగణంలో వదిలిపెడుతున్న శీలం భద్రయ్యకు శుభాభినందనలు.

11 డిసెంబర్ 2022 **–డా॥ వెల్దండి శ్రీధర్**

హైదరాబాద్

–0–

# బలమైన కథకుడు శీలం భద్రయ్య

**- డాక్టర్ వి. జయ ప్రకాశ్** M.A., Ph. D.

పోస్ట్ గ్రాడ్యుయెట్ టీచరు, తెలుగు

సాహిత్య ప్రక్రియలలో కథాసాహిత్యం ప్రజాదరణ కలిగిన ప్రక్రియ. కథలు ఆబాలగోపాలాన్ని అలరిస్తాయి. కథను విశ్లేషించినపుడు, వస్తువు సామాజికమైనదిగా, శిల్పం సాహిత్యపరమైనదిగా, శైలీయేమో రచయితను బట్టి ఉంటుంది. కథల్లో సన్నివేశం, సంఘటన, పాత్ర, మనస్తత్వం, ప్రతీకాత్మకత, వ్యంగ్యం వంటివి ప్రధానంగా కనిపిస్తాయి. చదవడమనే అలవాటు తగ్గిపోతున్న సమయంలో సంక్షిప్తత ప్రధానంగా ఉండే కథానికకు ప్రాధాన్యత, జనాదరణ పెరిగింది. పాఠకుల ఆసక్తికి తగ్గట్టు పత్రికలూ సైతం క్లుప్తతతో బాటు ఆసక్తికరమైన రచనాశిల్పం ఉన్న కథలనే ప్రోత్సహిస్తున్నాయి. శీలం భద్రయ్య రచయితగా పాఠకుల అభిరుచి, పత్రికల ప్రాధాన్యతకు అనువైన కథలు రాస్తున్నాడు.

శీలం భద్రయ్య 'లొట్టపీసుపూలు' కథలతో తెలుగు కథాసాహిత్యంలో కథకుడిగా బలమైన ముద్రవేశాడు. ఇప్పుడు తన రెండో కథాసంపుటి 'గంగెద్దు' కథలను వెలువరిస్తున్నాడు. లొట్టపీసుపూలు శీర్షిక, కథలపై విస్తృతమైన చర్చ జరిగింది. సంవత్సరకాలంలోనే మలిముద్రణ జరగడం గమనార్హం. మాజీ భారత ఉపరాష్ట్రపతి మాన్యశ్రీ ముప్పవరపు వెంకయ్యనాయుడుగారు, ఈనాడు సంస్థల వ్యవస్థాపకులు శ్రీ రామోజీరావుగారు వంటి ప్రముఖులతో సహా, ఉద్దండులైన సాహిత్య విమర్శకులు, సమీక్షకులు, సాధారణ పాఠకులు సైతం దీనిపై విశేషంగా స్పందించారు. వారు రాసిన వ్యాసాలూ అభిప్రాయాలూ ఒక పుస్తకంగా వెలువరించే స్థాయిలో ఉండడం కథకుడిగా శీలం భద్రయ్య రచనా ప్రతిభకు గీటురాయి.

వస్తుపరంగా "లొట్టపీసు పూలు" కథలు ప్రధానంగా చారిత్రక తెలంగాణ సాయుధపోరాట నేపథ్యంలో ఉండగా, 'గంగెద్దు' కథల్లో వస్తువైవిధ్యం ఉంటుంది. శిల్పపరంగా విశ్లేషిస్తే "లొట్టపీసు పూలు" కథల్లో అత్యంత ఆసక్తికరమైన 'సినిమాటిక్ శిల్పం' ఉంటుంది. అది "గంగెద్దు" కథల్లో కొద్దిగా తగ్గింది. రచయితలో ఈ మార్పు సీరియస్ రచయితగా మారే పరిణామక్రమాన్ని సూచిస్తుంది. శైలిపరంగా "లొట్టపీసుపూలు" కథల్లో తెలంగాణ సంప్రదాయాలు, సామెతలు, జాతీయాలను కథల్లో వాడుకుని, తెలంగాణ సాయుధ పోరాట కాలాన్ని కళ్ళకు కట్టినట్టుగా ఆసక్తికరంగా చిత్రించాడు. ఆ కథల్లో సమయానుకూలంగా రాసిన కవితాత్మక వాక్యాలు ఎప్పటికీ పాఠకుల మనసులో చెరిగిపోని సంతకాలని విమర్శకులు సైతం అభిప్రాయపడ్డారు. అదే రచనా శైలిని 'గంగెద్దు' కథలలో కూడా కొనసాగించాడు.

'గంగెద్దు' కథల్లో పద్నాలుగు కథలున్నాయి. వస్తువుపరంగా కథలను పరిశీలిస్తే, "గంట" కథలో గ్రామాలకు పాకిన పారిశ్రామికీకరణ గురించి, కుటుంబసభ్యులే పెద్దలకు తోడును వెతికిబెట్టే ఆధునిక తరం కథ "సిగ్గు", సంచారజాతులకు నిలువనీడనివ్వని సమాజంపై ధిక్కారంతో కొట్లాడి వారికి రావాల్సిన వాటా భూమిని, సాంఘీకజీవనాన్ని సాధించుకున్న "గంగెద్దు" కథ, అనుబంధాలకంటే పరువు ముఖ్యమనుకునే "పరువు" కథ, యాంత్రీకరణ, సాంకేతికత ఎంతగా అభివృద్ధిచెందినా నేటికీ పారిశుధ్యకార్మికులు ఆ వృత్తినుండి బయటపడలేకపోవడానికి కారణం చర్చించిన "పాకీజ" కథ, అభివృద్ధి వెనుక వ్యక్తుల జీవన విధ్వంసం, నాయకుల స్వార్థం కళ్ళకుకట్టినట్టు చూపిన కథ "తావు". అధికారపీఠాన్ని దక్కించుకోవడానికి, దానిని కాపాడుకొని, వారసత్వానికి ఇవ్వడానికి చేసే ప్రయత్నాన్ని వ్యంగ్యంగా చిత్రీకరించిన కథ "కుర్చీ". అధికారానికి, న్యాయానికి మధ్య మానసిక సంఘర్షణను అనుభవించే పోలీసాఫీసరు కథ "అద్దం". కళ్ళతో చూసేవన్నీ నిజం కావని తెలిపేది "యాక్సిడెంట్" కథ. భయం మనిషి నవ్వులపాలు చేస్తుంది. ఒక్కోసారి విజయాన్ని అందిస్తుందని హాస్యభరితంగా చెప్పిన కథ "భయం". తెలంగాణ సాయుధపోరాట నేపథ్యంలో నాటి చారిత్రక అంశాలను చర్చిస్తూ, ఆసక్తికరమైన కథనంతో సాగే కథ" కాగడ". కాపాడాల్సిన కన్నతల్లే కనికరం లేకుండా కసాయి దగ్గర పసిపిల్లల జీవితాలను బలిపెట్టే కథ "బ్యాడ్ టచ్". మనిషి మనిషికో ఆశ. ఒకే కథలో ఆశతో ముడిపడిన సంఘటనలను ఒకచోట పో(రా)సిన కథే "ఆశ". జీవన సంఘర్షణలో మతిభ్రమించిన కథ "సంఘర్షణ". ఇలా పద్నాలుగుకథల్లో వస్తువు విభిన్నంగా ఉంటుంది. కథల్లో వస్తుపరంగా నవ్యత, ప్రాచీనత రెండూ ఉంటాయి. అంతే గాకుండా ఈ కథల్లో మానవ ఉద్వేగాలు "గెలుపు, సిగ్గు, భయం, బాధ, నిరాశ, ఓటమి, పోరాటం, తెగింపు, త్యాగం, అవమానం, ఆశ, అత్యాశ, ఆత్మన్యూనత, హాస్యం, అధిక్షేపం, తిరుగుబాటు, జుగుప్స, సంఘర్షణ, ఉత్కంఠ" మొదలగునవి కన్పిస్తాయి. ఈకథల్లో జీవితాన్ని కాచివడబోసి రాసినట్టుండే కవితాత్మక వాక్యాలు చాలాచోట్ల మనసుకు తాకుతాయి. ఉదాహరణకు కొన్ని..'రోయిన ఎండకు చెర్ల నీళ్ళు, కష్టాల దూపకు ముత్తమ్మ కండ్లల్ల నీళ్ళు ఎండిపోయిన్నె' (గంగెద్దు), 'నడిపేటోనికే ఎరుకైతది సాదకబాదకాలు. అందుట్ల పైనం చేసేటోల్లకు సమ్మగనే ఉంటది' (గంట), 'అమ్మ అందమే ఆమెకు శాపమైంది. ఇప్పటిదాక మాకు అన్నమైంది. ఆసరైంది.' 'ఎంత విచిత్రం. కాలం భూమిలాగానే గుండ్రంగా తిరుగుతుందా?' (పరువు), 'కాయ చిన్నదైతే కారం తక్కువవుతుందా?' (తావు), 'కోరిక అంతే. అది మనల్ని లోబరుచుకున్నంత తేలికగా దానిని లొంగదీసుకోలేము.' (యాక్సిడెంట్), 'రజిత గింజుబాటు అంధునికి అద్దం చూపినట్టయింది' (బ్యాడ్ టచ్), తొలి కథాసంపుటిలో ఒకే ఇతివృత్తంలో ఎక్కువ కథలు రాసిన భద్రయ్య, ఈ సంపుటిని వైవిధ్యమైన కథలతో వెలువరిస్తున్నాడు.

శీలం భద్రయ్య వయసులో నాలుగుపదులవాడే, అయినా జీవితంలోని ఎత్తుపల్లాలను అనుభవించినవాడు. వందేళ్ళ జీవితానుభవాన్ని గడించినవాడు. మట్టిమనిషి. జీవితంలోనూ, సాహిత్యసృజనలోనూ నేలవిడిచి సాముచేయడం ఎరుగడు. అందుకే అతని కథలు వాస్తవాల ఆధారంగా సాగుతాయి. అవి అట్టడుగువర్గాలు, మధ్యతరగతి జీవితాల ప్రతిబింబాలు.

సస్పెన్స్ థ్రిల్లర్, సహజమైన తెలంగాణ నుడికారం శీలం భద్రయ్య ప్రత్యేకత. కథల్లోని ఆ ప్రత్యేకతలే పాఠకుడిని తమవెంట కథ చివరి వరకు తీసుకెళ్ళుతాయి. కథలు చదువుతుంటే కొన్ని చోట్ల మనసు కకావికలం అవుతుంది. చివరికి ఏం జరుగుతుందోనన్న ఆందోళన వెంటాడుతుంది. మరికొన్నిచోట్ల అయ్యోపాపం అనిపిస్తుంది. కథ చదువడం పూర్తయ్యాక కూడా కథలు, కథల్లోని సన్నివేశాలు, పాత్రలు, వాక్యాలు పాఠకుల్ని వెంటాడుతాయి. ఇది మంచి కథ, మంచి కథకుడి లక్షణం. ఈకథల్లో తెలంగాణ జనజీవన సంస్కృతి, భాషా సౌందర్యం, సామెతలు, జాతీయాలు, గ్రామీణ పలుకుబడులు ఉంటాయి. దానితోబాటు అసంబద్ధ సంప్రదాయాలు, సామాజిక కట్టుబాట్లపై నిరసన ఉంటుంది. “లొట్టపీసు పూలు” కథలు అస్పృశ్యతకు, అణిచివేతకు ప్రతీకగా నిలిస్తే, వాటికి కొనసాగింపుగా వచ్చిన “గంగెద్దు” కథలు ధిక్కారానికి, మేలుకొలుపునకు ప్రతీక. ఇందులోని ఒక్కో కథను విశ్లేషిస్తే ఒక్కోవ్యాసంగా రాసే ఫోకస్ ఉన్న కథలు. వాస్తవికత ఆధారంగా రాసే కథల్లో శిల్పం ఉండదనే అపవాదును తొలగించే కథలు ఇవి అని చెప్పవచ్చు. ఈ కథలు తెలంగాణకే కాకుండా అన్ని ప్రాంతాల ప్రజల జీవితాలకు అన్వయిస్తాయి. కాబట్టి ఈ కథలన్నీ ఇతర భాషల్లోకి అనువాదం జరగాల్సిన అవసరం ఉంది.

నిచ్చెనమెట్ల సామాజిక వ్యవస్థలో కులం ప్రాధాన్యత కలిగి ఉంది. ఊరు కట్టుబాటులో కొన్ని కులాలకు ‘వెలి’ తప్పలేదు. దీనితో వారి నివాసం ఊరికి దూరంగా ఏర్పాటు చేయబడి ఉంది. అయినా వారి శ్రామిక శక్తి ఊరి అభివృద్ధికి ఉపయోగపడింది. కానీ ఊరి కట్టుబాటు ఫలితంగా ఏర్పడిన సంచారజాతులు, ఉపకులాలు స్థిరజీవనానికి, సాంఘీక జీవనానికి నోచుకోకుండా ఉన్నారు. ఈనాటికి ఆయా జాతుల గుర్తింపు, వారి సంక్షేమం సరిగ్గా జరగడం లేదనేది నాగరిక సమాజం అంగీకరించే విషయం. అలాంటి సంచారజాతుల్లో ఒకటైన “గంగెద్ల” వారి జీవితాన్ని కథగా మార్చి అందరికీ అర్థమయ్యేలా చెప్పాడు. అదే పేరును పుస్తక శీర్షికగా పెట్టాడు. “లొట్టపీసు పూలు” కథలసంపుటిలాగే, “గంగెద్దు” కూడా విశేషమైన పాఠకాదరణ, పండితాదరణ పొందుతుందని ఆశిస్తూ, మిత్రులు శీలం భద్రయ్యగారికి అభినందనలు.

–0–



## విషయ సూచిక

# 1. గంట

భీవండి సాంచన్ల కంపిన్ల గంటలు ఊర్ల గుడి గంట మోగినట్టు ఆగకుండ మోగినై. నెత్తిన పిడుగు పడ్డట్టు ఉలిక్కిబడ్డడు నాగరాజు. అడుగులను వేగంగా పెంచిండు. అంగుకు పోకబోతే పనికి రానియ్యరు. కానూరు మాట్లాడితే పనిలకెల్లి తీసేస్తరు. అందుకని నాగరాజు ఒగర్సుకుంట కంపెనీ తానకు ఉరుక్కుంటొచ్చిండు. ఇరవై రూపాయల బస్సార్జికి సోచాయించి నడిసేసరికి, ఒళ్ళంత దిగచెమటలు వట్టినై. కంపినెదుటాగిన బస్సు దిగి సత్నారన్నతో కల్సి దబ్బదబ్బ గేటు లోపలికి ఉరికిండు. గేటులోపల అడుగు బెట్టినంక పానం నిమ్మలమైంది. చేతిలున్న సద్దిబువ్వ చేయి మార్సుకుంట, దమ్ము తీసుకొని, కంపెని మెట్లెక్కి లోపలికి నడిశిండు. నాగరాజును అంత దూరంలనే చూసి ప్రకాశు హాజిరేసిండు. అతనివైపు ఓ నవ్వు నవ్వి సాంచన్లను షురు జేసిండు నాగరాజు. 'తప్పు జరిగినప్పుడే, మనిషి సప్పుడెక్కువ జేసినట్టు' సాంచను ఏదో అనుము చెడినట్టుంది. సప్పుడు మారింది. దాని గొంతు పెంచింది. నాగరాజు పదేళ్ళ సంది ఆడ పనిజేస్తుండు. సప్పుడును పసిగట్టి, సాంచె పని తీరు పట్టేస్తడు. 'కుక్క వేషమేస్తే, కుక్కలా అరవక తప్పదు.' అంగీ, లాగు మార్చుకొని, బేరింగులల్ల గింత తైలం బోసి, పానాలనందుకొని సాంచను కిందికి చేరిండు. ఆ పనయ్యాక మల్లోపాలి సిచ్చు ఏసిండు. అది ఈపాలి నాగరాజు మాటిన్నది.

నాగరాజుకు సాంచను సప్పుడు సంగీతం లెక్కనే ఉంటది. ఎనక నుంచి ప్రకాశు పిలుస్తాంటే సాంచను సప్పుడుకు ఇనబడలేదు. దగ్గరికొచ్చి, "అరె రాజు భాయ్. ఆప్ కో ఘర్ సే ఫోన్ ఆయారే"అన్నడు. అతనిదీ నాగరాజు వయసే ఉంటది. బెంగాల్ నుండొచ్చిండు. హిందీలో మాట్లాడతడు. నాగరాజు ఆ ఫోను మాట్లాడినంక ఆదలబాదల ఊరికి బయల్దేరిండు. పోత పోత యజమానికి ఓ ముచ్చట చెప్పి పైసలు కావాలని అడిగి తీసుకొని బయటవడ్డడు.

సీదా నకిరేకల్లుకు బోయే టికెట్టు కొని బస్సెక్కిండు. కిటికీ పక్కన సీటు. శానాల్లకు ఇంటికి పోతుండు నాగరాజు. బస్సులో ఏదో హిందీ సినిమా గోల.

మనసు దాని మీద నిల్వలే. పసితనమంతాఉన్న ఊరు, కన్నతల్లిని ఇడిసిపెట్టిన బతుకాయే. ఎప్పుడెప్పుడు ఊరికి పోతనా? అని కిటికీ నుండి బయటకు జూసిందు. బయట కనబడే లోకం నిలకడతో లేదు. నాగరాజు మదిల ఆలోచన్లు గిరగిరా తిరిగినట్టు, చెట్లు పుట్టలు గిర్రున వెనుకకు ఉరుకుతున్నై.

***

వూరొదిలి పదిహేనేల్ల పొద్దయింది. అయ్య సంపాయించిన ఎకరం పొలం అయ్యతోబాటే పోయింది. ముత్తెమంత జాగ సుత మిగల్లే. ఆటెంక ఆ భూమిల అరెకరాన్ని కాలువ మింగింది. నోట్లె మన్నుబడ్డదని అవ్వ శానాళ్లు ఆ మనాదితో మంచమెక్కింది. అక్క లచ్చుమ్మ కూలినాలికి పోబట్టి కొన్నాళ్ళు పొట్టకు, బట్టకు గడిసింది. అవ్వ పాణం నిమ్మలమయినంక పూట గడవడానికి, నాలుగు చేతులాడినై. నాగరాజు సాంచన్ల పనిజేసుకుంట తెల్లంగ తెల్లార్లు నిద్రకాసి సంపాయించిన పైసలు అవ్వకు పంపిత్తే, ఇగురంతోని అప్పులు కోసుకుంట వచ్చింది.

అవ్వ రెక్కల మీదనే అక్క పెండ్లి చేసింది. పెట్టుపోతలు బానే పెట్టింది. “ఇల్లు కట్టి సూడు, పెండ్లి జేసి సూడు” అన్నట్టు, పెండ్లికి సేతిలున్న పైకం చాల్లేదు. ఎంకయ్య సేటు కాడ కాయితంబెట్టి అప్పు పుట్టించుకొచ్చి కార్యం కత కతయిందనిపించింది. మగదిక్కులేని సంసారం. అక్క లగ్గానికి నాగరాజు సుత రాకపోవడంతో బాగా ఎటమటమయ్యింది. “ముందు పెద్ద పండుగలున్నై. నువ్వు పోతే పని కాదు. ఇక్కడున్నోల్లు బొల్పరిస్తరు. కావల్నంటే ఎక్కువ పైసలు తీస్కో” అని, సేటు నాగరాజును ఇడ్సిపెట్టలేదు. పెండ్లి కర్సులున్నయని యోచన చేసిన నాగరాజు ఆడ్నే ఆగిపోయిండు.

గిప్పుడు పోదాం, గప్పుడు పోదామనుకుంట ఇన్నాళ్ళు గడిచిపోయింది. అక్క పెండ్లయి అర్నెల్లయింది. గిప్పుడు అక్క నీళ్ళు బోసుకుంది. పెండ్లప్పుడొప్పుకున్న కట్నమియ్యలేదని బావ అక్కను ఇంటికాడ దించిపోయిండు. “వసర్తితప్పి ఇయ్యలేకపోయిన. కొడుకు పెండ్లికిస్త బాంచన్. అది గిప్పుడు ఒట్టిమనిషి కూడా కాదాయె!” అవ్వ బావను ఒక్కతీరుగ బతిలాడింది. బావకు నెనరు కలగలే. “అరటి పండుల సూదిగుచ్చినట్టు” అల్కగ అమ్మగుండెల్ల బరువు దించి పోయిండు. బావ సైకిలు మీద బట్టలమ్ముతడు. పాతిక వట్టం, పరికె లాభం. “సైకిలు మీద బట్టలమ్మితే

ఎల్తల్లేదని, దుకానం నడిపిస్తని, పైసలు కావాలని" బావ ఒక్క తీరుగ శర్తు బట్టిండు. అక్కను జూసి అవ్వ గుండె తట్టుకోలే. దడొచ్చింది. మంచం పట్టిన అవ్వను జూస్తే అక్కకు ఏం జేయాల్నో తెల్వక భీవండిలున్న తమ్ముడు నాగరాజుకి కబురిచ్చింది. "అమ్మకు తబేదు బాలేదు. ఎట్టనన్నా వసర్తి చేసుకుని జల్ది పయనమయి ఊరికి రమ్మని" తమ్మునికి ఫోనుల మత్తలబిచ్చింది. దాంతో ఏకాయెకి ఊరికి పయనం కట్టిండు నాగరాజు.

***

"నకిరేకల్లొచ్చింది. దిగేటోల్లు లెవ్వాలి. ముందుగాలకు జల్దీ రావాలి" వోల్వో బస్సు క్లీనరు పిల్పుతోని ఉలిక్కిపడి నిద్ర లేశిండు నాగరాజు. చేతిలకు సంచి తీసుకొని ముందుకు నడిశిండు. డ్రైవరు వైపు చూస్తే, బస్సు డ్రైవరుకు నిద్రకాసి కండ్లుబ్బినై. ఇంకో డ్రైవరు పండుకుండు. "జీవితం లెక్కనే బస్సు నడుపుడు ఉంటట్టుంది. నడిపేటోనికే ఎరుకైతది సాదక బాదకాలు. కూసున్నోల్లకి పైనం నిమ్మలంగనే ఉంటది." అనుకుంట కిందికి దిగిండు.

బస్సు దిగేతోలికి అంబటాల్లయింది. బస్సుదిగిన నాగరాజుకు ఆగమాగం అయితుంది. "ఏనాడన్నా సుట్టపు సూపుగానన్న రానైతిన్నాళ్ళు. ఊరికొచ్చి పదేండ్లయింది. నకిరేకల్లు బాగా మారింది. ఇండ్లు బంగ్లాలైనై. మనుసుల కంటే ఆటోలు, బస్సులు పెరిగినై. ఊల్లెకు బోయే తోవ మర్సినట్టయింది." యోచన చేసుకుంట చౌరస్త దొరకబట్టుకొని ఆడ నిలబడ్డడు. జరసేపయినంక ఆటో ఒచ్చింది. అందుల నుండి ఒకాయన తలకాయ బయటకొచ్చింది. కొత్త మొకం. "అన్నా ఏడికి పోవాలె?"అని అడిగిండు. "ఒగోడు తమ్మీ"అన్నాడు నాగరాజు. "ఈ ఆటో ఆటే పోతంది. ఎక్కన్నా" అన్నడు ఆ ఆటో తమ్ముడు. నాగరాజు బ్యాగులు ఆటో ఎనకాలేసిండు. ఆటో ఎక్కికూసుండు. ఎక్కినంక లోపల ముత్తమ్మ చిన్నమ్మ ఉంది. గుర్తుపట్టి "చిన్నమ్మా బాగున్నవా?" అంటే, "ఎవలు బిడ్డా? గుర్తెరగలే. ఏమనుకోకు. ఎవలు నువ్వు జర చెబ్తవా నాయనాని" అడిగింది. నేను చిన్నమ్మా. నాగరాజును. కట్టమీది యాదమ్మ కొడుకుని". "ఓ బిడ్డా. నువ్వా! ఎన్నడో సిన్నతనాన పోతివి. అని కండ్ల నీళ్ళుపెట్టుకుంట, ఇదేనా రాకడ". ఔ... చిన్నమ్మా". అయితామాగని, కక్కయ్య ఎట్టున్నడు.?" "గట్టనే ఉండు బిడ్డా? అయేపాయె అన్నట్టే

ఉంది. ఇగ సూత్తవుగా. ఇంటికాడికి పోయినంక.” ఆటో పోతావుంటే పొలాలు, చెట్లు కనబడతయని బయటకు జూసిండు. అయ్యేవి కన్పించలేదు. ఎండిపోయిన పంటలు, వట్టిపోయిన చెరువులు, వక్కిపోయిన పోరగాల్లు కనబడ్తుంద్రు. కాలువున్న కాడ పొలముండదు. పొలమున్న కాడ నీల్లుండవు. రెండూ ఉన్న కాడ చేత చేసేవాడు ఉండడు. మనసులో అనుకుండు. మల్లా పాత రోజులు మల్లినట్టున్నై. బస్సులు లేవు. బండ్ల బాటలు నయం. నాగరాజు మది లెక్కనే డాంబరు రోడ్డు కూడా బాగా దెబ్బతిని ఉంది. ఊరు దగ్గరైతాంటే కుదుపులు మొదలైనై.

***

ఊర్ల అయ్య వెంకటయ్యకు మంచి నేతగాడనే పేరుంది. ఇల్లు రాములోరి గుడికాడనే ఉంటది. పండుగలప్పుడు పొద్దునాట్టు, పొద్దూకాల జనంతోటి గుడికాడ జాతరలా ఉండేది. అయ్యకు గుడి మైకులొచ్చే పాటలంటే ఇష్టం. మగ్గం మీద రకరకాల దోతులు, చీరలు, తువ్వాలలు నేసేది. ఈకులమాకులమని తేడాలేదు. అంతా ఇంటికొచ్చి కొనుక్కపోయేది. సేతిల పైసలాడ్తల్లేవు ఆటంక ఇస్తానన్న వుద్దెర్లే ఎక్కువ బోయేయి. తరువాత ఎటమటమయ్యిందని ఇయ్యనోల్లు ఎగదెంగినోళ్లె ఎక్కువ. అయినా అయ్య ఏనాడు ఆళ్ళను గట్టిగడగకపోయేది. వాల్లే మల్లోతేప వచ్చి ఏ బట్ట అడిగినా ఇచ్చేది. “ఎంకటన్నా! నీ చేతుల్ల నేసిన బట్ట తొడిగితే ఒళ్ళుకు మెత్తగుంటది. ఆగొస్తది. మిషను మీద బట్టలు చూపుకు ఆంతయి. కానీ మన్నవు” అనేటోల్లు. అయ్య నవ్వి ఊకునేది. ఏటేటా రాముని కళ్యాణానికి అయ్య నేసిన బట్టలే పెట్టేటోల్లు. అదేందో అయ్య బట్టలు గుడికి పోయినా, అయ్య గుడికి పొంగ ఎన్నడూ చూడలేదు.

పండుగ పబ్బమని లేకుండా ఇంట్లో మగ్గం ఎప్పుడాడేది. రాత్రి పగలు నడిచేది. మగ్గం నడిసినన్ని రోజులు అయ్య నేసిన బట్టలు దుకాణంలో పిప్పరమెట్లలాగ అమ్ముడుపోయినై. అయినా అయ్య అవ్వలేనాడు కొత్త బట్టలేసుకోంగ చూడలే. పిల్లలకు మాత్రం కొత్త బట్టలు వేసేది. మగ్గంగుంటలో అయ్య తెల్లంగతెల్లార్లు నిద్రకాసేటోడు. తోడుగ అవ్వ జోడు. అయ్యకేనాడు కంటి నిండా నిద్రలేదు. కడుపునిండా బువ్వలేదు. అయ్యకు కావాల్సిన రంగు రంగుల పోగులను అవ్వ పొతంజేసి ఇచ్చేది. చేయంగ చేయంగ తనాబ్బిల నాలుగురాళ్ళు ఎనకబడ్డె. ఎనకాల

మగ పిలగాడున్నడని, చేతులున్న పైసలకు, సేటుకాడ గింత అప్పుజేసి, ఎకరం చెల్క కొన్నడు. కొన్నంక దాన్ని పొలం చేద్దామని అరిగోస తీసి, అచ్చుకట్టి, బోరు పొడిసేసరికి అప్పు పెరిగింది. అప్పుల కాపరం గతుకుల బాటయ్యింది. "అప్పులేని గంజి దొప్పేడే సాలు. మనకు అప్పొద్దయ్యా" అని అవ్వ మొత్తుకున్నా అయ్య ఇనిపించుకోలే. అయ్య మిత్తీలు కట్టాలని ఎగుసాయం, నేతపని రెండు పడవల పయానం మొదలుపెట్టిండు. ఎగుసాయంల ఎద్దేడ్సింది. ఇంటికాడ అవ్వేడ్సింది.

ఇంకోవైపు అయ్యకు ముకముద్దరకిస్తుంది. "దవకానాకు పోదామని" అవ్వంటే, అయ్య పట్టించుకోలేదు. "నిద్రకాసి గట్టయిందని" దాటేశిండు. కొన్నాళ్ళకు తబేదు కరాబయ్యింది. కడుపులో నొప్పి పెరిగితే అయ్యను పెద్దాసుపత్రికి తోలుకబోయిందవ్వ. అయ్యకు కిడ్నీల జబ్బు ముదిరిందని వైద్యుడు జెప్పిండు. అయ్య ఓటికుండై మొకంల జీవకల పోయిందని చుట్టుముట్టు జనం అనేది. ఆయన మొగంలో ఇంతకు ముందున్న నవ్వుపోయింది. పిల్లగాండ్ల కండ్లల్ల ఆకలి తేలింది. ఆగి ఆగి నడుస్తున్న మగ్గం ఆకలి కడుపులకు సరిపోలేదు. అయ్యకు కడుపాశింది. "అయ్యకు పాణం బాగాలేదని బయట చెప్పొద్దు బిడ్డా!" అని అవ్వ చెప్పేది. "ఇంగువ గట్టిన గుడ్డ.. వాసన పోనట్టు" ఎట్టనో ఆ ముచ్చట అప్పులోల్లకు తెల్సిపోయింది.

అప్పులోల్ల బాధకు అయ్య గోస దీసుకుంటనే మగ్గాన్ని ఆడిచ్చిండు. మగ్గం సప్పుడుల అయ్య కడుపు నొప్పి మూల్గులు బయటకు తెల్వలే. కన్నునొప్పి ఇంకో కన్నుకే తెలుస్తదన్నట్టు అయ్య నొప్పి అవ్వకే తెలుసు. ఒంటేలుకు అద్దనేత్రికాడ లేసినప్పుడు కూడా వాళ్ళు మగ్గం గుంటల్నే ఉండేది. "ప్రభుత్వ ఆసుపత్రికి పోదామయ్యా" అని అవ్వ అన్నా, అయ్యరానని నొప్పినోర్సుకుండు. కిడ్నీలు పేయిలై కుటుంబాన్ని అప్పులోల్ల ముందు ఓడిచ్చినై. అయ్య పోయినా అప్పులు మిగిలినై. "ఎద్దు పుండు కాకికి ముద్దా?". అప్పులోల్లు నిలబడనీయలే. అయ్య రక్తమాంసాలు దారపోసి కొన్న ఎకరంలో కాలువకుపోంగ మిగిలిన అరెకరానికప్పుడు మూర్తమొచ్చింది. సేటుతాన అడ్డికి పావుశేరుకాడికమ్మి అప్పులు కట్టింది అవ్వ. దేవునికి బట్ట ఇచ్చిన ఆ కుటుంబానికి గుక్కెడు గంజి లేదు. ఈడొచ్చిన పిల్ల గుండెల మీద కుంపటటైనదని అవ్వ నకిరెబట్టి మనాదితో మంచం బట్టింది. ఆకలికి నాగరాజు తట్టుకోలేక గుడికాడ పలారానికి ఎగబడ్డడు.

గుడి కాడ పూజ అయిపొంగనే దినాం గంట మోగుతది. తరువాత తీర్థ, పలారం పెడ్తరు. పులోర పలారం. అర చేయి మందం తీసిపెడ్తరు. పలారమనంగనే గూడెం కాంచి పోరగండ్లు, పొట్టేగండ్ల మంద పెద్దది ఒకటి దిగుద్ది. అయ్య ఉన్నన్ని దినాలు గుడి మెట్లెక్కని నాగరాజుకు ఆకలి బాటేసింది. బడిగంట బంద్దైంది. ఇప్పుడు గుడిగంటే ఇనబడుతుంది. దినాం ఆ పలారం తిని నీళ్ళుతాగి కడుపు నింపుకునేది. ఒక్కోపాలి అది సరిపోక మల్లోపాలి పలారానికి పోతే చేతికున్న పసుపు రంగు సమురు చూసి కసిరిచ్చుకునేది. ఆకలి గోస అయ్యోరికేం తెలుసు. దాన్ని మర్సిపోడానికి గూడెం పోరగాల్లతో కల్సి పోరంబోకు మడికట్లల్లకు బోయి సిర్రగోన ఆడేది. "ఇంటికాడుండి యేలకు అవ్వను చూసుకుంట, పొద్దూకాల గింతబువ్వ ఉడకబెట్టేయ్యంటే గూడెం పోరగాల్లతో సిర్ర గోనాడతవా"ని అక్క లచ్చుమ్మ ఓనాడు యాష్టకొచ్చి పొట్టుపొట్టు దంచింది. ఒళ్ళంతా దద్దులు పట్టినై. సీకటి పడకముందే బువ్వ తినకుంటా అక్కమీద అలిగి నిద్రబోయిండు నాగరాజు. ఓ రేత్రికాడ లచ్చుమ్మ తమ్ముని ఒంటిమీద పడ్డ దద్దుల మీద ఆముదం పూసుకుంట ఏడుస్తుంది. ఆ ఏడ్పువిని నాగరాజులేసి కూసుండు. బువ్వ తాగకుండ పండుకున్న తమ్మునికి తట్ల బువ్వ తెచ్చింది. అలిగిన తమ్మున్ని బుదగరిచ్చి, బువ్వ తినిపిచ్చింది. అక్కా, దసర పండుగొస్తంది. బట్టలు కొనియ్యవా? అని తమ్ముడు అడిగేసరికి, అక్క గోడ మీదున్న అయ్య ఫోటో చూసి కండ్లల్ల నీళ్ళు నింపుకుంది.

నాగరాజుకు మనసంతా ఎట్లనో అయింది. వద్దులే అక్కా! అని పండుకుండు కని నిద్ర రాలేదు. దసర పండగకు పెద్దయ్య కొడుకు సత్నారి భీవండి కాంచి వచ్చిండు. "అన్నా! నాగరాజును భీవండి తోల్కబోరాదే. ఈడ వట్టిగ పోరగాండ్లతో మడికట్ల బడి తిరుగుతుండు." అని బతిలాడింది. సత్నారన్న మంచోడు. సరే సెల్లే అని నాగరాజును భీవండి తీసుకబోయి, ఓ పనోడిని చేసిండు. పదిహేనేండ్ల తరువాత ఇన్నాళ్ళకు నాగరాజు ముకాన్ని ఊరు చూడబోతుంది.

***

నాగరాజు లెక్కనే ఊరంతా మారింది. కట్ట మీదాగింది ఆటో. చిన్నమ్మ ఆటో దిగినాక కూడా ఏదో ఊరు ముచ్చట చెబుతుంది. గుడిల గంటలు మోగినై. పెద్ద పోరగాండ్ల గుంపు నాగరాజును తోసుకుంటనే ఉరికింద్రు. ఊరు జూస్తే

గోడలు ఎలిసినై. మనుషులు కూడా మాసిపోయింగ్రు. ఊరు చిన్నగైనట్టనిపించింది. ఇల్లు దగ్గరికొచ్చింది. నాగరాజు పోయినప్పుడు గూనపెంకలుండే. గిప్పుడది బెంగుళూరు పెంకలైంది. అక్క పెండ్లికి మార్సినట్టుంది. ఇంటి పక్కలుండే "కక్కయ్య. బజాట్ల ఏప చెట్టుకింద కాళ్ళ మంచం మీదుండు. గుర్తుబట్ట లేకుంటయిండు. మంచం కింద బుడిశెంబు. దానిమీద మూత ఉంది. యాభై ఏళ్లకే పక్కన కర్ర. ఆ రోజుల్లో ఆ వాడ కట్టునంతా ఓ మోపున మగ్గాలాడేది. కక్కయ్య తెల్లారేసరికి మూడు చీరలు నేస్తే, అయ్య నాలుగు నేసేది. గంత పోటీ ఉండేది. అయ్య లెక్కనే కక్కయ్య అంత అజం కల్ల మనిషి. అట్టున్న కక్కయ్య గిప్పుడు నకిరెబట్టిండు. మంచానికి ఇరుక్కబోయినట్టుండు. మనిషి బాగా దగ్గర పడ్డడు.

"ఎట్టున్నవే కక్కయ్యా? ఒళ్ళు సుస్తయిందని అక్క ఫోనుల చెప్పింది. పాణం నిమ్మలమయిందా?"

"ఎవలూ బిడ్డా! కండ్లు పురాగ కనబడ్తల్లేవు."

"నీ యమ్మ గుర్తుబట్టలేదానే...నేనే ...నాగారాజును"

"కండ్లు కనబడ్తల్లేదు బిడ్డా! నాగరాజా! వామ్మో ఎన్నాళ్ళకు చూస్తిని. ఇదేనా రాకడ..బిడ్డా"

"ఔ! కక్కయ్యా, నకిరెకంటికాడ మంచి డాక్టరున్నడాట సూపిచ్చుకోబోతివా"

"సూపిచ్చుకున్నయ్యా... !"

"ముఖం ఆ తీరుగా ఉద్దరకిచ్చింది. ఇంతకూ డాక్టరు ఏమన్నడే కక్కయ్యా!"

"సుగరుతోని కిడ్నీలు పాడైనయని చెప్పిండు బిడ్డా! పెద్దాసుపత్రికి బోవాలన్నడు"

"అప్పుడే ఆడికి వచ్చిన తమ్మున్ని పిలిసింది చిన్నమ్మ. ఆని చేతికి పసుపు కలిపిన సమురుంది. ఎట్టనన్న గీన్ని భీవండి పోతప్పుడు తీసుకబో బిడ్డా!, అప్పులోల్లు ఆగుతల్లేరు. ఒక్కతీరుగ పొడుస్తుంగ్రు." అని చీరకొంగు నోటికి అడ్డం పెట్టుకొని, ఏడ్పునాపుకొని, మాటలు బయటకొదులుతుంది. "సరే చిన్నమ్మా! గట్టనే తీసుకుబోతా. నువ్వు దైర్నం చెడకు." ఆ మాటకు, చిన్నమ్మ కండ్ల కారిన కన్నీళ్ళల్ల, బతుకాశ తలుక్కున మెరిసింది.

మూలకుపడ్డ కక్కయ్య మగ్గం ఇంటిబయట ఎండకు ఎండి, వానకు తడిసి ఎలిసిపోయి కనబడ్డది. కొడుకు మాటిన్న అవ్వ బయటకొచ్చింది. శానాల్ల తరువాత

కొడుకును చూసిన అవ్వ నీల్ల కుండైంది. పైట కొంగు ముకాన పెట్టుకొని బోరున ఏడ్సింది. అక్క కండ్లల్లతో బాటు చిన్నమ్మ, అక్కడున్న వాళ్ళ కండ్లల్లో నీళ్ళు తిరిగినై. అమ్మ పావురంతో ఏడ్సిన ఏడ్పును చుట్టుపక్కలమ్మలక్కలు అంతా తలోమాట ధైర్నం చెప్పి, ఊకుంచింద్రు.

***

రెండు దినాలైనంక బావను పిలిపిచ్చిండు నాగరాజు. ఒక్క మాటనలె. బావకు, బావతోనొచ్చిన పెద్ద మనుషులకు మంచిగ సుట్టిర్కం జేసిండు. ఆళ్ళ ముంగలనే బాకీ ఉన్న తతిమ్మా కట్నం పైసలు కట్టిండు. "కొడుకు నిదానస్తుడు. మంచోడు. చేతికందొచ్చిండని అమ్మలక్కలనేసరికి అవ్వ సంబరపడ్డది. ఆమె పానం తేలికవడ్డది. సంబురంగా బిడ్డని అత్తగారింటికి పంపింది.

***

అవ్వను భీవండికి రమ్మంటే "నేను రాను బిడ్డాన్నది." అవ్వను ఒదిలి పెట్టడానికి నాగరాజుకు మనసైతల్లేదు. ఇంకోవైపు చిన్నమ్మ, "ఎప్పుడు పోతవు కొడకాని" అడగబట్టింది. పొద్దుపోక మడికట్లల్లకు నడిసిండు. ఆడుకునే పోరగాల్లు పెరిగింద్రు. ఆల్ల ఆటలు జూసుకుంటున్న నాగరాజుకు కాసేపటికి గుడిల గంటలు ఇనబడ్డయి. పోరగాండ్లు ఉరుకుత గుడికి జేరింద్రు. ఆల్ల ఎనుకనే నాగరాజు కూడా నడిశిండు. అయ్యగారు పలారం పెడుతుండు. అదే అయ్యగారు. 'నోరు నెత్తినుంటే పెత్తనం ఎంటనే ఉంటదన్నట్టు' గుడిమీద బతుకుతున్న అయ్యోరుకు ఆదెరువు పోలేదు. కానీ మగ్గం మీద బతుకుతున్న కక్కయ్య పని మూలకు పడ్డది. "ఎంత పెరిగినా గొర్రెకు బెత్తెడే తోకన్నట్టు" అడుగు జీవితాలకు ఎప్పటికీ ఎదుగు లేదు. "నల్లరాయి మీద బొగ్గు గీత, సున్నపురాయి మీద తెల్ల గీత కనబడనట్టు" మానం కాపాడే అయ్య, కక్కయ్యల బతుకులకు ఇలువ లేదాయే.

అట్టనే సోచాయించుకుంట అయ్యగారు పెడుతున్న పులిహోరకు ఆకలి లేకున్నా అలవాటు కొద్దీ అరచేయి సాపిండు నాగరాజు. అయ్యగారు నాగరాజును గుర్తుపట్టలేదు. నాగరాజుకు ఆయనతో మాట్లాడాలనిపించలేదు. అయ్యగారు పులిహోర పెట్టిండు. తీసుకొని ఓ మూలకు కూర్చుండు నాగరాజు. చేతిల పలారాన్ని చూస్తే గతం యాదికొచ్చింది. ఇంతలో ఓ పిలగాడు పలారానికి రెండోపాలి

పోయిండు. వాని చేతికంటిన పసుపు సమురు చూసి అయ్యగారు తిట్లదండకం ఎత్తుకుండు. 'సత్రం దానానికి, సర్కారు అనుమతి' అన్నట్టు పిల్లలకు పెట్టే పలారానిపై నడ్మిట్ల అయ్యగారి పెత్తనమేంది?' నాగరాజుకు అర్థం కాలేదు. ఆకలి కన్నా అవమానం పెద్దది. ఆకలికి అవమానం అలవాటయింది. ఆకలి ఎదురుతిరిగితే అవమానం తోకముడుస్తది. కానీ ఆకలి ఒంటరిది. అందుకే పిలగాడు తలకాయ వంచుకుని పలారానికి నిలబడ్డడు. నాగరాజు ఓ నిర్ణయానికొచ్చిండు. లేసి తన చేతిలోనున్న పలారాన్ని ఆ పిలగాడికిచ్చి, అతని భుజం మీద చెయ్యేసి, తలనిమిరి గుడి బయటకు నడిసిండు.

***

శానొద్దులకు పోరంబోకు మడికట్లల్ల గంట మోగింది. ఊర్ల నుండి సద్దులు పట్టుకున్న సత్నారన్నతో బాటు, గూడెం సంది చీమల దండు కదిలింది. గంట మోగగానే శాంచలు మొదలైతున్నై. కొన్నాళ్ళకు ఊర్ల మాసిపోయిన గోడలకు, మనుషులకు రంగులొచ్చాయి. నాగరాజు భీవండి గంటలను ఊరికి పట్టుకొచ్చిండు. సత్నారన్న సాయంతో పాత సాన్చన్లను తక్కువ ధరకు కొని, భీవండి నుండి పట్టుకొచ్చిండు. నాగరాజు ఇకమతు జూసిన జనం, తలో చేయ్యేసింద్రు. నపరిన్ని పైసలు పోగు జేసిచ్చింద్రు. రెండు శాంచన్లు పోయి నాలుగు దినాల్ల ఆరైనై. పదింతలైనై. ఏడాది తిరిగేసరికి కక్కయ్యకు ముఖం తెలివొచ్చింది. పోరగాండ్ల పసితనం యాడికి తాకట్టుకు పోలేదు. ఎంకయ్య సేటుకాడ బాకీపడ్డ అప్పు కాయితాలకు రెక్కలొచ్చినై. అయ్యోరు నోరు మూతబడింది. గుడిల గంట బంద్దైంది. గిప్పుడు ఊర్ల పనిగంట, బడిగంట సప్పుల్లే ఇనబడ్తున్నై.

******

**– వెలుగు, 31 అక్టోబరు 2021**

# 2. సిగ్గు

అమ్మమ్మంటే మనీషకు చాలా ఇష్టం. ఎప్పటిలాగే దసరా పండుగ కని అమ్మమ్మింటికి వచ్చింది. ఇంటివెనకాల ఉన్న తనకిష్టమైన దేవదారు చెట్టు కింద కూర్చుంది. ఆ చెట్టు వీచే చల్లటి గాలి చిన్ననాటి జ్ఞాపకాలన్నీ మోసుకొచ్చినట్టు పరిమళం మనసుకు హాయిగా తగులుతుంది. చిన్నప్పుడు ఆరో తరగతి వరకు అమ్మమ్మ దగ్గరే ఉండి చదువుకుంది. అమ్మమ్మ ఆ చెట్టులాగే బలంగా నిబ్బరంగా ఉండ గలిగే మనిషి. పండుగలకు అమ్మమ్మ ఆ చెట్టుకు శ్రద్ధగా, ప్రత్యేకంగా పూజలు చేస్తుంది. దానిని ఇంట్లో మనిషిలాగ భావించి, దాని ఆలనా పాలనా చూస్తుంది. అమ్మమ్మ పుట్టినపుడు పెట్టిన చెట్టట అది. దాని ఎదుగుదలలో నేలగట్టిదనంతో పాటు అమ్మమ్మ పట్టుదల తెలుస్తుంది. ఆ చెట్టు ఎన్ని కరువులను చూసిందో, ఎన్ని బరువులను మోసిందో? అమ్మమ్మలాగే ఇప్పటికీ నిబ్బరంగా, నిటారుగా నిలబడి చక్కని నీడనిస్తుంది. ఆ చెట్టు నీడలో పశుపక్షాదులు ఆశ్రయం పొందుతున్నట్టు మేము అమ్మమ్మ చేతికిందే వృద్ధిలోకి వచ్చాము.' హైదరాబాదుకు వెళ్ళగానే ఎలాగైనా సరే ప్రసాదుకు ప్రేమ విషయం చెప్పాలి. మనీషా ఆలోచనల్లో ఉండగానే "మనీషా.. మనీషా.." అంటూ పిలుస్తూ వచ్చింది అమ్మమ్మ. వచ్చి దగ్గరగా కూర్చొని తల నిమురుతూ ఆప్యాయంగా... "ఎప్పుడూ ఒక్కదానివే రాకపోతే, పిల్లలను కూడా తీసుకురావొచ్చు గదమ్మా. ఈ ఊరు, స్వచ్ఛమైన గాలి వాళ్లకు అలవాటవుతుంది." ప్రేమగా మందలించింది అమ్మమ్మ."ఈసారి తీసుకొస్తానమ్మమ్మా..." గోముగా జవాబిచ్చింది మనీష.

చిన్నప్పటినుండి మనీషకు అమ్మమ్మ మంచి స్నేహితురాలుగా మెలిగేది. అమ్మమ్మ వయసేం అంతగా కనబడదు. అమ్మ పుట్టగానే తాతగారు చనిపోయారట. బాల్య వివాహం చేసుకున్న అమ్మమ్మకు తాతయ్యతో గాఢమైన జ్ఞాపకాలేవి లేకుండానే దూరమయ్యారని చెబుతుంది. మనీష అచ్చు అమ్మమ్మ పోలిక. మనీష అందం ముందు అప్సరసలు సరి తూగలేరు. మనీష ప్రతి దసరా పండుగను అమ్మమ్మ ఇంటిగ్గరే జరుపుతుంది. పండుగ పూజ అయిపోయాక అమ్మమ్మ తనతో బాటు దేవదారు చెట్టుకు కూడా కంకణం కట్టింది. దాని మాను అడుగున చేసిన పిండి వంటలు కూడా పెట్టింది. అమ్మమ్మ శ్రద్ధగా చేసే ఆ పని మనీషకు చిన్నప్పటి

నుండి చూసి చూసి అలవాటైపోయింది. పట్నం మనుషులకు ప్రకృతి పూజ గురించి అమ్మమ్మతో పాఠం చెప్పించాలనిపించింది. పండుగ తెల్లారి ఆఫీసుకు పోవాలని మనీష హడావుడిగా హైదరాబాదు బయలుదేరింది. అమ్మమ్మ నాల్రోజులు ఉండమని బలవంతపెట్టినా, ఆగని మనీషను భారంగా సాగనంపింది అమ్మమ్మ. వాస్తవానికి మనీష తొందరకు బలమైనకారణం ఉంది. అదే ప్రసాదు. అతన్ని త్వరగా కలవాలి.

***

మనీష కారు ఖరీదైన హెూటల్ ముందు ఆగింది. డ్రైవరు కారుదిగి డోరు తెరిచాడు. కిందకుదిగి హెూటలులోనికి నడిచింది. అప్పటికే ఆ హెూటల్ లో టేబుల్‌ను బుక్ చేసుకుంది. తన పేరుతో నున్న టేబుల్ ను చేరుకుంది. అందంగా అలంకరించబడిన టేబుల్ వద్ద ఉన్న మెత్తని కుర్చీలో కూర్చుంది. మిత్రుడు ప్రసాదు ఇంకా రాలేదు. చుట్టూ చూసింది. అద్దాల మేడలో ప్రకృతి అందాలను బంధించినట్టు తన మనసులో బంధించిన భావాలను ప్రసాదుతో పంచుకోబోతుంది. కొద్దిగా సిగ్గు బిడియం కలిగింది. ఈలోగా వెయిటర్ వినమ్రంగా వచ్చి అభివాదం చేశాడు. దాంతో పాటు మెనూకార్డు టేబుల్ మీదపెట్టి వెళ్ళాడు. మెనూకార్డు అందుకుంది. కానీ ఆమె ధ్యాస దానిమీద లేదు. మనసంతా గజిబిజిగా ఉంది. ప్రసాద్ ప్రేమ వివాహ ప్రతిపాదనను అంగీకరిస్తాడా? లేక అవహేళన చేస్తాడా ? మెదడంతా సందేహాలతో నిండిపోయింది.

***

హైదరాబాదులో ప్రసాద్, మనీషలు చిన్ననాటి నుండి చనువుగా పెరిగారు. వారు ప్రతిభావంతులు. పోటీ పడి చదువుకున్నారు. పక్కపక్కనే ఇళ్ళు. ఇరువురి కుటుంబాలు స్నేహంగా ఉండేవి. ప్రసాద్, మనీషలు బాగా చదివి చిన్నవయసులోనే పెద్దస్థాయి ఉద్యోగాలు సాధించారు. ఆ వెంటనే వారికి నచ్చిన వారితో వేరువేరుగా పెళ్ళిళ్ళు కూడా ఘనంగా జరిగాయి. మనీషకు ఇద్దరమ్మాయిలు. పెద్ద కూతురు ఎం.బి.ఏ చదువుతుంది. చిన్న కూతురు పదవతరగతి చదువుతుంది. ప్రసాదుకు కూడా ఇద్దరు పిల్లలు. అబ్బాయి సాఫ్ట్వేర్ ఇంజనీరు. కూతురు అమెరికాలో చదువుతుంది. ఇద్దరికీ పిల్లల చదువు, పెళ్లి బాధ్యతలు ఇంకా మిగిలే ఉన్నాయి.

***

మనీష తెగని ఆలోచనల్లో ఉండగా ప్రసాదు అక్కడికి వచ్చాడు. రావడంతోనే "మనీష నీకేమైనా పిచ్చిబట్టిందా? ఫోనులో ఏమిటి ? ఆ తల తిక్క ప్రతిపాదన"

అని సుతిమెత్తగా కోప్పడ్డాడు. మనీష చిన్ననాటి నుండి ప్రసాదు అంతరంగం ఎరిగినదే. ఆశ్చర్యపోలేదు. అయినా ప్రసాదు మాటలతో కొద్దిగా ఆందోళన చెందింది. ఈలోగా అక్కడికి వచ్చిన వెయిటర్ కు కాఫీ ఆర్డర్ చేసింది.

"ప్రసాద్ ! ఒక్కసారి ఆలోచించు. తప్పేముంది. మన రెండు కుటుంబాల స్నేహాన్ని బంధుత్వంగా మార్చాలని ప్రయత్నం చేస్తున్నాను ఏమంటావు? చిరునవ్వుతో, కొంటెగా అడిగింది. ప్రసాదు కొంచెం భయంగా, కోపంగా 'నా కెందుకో.. నీ ప్రపోజల్ నచ్చడంలేదు. "ఆకలంతా అయిపోయాక అన్నమెందుకు? వయసంతా అయిపోయాక మొగుడెందుకు?" అన్నట్టు ఇలాంటివి బాగుంటాయా?" సందేహపడుతూ యధాలాపంగా అన్నాడు. "పిల్లల పెళ్ళిళ్ళు చేయాల్సిన ఈ సమయంలో మనం ఇలాంటి నిర్ణయం తీసుకోవడం వలన సమాజంలో చిన్నచూపుకు గురవుతావేమో ఆలోచించు" తన సందేహాన్ని బయటపెట్టాడు.

"ప్రేమకు వయసేంటి ప్రసాదు? ఏం పర్లేదు నేను చూసుకుంటా" అనే హామీని, ధైర్యవచనాలను టేబుల్ స్పూన్ లో చెక్కెర తీసుకొని, కాఫీ కలిపి, కప్పు అందిస్తూ ప్రసాదుకు ఇచ్చింది. "అంతేనంటావా ...?" ప్రసాదుకు కొంత ధైర్యం కలిగింది. పరస్పర అంగీకారాన్ని తెలుపుకున్నారు. కాఫీ తాగి వెయిటర్ కు టిప్పు ఇచ్చి బయటకు నడిచారు.

***

మనీష ఆలోచనల్లో పడింది. అమ్మకు ఈ విషయాన్ని ఎలా చెప్పాలి? ఇంతలో అమ్మ భోజనాలకు రమ్మని పిలిచింది. భోజనాల కోసం హాలులో ఉన్న డైనింగ్ టేబుల్ దగ్గరికి వెళ్తే, అప్పటికే అక్కడ చుట్టూ తన పిల్లలు, భర్త కూర్చొని ఉన్నారు. ఇంకోవైపు నాన్న కూర్చున్నాడు. అమ్మ అందరికీ వడ్డిస్తుంది. "ఏమిటే..మనీష అలా ఉన్నావు? రా వచ్చి కూర్చో" అని ప్రేమగా పిలిచింది అమ్మ. మనీషకు ఒక ఆలోచన తట్టింది. వెంటనే ఉదయం ప్రసాదుతో చేసిన పెళ్లిప్రస్తావన గురించి వివరించింది. అమ్మ విస్తుబోయింది. "ఈ వయసులో పెళ్లి ఏంటీ.. ? మనీష నీకేమైనా పిచ్చా?" అదే ప్రశ్న తల్లినోట కూడా వినేసరికి మనీష మనసులో నవ్వుకుంది.

భోజనం చేస్తున్న తన భర్త నోట కూడా అదే ప్రశ్న. భోజనాలకు కూర్చున్న పిల్లలు, నాన్న మాత్రం మనీషకు మద్దతు పలికారు. పైగా మనీష తన తల్లిని ఒప్పించడానికి వాళ్ళు తమ తమవంతు ప్రయత్నం చేశారు." చివరకు ఈ విషయం

ఇక్కడ కాదు. అమ్మమ్మ వాళ్ళింట్లో తేలాల్సిందే" అని చెప్పి మాటను, ఆ వెంటే భోజనాన్ని కూడా మనీష ముగించింది.

***

మనీష కుటుంబంతో సహా అందరూ కారులో వెంపటి చేరుకున్నారు. మనీషను కుటుంబంతో పాటు చూడగానే అమ్మమ్మ ఆనందంలో ఉబ్బితబ్బిబ్బయింది. పచ్చని దేవదారు చెట్టు వారికి చల్లని గాలిని వీస్తూ ఆహ్వానం పలికింది. రాత్రిపూట బోజనాలకు కూర్చున్నప్పుడు మనీష తల్లిని "ఆ విషయం ప్రారంభించమని" సైగజేసింది. తల్లి అంజలి సిగ్గుపడింది. "నేను అమ్మకు చెప్పలేను" తన నిస్సహాయత తెల్పింది. లాభం లేదని అమ్మమ్మతో మనీష నేరుగా తన మనసులోమాట చెప్పింది.

"నీకేమైనా పిచ్చా? ఈ వయసులో నాకు పెళ్ళేంటే ? అమ్మమ్మ కూడా అదే ప్రశ్న వేయడంతో బిత్తరపోయింది మనీష. మారు మాట్లాడలేదు. ఆ విషయాన్ని ఎలా కొనసాగించాలో అక్కడెవరికీ బోధపడలేదు. పాపం మనీషను అందరూ జాలిగా చూశారు. భోజనాలు ముగించి, అందరూ నిద్రకుపక్రమించారు. మనీషకు చాలాసేపటివరకు నిద్రపట్టలేదు. అమ్మమ్మను ఎలా ఒప్పించాలో తెలియక సతమతవుతుంది. చాలాసేపటి తరువాత ఒక నిశ్చయానికి వచ్చి హాయిగా రెప్పలుమూసింది.

***

మనీష దసరా పండుగకు వచ్చినపుడు కొన్ని కొత్త విషయాలు తెలుసుకుంది. తాత పోయాక అమ్మమ్మ తన బిడ్డను తీసుకొని వాళ్ళ తల్లిగారి ఊరు అర్వపల్లిలో ఉండేదట. ఆ ఇంటికి సమీపంలోనున్న మురళీకృష్ణ అమ్మమ్మను చాలా ఇష్టపడ్డాడట. మురళీకృష్ణ రూపం సినిమాహీరోలా ఉంటుందట. ఆ సమయంలో మురళీకృష్ణ అమ్మమ్మను పెళ్లి చేసుకుంటానని పెద్దలదగ్గర పెద్ద సాహసమే చేశాడట. ఇరువైపున కుటుంబసభ్యులు తీవ్రంగా వ్యతిరేకించారు. అటువైపున ఉన్నవాళ్ళు అమ్మమ్మను మాటలతో వేధించారట. అమ్మమ్మ మనసులో కృష్ణను ఇష్టపడ్డా...వాళ్ళ పెళ్ళికి ఆచారాలు, పెద్దలు అడ్డుపడ్డారు. దాంతో పెద్దలను ఎదిరించలేక చాలా కాలం వరకు వాళ్ళు ఒప్పుకుంటారోనని ఎదురుచూసి చూసి చివరికి పెద్దల ఒత్తిడికి తలొగ్గి అయిష్టంగా వేరే అమ్మాయితో పెళ్ళిచేసుకున్నాడు. తరువాత అమ్మమ్మ, మురళీకృష్ణ బాటలు దూరమయ్యాయి.

ఆ విషయాన్ని తెలుసుకున్న మనీష మురళీకృష్ణ వేటలో పడింది. అతని

గురించి తెలుసుకోవాలని ఆత్రుతపడింది. తొందరగానే అడ్రసు చిక్కింది.ఆయన ఎవరోకాదు. స్వయానా ప్రసాదు వాళ్ళ పెదనాన్న. ప్రస్తుతం భార్య పోయాక ఆయన్ను కొడుకులు అనాథాశ్రమానికి చేర్చారు. అక్కడికి వెళ్లి అమ్మమ్మ గురించి చెప్పగానే ఆయన కళ్ళల్లో మెరుపును గ్రహించింది. తన ఆశక్తతకు ఆయన చాలా బాధపడ్డారు. అమ్మమ్మతోనున్న అనుబంధాన్ని నెమరు వేసుకున్నారు. అమ్మమ్మ బాగోగుల గురించి ఆసక్తిగా అడిగారు. దాంతో మనీష ఒక నిశ్చయానికి వచ్చి అక్కడ నుండి బయలుదేరింది.

***

పట్టువదల్లేదు మనీష. నాన్న, ప్రసాదుల సాయంతో మురళీకృష్ణను పిలిపించింది. దేవ దారు చెట్టు కింద అమ్మమ్మతో ఏకాంతంగా మురళీకృష్ణకు సమావేశం ఏర్పాటు చేసింది. విత్తు నుండి చెట్టు పుట్టినా, చెట్టు నుండి విత్తు పుడుతుంది. ప్రేమ దాని జీవలక్షణం. మనుమరాలు మనీష చేసినపనికి అమ్మమ్మకు కోపం వచ్చినా, అప్పటిదాక అంగీకరించని అమ్మమ్మ, మురళీకృష్ణను చూడగానే మౌనం వహించింది. ఇంకా అమ్మమ్మ సిగ్గు మర్చిపోనట్టుంది. ముఖాన బుగ్గలు ముడతలతో బాటు ఎరుపెక్కాయి. దేవ దారు చెట్టు తన సంతోషాన్ని చాటుకుంది. కాలం మోసిన చిలిపి ప్రేమ కథను మరవని ఆ చెట్టు ఆకులను, పూలను తలంబ్రాలుగా చల్లింది.

******

**-న్యాయనిర్ణేత కథ, సక్కనితొవ్వ- భానుపురి సాహితీవేదిక ప్రథమ వార్షికోత్సవ సంచిక, అక్టోబరు 2021**

# 3. గంగెద్దు

"రంగయ్య పంతులు పెండ్లాం పోయిందట. పట్నంకెల్లి పీనిగ నేసుకొచ్చింగ్రు. కర్ణాలింటికి జాతర సాగుతుంది. ఊర్ల ముచ్చటను మోసుకొచ్చి పెండ్లాం ముత్తికి చెప్పిండు గట్టయ్య.

"పెండ్లాం, మొగలకు పడక, శానాల్ల కిందనే ఇడుపు కాయితాలు తీసుకుంగ్రంటివి గదయ్యా!?" అనడిగింది ముత్తమ్మ అమాయకంగా.

"ఏ..ఉట్టిదేనట. ఆల్ల భూమి పుత్రను కాపాడుకోడానికి ఇడాకుల నాటకమట. ఆనాడు అమ్మగారు తల్లిగారింటికి పోయిన అదేపోకడ. ఇన్నాళ్ళకు అమ్మగారి పీనిగొచ్చింది. పీనిగను ఊరంతా చూసేటందుకు దారి గట్టింగ్రు." అని గట్టయ్య జెప్పిండు.

"సక్కని తల్లి. ఆయమ్మిచ్చిన కోడె ఇయ్యాల మనకింత బువ్వ పెడుతుంది. నేబోయి చూసొస్తనని" పీనిగ కాడికిపోయింది ముత్తమ్మ.

***

కర్ణప్పంతులు రంగయ్య ఆ ఊరికి పెద్ద భూ కావందు. రంగయ్య పంతులుకు ఊరి జనాన్ని పసురాల కంటే ఇబ్రీకంగా చూస్తడు. డబ్బు బల్పు. అధికార మదం రెండూ జాస్తే. ఊర్లె పంతులు మాటకు ఎదురులేదు. తీర్పుకు తిరుగులేదు. పంచాయితీలు చేసే పెద్దమనుషులు అయనకు వత్తాసు పలుకుతరు. ఆల్లకు పంతులు మాటకు తలూపడమే తెలుసు. ఏ ఎండకాగొడుగు పడ్తరు. వాళ్ళకంటే నోరు లేని గంగెద్దు నయం. కరణం మాటకు తానా అంటే తందానంటరు. రంగయ్యపంతులు ఊర్లె ఎంతమంది ఆడపిల్లల ఉసురుపోసుకొండో. లెక్కేలేదు.

ముత్తమ్మ రంగయ్య ఇంటికాడికి చేరింది. అమ్మగారు నిద్రపోతున్నట్టే ఉన్నది. ఆమె మొగంల లచ్చిందేవి పొడ గుట్ట మీది ఎర్ర సూరీడు మాదిరి ఎలుగుతూ ఉంది. పీనిగ సుట్టూత ఆమె బిడ్డలు కూసుంగ్రు. ఆల్ల సూపులో పావురం ఉన్నా, కంటిలో నీటికి కరువు. ఉన్నోల్లకే ఉంటట్టుంది నామోషీ అయినా, నామర్దా అయినా. లేకపోతే కన్నతల్లి సచ్చిపోతే కంట నీటిసుక్కా రాలకపోతే వాళ్ళేం బిడ్డలమ్మా?.

జనం తలో మాట పైకే అంటున్నరు. అయినా వాళ్ళు ఈ మాటలకు ఏడ్వాలా? తల్లి పోయిందని ఏడ్వాలో తెల్వక అప్పుడప్పుడూ కొంగునోటికి అడ్డంబెట్టుకొని ఏడ్వబట్టింద్రు. ముత్తమ్మతో బాటు అమ్మగారి చేత సాయం పొందిన ఆ ఊరి గుండెలన్నీ బరువయ్యాయి. గుడిసెలన్నీ ఆడనే ఉన్నాయి. సూడొచ్చిన అమ్మలక్కలు అమ్మగారి మీద నెనరుతో అక్కడోలు, అక్కడోలు ఎక్కెక్కి ఏడ్సుకుంట, నాలుగుబొట్లు రాల్చిపోతుంద్రు. పొద్దుగూక ముందే వచ్చిన జనం పటు పటుమని చెప్పి, యాల్లకు కాష్టానికి పీనిగను మోసింద్రు. దానం చేసి వూరు ఊరంతా ఇంటి దారి పట్టింద్రు. పంతులు ఇంటికి సావుకు పోక పోతే మదిలపెట్టు కొని తరువాత పగ తీసుకుంటడని అయినోళ్ళు, కానోళ్ళు అంతా వచ్చింద్రు. "కరణంతో కంటు, కాటికి పోయినా తప్పదు" కార్యం అయిపోయింది. ఎవరిల్లకు వాళ్ళు పోతుంద్రు. పోత పోత ఎవడో జనంలో తొండి కూత కూసిండు. కరణం గారింట సావు, ఊరికి అరిష్టం. 'సీతకైనా రోసిన మాట తప్పలేదు' అనుకుంట ముత్తమ్మ ఇల్లుజేరింది.

***

తెల్లారితే పంతులమ్మ దినాలు. పట్నానికి, ఊరికి దారి పడ్డది. పడావు బడ్డట్టున్న గడీలు ఆయ్యేల రంగు రంగుల కొత్త బొంతలను కప్పుకున్న గంగెద్దు లాగ... గోడలు ఊపి మీద తీరొక్క రంగుల నేసుకుంది. ఇంటి ముంగల రంగు రంగుల టెంట్లు, నేత్రికాడ రంగు రంగుల బుగ్గలు ఎలగబట్టినై. ఆ యెలుగులు చూడడానికి జనం మల్లోపాలి గడీకి జాతర కట్టింద్రు.

తెల్లారి బువ్వాల్లకు... గడీ ముందు గట్టయ్య బూర సప్పుడైంది. గంగెద్ల నాడిస్తుండని చూడడానికి జనం జమైంద్రు. జనానికి గంగెద్లనాడించే గట్టయ్య కొత్తోడు కాదు. గట్టయ్య గంగెద్దు సుత కొత్తది కాదు. గట్టయ్య పదహారూర్ల పేరెల్లినోడు. శివ భక్తుడు బసవన్న రూపం ఆ గంగెద్దు. "గంగెద్దు ఆడాలంటే అదృష్టముండాలె. అమ్మ గారు ఉన్నన్నాళ్ళు మంచి పేరు తెచ్చుకుంది. ఎప్పుడో ఓ పాలి ఆ గంగెద్దు గింత ఉన్నప్పుడు గట్టయ్యకు కానుకగా ఇచ్చింది. అదే గంగెద్దు ఇయ్యాల అమ్మగారి దినానికి ఆడతంది. ఇయ్యాల ఆ గంగెద్దు ఎద్దులా లేదు. ఏనిగె లెక్క అంతెత్తుంటది. గోలెమంత మూపురం. గంగెద్దు రంగురంగుల కొత్త బొంతలను మూపురం మీద కప్పుకుని కండ్ల నిండుగుంది. అది చిన్న పోరనిలా గట్టయ్య చెప్పినట్టు ఆడుతది. కూసొమ్మంటె కూసుంటది. నిలబడమంటె నిలబడతది. గట్టయ్య కడుపుల పుట్టిన బిడ్డ లెక్క దాన్ని సాకిండు. తిని తినక తన కడుపు

మాడినా, కడుపు నిండా పెట్టిండు. గట్టయ్య దాని ముక్కుల, కండ్లల్ల ఏదో చెట్టు పసరు పోసిండట. ఆడ్నించి అది చెప్పినట్టల్లా ఆడుతదిని" వూర్లె కొందరి మాట. ఆట మొదలయ్యేటాళ్ళకు బువ్వాల్ల దాటింది.

గట్టయ్య సన్నాయి, డోలు, సుతి సరి చేసుకుంటుండు. పదొద్దుల్ల కావడంతో పంతులు బిడ్డలు భక్తితో గంగెద్దు కాళ్ళను తాంబాలంలో పెట్టి, పసుపు నీళ్ళతో కడిగి, కుంకుమ పెట్టింగ్రు. అమ్మకు పుణ్యలోకాలు కలుగుతయని వాళ్ళ నమ్మిక. గట్టయ్య పుల్లతో డోలుపై, పైకి కిందకు ఓపాలి గట్టిగా రాపాడించిండు. ఎడమ చేత సన్నాయి నోట బెట్టి, పెండ్లాం ముత్తమ్మ వంక జూసిండు. ఎంటనే హాజిర్ అన్నట్టు, కొడుకు శివుడికింత తట్ల బువ్వేసి, మంట్ల కూసోబెట్టింది. సుతిని తీసి ఆడించింది. డోలు దెబ్బకు సన్నాయి మోత, రాగానికి తోడు సుతి కలిసింది. దానితో గంగెద్దు, జనం తన్మయత్వంలో పడిపోయింగ్రు.

ఆ మధ్యల గట్టయ్యకు, అతని సావాస గుంపుతో పడక ఎవలంతలాల్లు పని జేసుకుంటుంగ్రు. కార్యం ఉంది రావాల్నంటే కచ్చ గట్టి ఒక్కలూ ఈ దిక్కు రాలేదు. ఎవలూ రాకపోవడంతో ముత్తమ్మను ఎంట తెచ్చుకుండు. గంగెద్ల నాడించేటపుడు ఆడోళ్ళను ఎంట రానీయరు. తప్పక గట్టయ్య పెండ్లాం ముత్తమ్మకు సుతిని అప్పజెప్పిండు. ఆమె విద్దెను తొందరగనే పట్టింది. చిన్నప్పుడు నాయనతో ఆడ పొయ్యేది. గట్టయ్య వాయిద్యం, జనాల చప్పట్లు గంగెద్దుకు కూడా కొత్త కుశాలునిచ్చింది.

బసవా ! అయ్య గారు సల్లగుండాలి. అయ్య గారికి దండంపెట్టు. అమ్మ గారు నిన్ను నాకిచ్చింది. "అమ్మగారికి దండంపెట్టు" అనుకుంట దండం పెట్టించిండు. గట్టయ్య చెప్పినట్టు తాలాడిస్తూ దండం బెట్టింది గంగెద్దు. అప్పుడే ఆడికొచ్చిన పెద్ద మనుషులు రంగయ్య పంతులుకు దండం బెట్టింగ్రు. ఆయన సూపించిన కుర్చీల్లో తలాడించి కూర్చున్నరు.

ఆట సాగుతుంది. గట్టయ్య గంగెద్దును గావు పట్టమండు. అది గావు పట్టింది. "సివంగి మేక మెడను నోటకరిసినట్టు" మెడను గంగెద్దు అమాంతం నోట కర్సుకుంది. ఏమైతదోనని జనం కాళ్ళెత్తి, వేళ్ళపై నిలబడ్డరు. ఇంతల్నే డోలు వాయిద్యం మారింది. గంగెద్దు గట్టయ్య మెడను ఇడిసి పెట్టింది. మారిన డోలు వాద్యానికి గంగెద్దు తలాడించి, ముందటి రెండు కాళ్ళనెత్తి గట్టయ్య ఎదురొమ్మునుంచింది. జనం సప్పట్లు కొట్టింగ్రు. తర్వాత గంగెద్దుకున్న ముకు

తాడును ఒక చేతబట్టి, రెండో చేతుల బొడ్లె దోపుకున్న పీక తీసి, ఊదుకుంట దానిని అటు ఇటూ ఉరికిచ్చిండు. ఎండ ముదిరింది. అగడుకు గట్టయ్య ఒగరుస్తుండు. ఈడు మీదున్న కోడెనాపలేకపోతుండు. ఎండకు నోరు తెరిశి, పొడుగ్గా గాలి తీస్తుండు. కండ్లు మసకలైతున్నె. అయినా కోడెనిచ్చిన అమ్మ గారి దినాలు. శానా మంది జనాలు. కాళ్ళు ఉరకనని మొండికేసినా, ఆటి మాటిన లేదు.

పంతులమ్మను సావు తరుముకొచ్చినట్టు, గంగెద్దు తోకెత్తి మరీ గట్టయ్యను తరుముతుంది. గట్టయ్యకు వశపడతల్లేదు. దాన్ని ఆగబట్ట లేకపోతుండు. చివరాకర్న జనంవైపు ఓ చూపు చూసిండు. వాళ్ళంతా కేరింతలు కొడుతుండ్రు. అటు తిరిగి ఓ క్షణం పెండ్లాం వైపు చూసిండు. గంగెద్దు వడిగ రానే వచ్చింది. అలవాటుగా కిందికి పెట్టిన తలను పైకి కుమ్మినట్టు, తలను పైకి ఇసిరింది. ఒడుపుగా తప్పించుకునే యజమాని అలిసి అదమరిసిండు. ఉరకలేక గంగెద్దు నాపుదామని చేతులు ముందుకు సాపి, ఎనకకు తిరిగిన గట్టయ్య పొత్తి కడుపుల, గంగెద్దు తల బలంగా తగిలింది. సన్నాయి పీక అంతెత్తున ఎగిరి పడ్డది. ముత్తమ్మ చేతులున్న సుతి నేల జారింది. అయ్యో! అంటూ అమాంతం లేశి నాలుగు అంగల్లో గట్టయ్యను చేరుకుంది. గట్టయ్య రౌతుపై పడి, తల పగిలి రౌతు నెత్తురు పులుముకుంది. జనం నివ్వెర పోయిండ్రు. గంగెద్దునాపడానికి యువకులు ముందుకు దూకిండ్రు.

భయపడ్డ గంగెద్దు అదుపుతప్పింది. దుమ్ములేసింది. బువ్వ తింటున్న శివుడి తలెల మట్టిపడ్డది. బెదిరిపోయిన గంగెద్దు శివుని మీద నుంచి అమాంతం దుంకి ఏటో పోయింది. గంగెద్దు కాలికి తగిలి శివుని బువ్వ గిన్నె అంత దూరంగా పడ్డది. “రాజును పేదనరాదు. ఎద్దును సాధువనరాదు. రాచ పీనుగ, ఒక్కటే ఎట్లా పోతది. తోడు కూడా తీసుక బోతది” గుంపులోంచి అంటున్నారెవలో.

***

“గట్టయ్యకు నికరంగ ఇల్లు లేదాయె. సావు కబురు తెలుసుకొని, సావున్న ఊల్లెకి పోయి, ఊరి బయట గుడిసేసుకుంటడు. గంగెద్దు నాడిస్తే వచ్చే గింజలతో ఇంటి ఎవ్వారం నడిపిస్తడు. ఆ నాలుగు గింజలు సావు నుంచి సావుదాకా దాసుకొని ఇంటి ముగ్గురు తింటరు. మజ్జెల ఎటమటమయితే ఊల్లెపోయి బిచ్చమెత్తుకుంటడు. ఇంకోపని చేద్దామన్నా, పాడుగాను ఊరి కట్టుబాటు చేబట్టి, ఆనికి ఇంకోపని దొరకదు. ఆడు పోయిండు. గిప్పుడు దాని బతుకెట్టనో? పంతులు గొడ్లకొట్టంల పెండకల్లు తీసుకుంట, పెద్దజీతగాడు సత్తయ్య అంటుండు. “ఔ అన్నా... పంతులమ్మ

దినాలకేగా ఆడు జీవిడిశింది. "నిన్న ముత్తవ్వ పంతులు తానకొచ్చింది. రంగయ్య పంతులు గింతనన్నా కనికరం జూపకపాయే" సత్తయ్య దిగులుగా అన్నడు.

***

"ఏం చేద్దూ..పటేలా? ఆ భగమంతుడు సచ్చినోడు నాకన్నేలం జేసిండు. అయన పోయినకాంచి, కొడుకుకు యాల్లకింత బువ్వ పెట్టలేకపోతుంటి. నాకు వశ పడతల్లె. కాల్మొక్త...నీ బాంచన్..! గింత పనియ్యండి." పొద్దుగుంజాల యాదయ్య పటేల్ తానకు పోయి ముత్తమ్మ ఎగుసం పనికి వస్తనని ఒక్కతీరుగ బతిలాడుతుంది.

"ఎట్టా కుదురుద్దే ముత్తమ్మా! నీకు తెల్వదా? ఊరి కట్టుబాటు. నిన్ను పనికి రానిస్తే ! రంగయ్య పంతులు ఊకుంటడా? గద్దె కాడికి పిల్సి పంచాయితీ పెడ్తడు." అనేసరికి, అట్టలు కట్టిన, ఎండిపోయిన కండ్లతో ఊరి బయటకు నడిశింది ముత్తమ్మ. ఆయమ్మ నీయమ్మనూ... ఏడడిగినా.. పోరనికి గంజినీళ్ళు సుత పుట్టలే. అవ్వ బువ్వ తెస్తదని ఎదురుచూస్తున్న శివునికి, బువ్వ తేకపోయేసరికి కోపం తలకాయకొచ్చింది. ఏడ్సి ఏడ్సి.. అది సల్లారి, చీకటి ముదిరినాక ఏ అద్దరాత్రో ఆకలిమరిసి నిద్రబోయిండు. ముత్తమ్మకు నిద్రబట్టలే. బిడ్డాకలికి మనసు తన్లాడింది. మొగడున్నప్పుడే డొక్కలు మాడిన రోజులున్నై. కానీ ఇద్దరూ కడుపు మాడ్సుకొని బిడ్డకు, గొడ్డుకూ పెట్టిండ్రు. గొడ్డేమో మొగన్ని మింగిపాయె. సద్దామన్నా బిడ్డేమో అడ్డమాయే. ముత్తవ్వ మొగడు పోయినకాంచి బిచ్చమడుక్కొచ్చి పెడుతుంది. ఎన్నాళ్ళు..? ఎవలైనా ముష్టి పెడ్తరు? ఏదన్నా పని చేసుకొని బద్దామనంటే, ఎవ్వలు పనియ్యట్లేరు. ఎవరైనా పనిస్తే "గంగెడ్లోల్లు పనికొస్తే, మేము రామని" కూలోల్లు అంటున్నరాయే. కూలీజనానికి... కూలీపైసల కన్నా కులం ఎక్కువైంది. ఏ ఊరికి పోయినా ఈ కులం యములోడొచ్చినట్టు ఎంటనే వచ్చె. రోయిని ఎండకు చెర్ల నీళ్ళు, కష్టాల దూపకు ముత్తమ్మ కండ్లల్ల నీళ్ళు ఎండిపోయినై. నావల్ల కాదని ఓపాలి బాయిలపడి సద్దామనుకుంది. కన్నపేగు అడ్డొచ్చి ఒడ్డునే ఆగిపోయింది.

***

శివుడు లేసెసరికి తట్లే తెల్ల బువ్వ కన్పించింది. కండ్లు ఎలిగినై. ఏగిలి బారంగనే ముత్తవ్వ ఊల్లెకు బోయి నాలుగిల్లు తిరిగి పాశి బువ్వనడుక్కొచ్చింది. తొక్కుతో బువ్వ కలిపి శివుడి నోట్లె పెడుతుంటే, ఆసర బడ్డంక శివుడు అమ్మకు కుశాలుగా నేత్రికాడొచ్చిన కలను చెబుతుండు. "అమ్మా! నేను పెద్ద గంగెద్దు నాడిస్తున్నా. ఆటను చూసిన జనం, మనకు శానా జొన్నలు, బియ్యం పెట్టిండ్రు.

పైసలిచ్చింద్రు. నాలుగర్రల ఇల్లు కట్టుకున్నం. అన్ని అర్రల్ల ఉన్న గుమ్మిలన్నీ గింజలతో నిండి పోయినై. నాకు తట్టి నిండా బువ్వ పెట్టినవు.” సంబురంగ చెబుతుంటే ముత్తవ్వ కండ్లల్ల ఆశలు ఏటి చెలిమలా తియ్యగా ఊరినై.

‘అమ్మా! మనకు ఇల్లెందుకు లేదమ్మా? మనది ఏ ఊరమ్మా? ఎందుకు ఊరి బయట ఉంటం? ఎవలూ నాతో దోస్తానా చేస్తల్లేరు ఎందుకు?” అన్నీ చెప్పలేని ప్రశ్నలే అడుగుతుండు. అయన్నీ సిన్నతనం సంచి ముత్తమ్మకు తెలిసినయే. జవాబులే చెప్పోటోడు దొర్కలే. అదంతా మన కర్మ నాయనా! అని చెప్పింది ముత్తమ్మ.

***

శివుడు పదహారేళ్ళ కొచ్చిండు. అయ్య తీర్గ ఆరడుగులు పెరిగిండు. చేపకు ఈత నేర్పాల్నా. గంగెద్లాటలో ఇకమతును తొందరగనే పట్టిండు. గంగెద్లాటాడించే గుంపులో చేరిండు. శివుని ఆట.... సావు “ముంగిట” సాగుతూనే ఉంది. ఇరామం లేదు. కాలు రెక్క ముదిరిందాక, నానాగడ్డి కరిసి సాదిన ముత్తమ్మకు ఆకలి బాధ తీరింది.

కొన్నాళ్ళకు.. శివుడి ప్రశ్నలు గంగెద్దు లెక్క అతని మదిల మర్లబడ్డె. నేను గంగెద్దునే ఎందుకాడించాలె? ఊరి జనాలు రంగయ్య పంతులు చెప్పిందాని కల్లా ఎందుకు తలాడిస్తుంద్రు? నేను నా ఇష్టమైన పని ఎందుకు చేయొద్దు. ఊర్ల నాకు వేరే పనెందుకియ్యరు? ఊర్ల గింత జాగా ఎందుకియ్యరు?. రోజులు గడుస్తున్నై. జవాబు దొరుకుతల్లేదు. ఊరి బయట మర్రి చెట్టు తొర్రను చెద పురుగు తొలిసినట్టు శివుడికి ఆ బాధ లోపల తొలుస్తూ ఉంది.

ఆరోజు రేత్రికాడ సవాట్ల కాడికి ఎర్రకండువాలొచ్చినై. ఆట పాటలతో శానా ముచ్చట్లు చెప్పింద్రు. దొరల కాడ అన్నేలంగా దాచి పెట్టుకున్న భుములున్నై. అయి పెదోల్లకు పంచి పెట్టే రోజు లోచ్చినై. అని మాటిచ్చారు. శివుడికి వాళ్ళ మాటలు నచ్చాయి. ఇన్నాళ్ళు తన మనసులోని ప్రశ్నలకు జవాబులు దొరికినై. వాళ్ళు మరుసటి రోజొచ్చి,“దున్నే వానిదే భూమి” నాటకమేసింద్రు. నాటకంల ఊరి జనమనే గంగెద్దునాడించే రంగయ్య పంతులే కనబడ్డడు. భూమినంతా తన కాడ పెట్టుకొని, ఊరిని గంగెద్దులా ఆడిస్తుండు. సందె కాడ బువ్వ తాగినాక, నాటకం ముచ్చటను అమ్మకు చెబుతుంటే, కొడుకు ఏదో సోప (బాధను అర్థం కాని విధంగా సోదిగా చెప్పడం) చెబుతుండు లేనని ఊ..కొట్టుకుంట, ఊరంతా నిద్రబోయే యేలకు ముత్తమ్మ కూడా నిద్రలోకి జారుకుంది. శివునికి నిద్రబట్టలే.

చెవుల్ల నాటకంలోని మాటలే మార్మోగుతున్నై.

***

మరునాడు ముత్తమ్మ రంగయ్య పంతులు తానికి పోయింది. కొడుకుకు ఏదన్నా ఓ పని ఇప్పించమని కాళ్ళా వేళ్లా పడింది. "ముత్తమ్మా! కట్టులేని ఊరు, గట్టులేని చెరువానే.. మనూరు? ఊర్లె అడుక్కునేటోడు సుత ఉండాలే!" అని చెప్పి గిన్ని గింజలిచ్చి పంపిండు. ఊరి బయటకు నడిశింది. కోడె యోచనతో నున్న ముత్తమ్మ నడిచే బాట మారింది కానలే.

రంగయ్య పంతులు కొట్టాలొచ్చినై. కొట్టంలో గంగెద్దు అరుపిన్నది. సిత్రబోయింది. శాన్నాళ్ళకు ముత్తమ్మను చూడడంతోని గంగెద్దు గుర్తుపట్టి మోరెత్తి "అంబా..." అని అరిసింది. పల్పు తెంపుకుని తడక నెట్టుకొని ముత్తమ్మకాడికొచ్చి నిలబడింది. నోరు లేని జీవం. మొగని సావుకు కారణమైన ఆ పసురాని మీద ముత్తమ్మకు కోపం రాలేదు. నోరున్న ఊరు కంటే ఆ పసురమే నయం. దానిని బిడ్డలా సాకిన పావురం గదా! అమ్మ మనసు పొంగింది. దానిని చూస్తుంటే ఆయనే గుర్తుకొచ్చింది. ముత్తమ్మ దాని గంగడోలును, ఆపైన వీపును నిమిరింది. దాని ఒంటి మీద కొరడా దెబ్బలున్నై. ఉసూరుమనిపించింది. ఎంటనే పక్కకు చూసి ఏదో చెట్టు ఆకులు తీసి, పసరు పిండి దానిపై పిండింది. దాని వల్లుమీద దెబ్బలు చల్లగైనట్టుంది. దాని ఒల్లు గగుర్పాటుకు గురైంది. అది ముత్తమ్మ భుజంమీద తల ఆనించి కండ్లనీరు కార్చింది. మనిషికే కండ్లల్ల నీళ్ళు ఉంటాయి. కానీ స్వార్థం కోసమే ఆటిని ఉపయోగిస్తాడు. అది పశువు. అంతకన్నా బాధను ఎట్లా చెబుతుందని మనసులో అనుకుంది ముత్తమ్మ. పంతులమ్మ బతికున్నప్పుడు తమ బతుకు దెరువుకిచ్చిన కోడె అది. దానం చేసిందాన్ని పంతులు తిరిగి ఆశ పడ్డడా? కక్కిన కూడుకాశ పడడు" అనుకొంది. ఎంట తోలుకబోయింది. శివుడు మేల్లంతో నిన్ననే పొరుగూరికి గంగెద్దునాడించ బోయిండు. వానికి తెలిస్తే శానా కుశాలయితడు కొడుకు. మనసులో అనుకుంటూ ఇంటికి నడిచింది. రెండు దినాల్ల వస్తనన్న శివుడు ఇంకా రాలేదు.

***

గంగెద్దు జాడ తెల్సుకున్న రంగయ్య పంతులు పండ్లు పట పట నూరిండు. పంచాయితీకి డప్పు సాటింపేయించిండు. తెల్లారి బువ్వాలకు పెద్ద మనుషులతో గద్దె మీద కూసుండు. గంగెద్దును, ముత్తమ్మను తోలుకరమ్మని మనుషులను

పంపిండు. పచ్చ గడ్డి తింటున్న గంగెద్దును, ముత్తమ్మను గద్దె కాడికి బలవంతంగా నలుగురీడ్సుకొచ్చింద్రు. గంగెద్దును గుంజకు కట్టింద్రు.

"ఇగ పంచాయితీ మొదలుపె ట్టండి.." రంగయ్య పంతులు పెద్ద మనుషులకు సైగ చేసిండు. పెద్ద మనుషులు గంగిరెద్దు లాగ సరే అన్నట్టు తలాడించింద్రు. "పేరొకరిది, నోరొకరిది".

"ఏమే ముత్తమ్మా! పంతులు గారి కొట్టంల ఎద్దును దొంగతనం చేస్తివా?" అడిగిండొక గద్దమనిషి.

"అయ్యా ! నీ బాంచన్, దొంగతనమయితే నేను చేయలేదు. మీరు ఎరగని దాన్ని కాదు. అదే నా ఎంట వచ్చింది. అయినా ఆ కోడెను ఇంతున్నప్పుడు అమ్మ గారు మాకు దానం ఇచ్చింది గదయ్యా"

"ఇచ్చిన అమ్మగారు లేరు. తీసుకున్న నీ మొగడు లేడు. అది ఏడ నుంచి వచ్చిందో, ఆడికే జేరింది. తోలుకబోయే హక్కు నీకెక్కడిది? "

"అయ్యా! నా మొగడు అమ్మ గారికి వైద్యం చేస్తే ఇచ్చిన లేగ దూడ. ఆ దూడను బిడ్డను సాకినట్టు సాకిండు. విద్దెలు నేర్పిండు. దాని చేతుల్నే జీవిడిశిండు. ఏ దిక్కు లేని సంసారం కనికరించండి"

"సాకినంత మాత్రాన నీదవుతదా?"

"బడితెవడిదో, బర్రె వాడిదవుతుందా దొరా?

"దొంగతనం చేసి, పంచాయితీకి ఎదురు చెప్తావ్ .. తాశీలు ముండా..! పెద్దంతరం మర్సి మాట్లాడినవ్. నీకు శిక్ష తప్పదు." గద్దె మనుషులు శిక్షను తీర్మానం చేసింద్రు. కమ్మరాయినకు సైగ జేశింద్రు. గంగెద్దులాగ ఆయన కూడా తలూపి, నిప్పుతో కొలిమి రాజేసిండు. ఎర్రని మంటల్లో గడ్డపారను పెట్టిండు. ముత్తమ్మ గుండెల్లో బెరుకు మొదలైంది.

"ఒసే ముత్తమ్మా, నిప్పులున్న ఎర్రని గడ్డపారను అరచేతులతో తీసి, సాటల వడ్లను నలపమని" పెద్ద మనుషులు గర్జించింద్రు.

ఊరి జనం తలలు.. గంగెద్దు తలకాయ లెక్క కిందకు వంగినై. ముత్తమ్మ పెద్ద మనుషుల సిచ్చ నచ్చకున్నా తల ఊపాల్సి వచ్చింది. తప్పేది లేక గడ్డపారను చేతులతో తీసింది. "అమ్మా!" అని ముత్తమ్మ బాధతో ఏడ్సింది. అక్కడున్న అమ్మలందరి పేగు కదిలింది. కండ్లల్ల నీళ్ళు సుడి గుండాలను రేపినై. జనాల ఒల్లు గగుర్పొడిచి ఒకడుగు ఎనకకేసింద్రు. పని జేయని వాడు ఇంటికి దొంగ, పెత్తనం

చేసేవాడు ఊరికి దొంగ. జనానికి దొంగ ఎవరో తెలిసినా వాళ్ళ గుండెల్లో పుట్టిన అదురు, నోట మాటను రానియ్యలేదు. పంతులు చూపుడేలు మీసాలను దర్జాగా దువ్వింది.

ఈ లోగా శివుడక్కడికందుకుండు. అమ్మ అర చేతులు ఎర్రగైనై. చూసినంక శివుని కండ్లు ఎర్రని చింత నిప్పులైనై. దవడలు గట్టిపడ్డై. పిడికిలి బిగుసుకుంది. "పేదోని కోపం పేనానికి సేటు. కోపం వద్దురా.. బిడ్డా! మా అయ్యగని సైసు జర" బాదతోనే అరిసింది ముత్తమ్మ. అమ్మ మాట ఇన్పించుకోలె శివుడు. 'ఎట్టికి పైసా లేదు గని, ధర్మానికి దండుగా ..!" అని తలకాయకు కట్టిన ఎర్ర రుమాలును తీసి గట్టిగా దులిపిండు. గంగెద్దు కర్థమైంది. ముత్తమ్మ వాతల సూసిన గంగెద్దుకు గతంలో పెట్టిన వాతలు గుర్తొచ్చినై. బుసలను కొడ్తూ ఒక్కుదుటున గద్దెను జేరి కొమ్ములతో రంగయ్య పంతులు ఎద మీద కుమ్ముడు కుమ్మింది. గద్దె రక్త సిక్తమైంది. మర్ల బడిన గంగెద్దును చూసి పెద్ద మనుషులు కాలుకు బుద్ధి చెప్పింద్రు. గంగెద్దుకు అదురూ లేదు. బెదురూ లేదు. గంగెద్దుకున్న ముకు తాడు, పలుపు ముడిని ఇప్పిండు శివుడు.

'తుపాకి కడుపున ఫిరంగి పుట్టినట్టు' గట్టయ్య కడుపున శివుడు పుట్టిండన్నరు జనం. తరువాత శివుడు పూనుకోవడంతోని గుడిసెలు ఊరిమద్యల కొచ్చినై. పంతులు కబ్జా భూముల్ల డక్కలి, యానాది, దొమ్మరి, పిచ్చకుంట్ల, బైండ్ల, పొడపోతుల, మొండి జాతులతోబాటు సంచార జాతులన్నీ కల్సి అరక కట్టిచ్చిండు. గీ ముచ్చట తెల్సిన గంగెద్దులన్నీ కడుపు నింపని వృత్తిని వదిలి పెట్టి, కష్టపడి అరకకు సాగినై. ఆ అరకలకు ఊరూరా జనం హారతి పట్టింద్రు.

******

**–తంగేడు పక్ష పత్రిక, 1–15 ఫిబ్రవరి, 2022**

# 4. పరువు

రమ్య నాన్న కార్యాలయం వద్ద స్కూటీనాపి, తండ్రి రమేశ్‌ను దింపి వెనుదిరిగింది. ఆఫీసు కిటికీలో నుండి అదంతా చూస్తున్న నారాయణ కళ్ళను తిప్పుకోలేక పోయాడు. అమ్మాయి మంచి ఎత్తు, తెల్లని దేహఛాయ, చారడేసి కళ్ళు కలిగి, చూడగానే స్వర్గం నుంచి దిగొచ్చిన దేవతలా ఉంది. లోపలికి వస్తున్న రమేశ్ తో "అమ్మాయి లక్షణంగా ఉందయ్యా" అన్నాడు పై అధికారి నారాయణ. ఆ మెచ్చుకోలుకు ఆనందపడుతూ "థాంక్యూ సార్.." అన్నాడు రమేశ్.

"మీ అమ్మాయికి ఏమైనా పెళ్లి చేయాలనే ఆలోచన ఉంటే చెప్పండి. మా అబ్బాయి గ్రూప్ వన్ లో సెలెక్ట్ అయ్యాడు. త్వరలో ఉద్యోగంలో చేరి పోతాడు. అతనికి పెళ్లి చేద్దామనుకుంటున్నాము. మాకు కుల పట్టింపులు ఏవీ లేవు. కట్నం అవసరం లేదు. అబ్బాయికి అమ్మాయి నచ్చితే చాలు". అది గంతేసే ఆఫరే. కానీ రమేశ్ కు ఇలాంటి ఆఫర్లు గతంలో చాలానే వచ్చాయి. అతని ఆకలి ఆకాశమంత. నోరు సూది బెజ్జమంత. దాంతో "అబ్బే ఇప్పుడే లేదండీ...అమ్మాయి ఇంకా చదువుకుంటుంది"అని చెప్పి తప్పించుకున్నాడు.

***

ఆదివారం వుమెన్స్ హాస్టల్ సాయంకాలం విజిటర్స్‌తో సందడిగా ఉంటుంది. "హాయ్! కవలపిల్లల్లా ఉన్నారు. మీరిద్దరూ అక్కా చెల్లెల్లా?". ఆ ప్రశ్నకు లాన్‌లో బెంచీ మీద కూర్చుని చదువుతున్న మనోరమ, రమ్య ఒకరి మొఖాలు ఒకరు చూసుకొని హాయిగా నవ్వారు. "కాదు. రూమ్మేట్స్ మాత్రమే" బదులిచ్చింది రమ్య. "నా పేరు సునీత. మీ పక్క రూంలో దిగాను." హాయ్ అంటూ రమ్య మాటలు కలిపింది. 'మాట వెండి, మౌనం బంగారం' అన్నట్టు మనోరమ మాట్లాడలేదు. సునీత అందించిన చేయితో తన చేతిని మాత్రం కలిపింది. ఆ తరువాత మనోరమ ముభావంగా పుస్తకంలో మునిగిపోయింది. ఆమెతో మాట్లాడించడానికి సునీతకు ఏడాది పట్టింది. మూడో సెమిస్టర్ పరీక్షలయిపోగానే దసరా సెలవులు రావడంతో అందరూ ఇంటికి వెళ్ళే హడావుడిలో ఉన్నారు. అదేమీ పట్టనట్టు మనోరమ హాస్టలు గదిలో కిటికీ పక్కన కూర్చొని ఆసక్తిగా "కక్క" నవల

ఆంగ్లానువాదాన్ని ఆసక్తితో చదువుతుంది. "మనోరమా! ఈసారి సెలవులకు మా ఇంటికి వెళ్దామా?" అడిగింది రమ్య. మనోరమ వినలేదు. నవల చదవడంలో మునిగి పోయింది. రమ్య మనోరమ దగ్గరికి వచ్చి చేతిలోనున్న నవలను లాక్కొంది. ఈసారి మనోరమ చిరుకోపంతో "నేను రాను రమ్యా. దయచేసి నన్ను డిస్టర్బ్ చేయకు!" అంది. ఊహించిన సమాధానమే అది. "రమ్య వాళ్ళ ఇంటికి వెళ్ళడం ఇష్టం లేకపోతే, మా ఇంటికి రావచ్చు గదా " అక్కడికొచ్చిన సునీత మాట కలిపింది. మనోరమ నుండి చిరునవ్వే ఎదురైంది.

"మనోరమా! ఈసారి మా ఇంటికి రావాల్సిందే" పట్టు పట్టింది రమ్య. "ఎప్పుడడిగినా ఏదో ఒక కారణం చెబుతావు. ఈసారి మాత్రం తప్పించుకోలేవు" మాట్లాడుతూనే మనోరమ బ్యాగులో బట్టలు సర్దింది రమ్య. "వద్దు! ప్లీజ్ రమ్యా....నాకు పనుంది. మా పెద నాన్న దగ్గరికి వెళుతున్నా" అంది.

మనోరమ కళ్ళల్లోకి సూటిగా చూస్తూ "మా ఇంటికి రాకపోతే... రాకు. కానీ నాతో అబద్ధం మాత్రం చెప్పకు. ఆ మాత్రం నేను గ్రహించలేనా?" నిష్టూరంగా అంది రమ్య. "ఇక ఏం మాట్లాడకు. ముందు పద నాతో" అని సమాధానం కోసం ఎదురు చూడకుండా, మనోరమను సిద్ధం జేసింది. బలవంతంగా చేయి బట్టి, తీసుకొని రోడ్డు మీదకు నడిపించింది రమ్య.

***

రెండు గంటల ప్రయాణం తరువాత బస్సు దుమ్ము లేపుకుంటూ ఊరు చేరింది. రమ్య వాళ్ళ నాన్న బస్టాండులో ఎదురు జూస్తున్నాడు. బస్సు దిగగానే ఎదురొచ్చి లగేజి అందుకున్నాడు. "డాడీ.. ఈమె పేరు మనోరమ. నేను ఫోనులో చెప్పాను గదా" పరిచయం చేసింది. "ఆ...అవును. మనోరమ కదా! సంతోషం. ప్రయాణం బాగా జరిగిందామ్మా." పరిశీలనగా చూస్తూ ఆత్మీయంగా పలకరించాడు. మనోరమను అతను పదే పదే పరీక్షగా చూస్తున్నాడు. ఈ అమ్మాయి అచ్చు రమ్యలాగే ఉందనుకున్నాడు. "మనిషిని పోలిన మనుషులు ఏడుగురు ఉంటారట" మనసులో అనుకున్నాడు. కానీ ఆగబట్టుకోలేక ఆ అమ్మాయి వివరాలు తెలుసుకోవాలని "నాన్నగారు ఏం జేస్తారమ్మా?" అనడిగాడు. "మనోరమకు నాన్న గుర్తుకొచ్చాడు" పెదవుల మీద విరక్తిగా చిన్ననవ్వు మెరిసి మాయమైంది. "నాన్న...." మాటలు

గొంతు నుండి బలవంతంగా బయట కొచ్చాయి. గొంతు బాధ, దుఃఖంతో పూడుకు పోయింది. ఆ వెంటే కళ్ళల్లో సన్నని నీటి తెర తరంగంలా తన్ను కొచ్చింది. అది గమనించిన రమ్య, "నాన్నా తమ్ముడు ఎక్కడా..రాలేదా?" అని మాట మార్చింది. రమ్య మంచి మాటకారి. ఆమె మాటల్లోనే అంతా ఆటోలో ఇల్లు చేరారు. పండుగ సెలవులు సంతోషంగా గడిచాయి. రమ్య, మనోరమలు తిరుగు ప్రయాణమయ్యారు. రమ్యకోసమని వాళ్ళ అమ్మ పండుగకు చేసిన రుచికరమైన పిండి వంటలు, పచ్చళ్ళు ప్రేమతో కట్టి బ్యాగు నిండా సర్దింది. రమ్య వాళ్ళ నాన్న బస్టాండు దాకా వచ్చి, బస్సెక్కించాడు. చేతిలో నున్న బరువులను బస్సులో సీటు దగ్గర పెట్టి, గుండెలో నున్న బరువును మోసుకుంటూ టాటా చెప్పి వెను దిరిగాడు. తండ్రి కూతురు ఆప్యాయతలను మనోరమతో బాటు బస్సుకూడా ముచ్చట పడుతూ భారంగా కదిలింది. సాయం కాలానికి ఇద్దరూ హాస్టల్‌కు చేరుకున్నారు.

వారి మధ్య స్నేహం సాయంకాలం నీడలా పెరుగుతూ వచ్చింది. వార్షిక పరీక్షలు దగ్గర బడ్డాయి. హాస్టలు గదుల్లో, వరండాలో అమ్మాయిలు పచార్లు చేస్తూ చదువుతున్నారు. కప్పులో టీ తీసుకొని మనోరమ దగ్గరకు వచ్చింది రమ్య. "మనోరమా! ఇదిగో టీ" అంది. సీరియస్ గా పుస్తకం చదువుతున్న మనోరమ పుస్తకం మడిచి పక్కకు బెట్టింది. "థాంక్స్..రమ్యా!" అని టీకప్పు చేతిలో తీసుకుంది. "అది సరే. నీ గురించిన వివరాలు ఎప్పుడూ చెప్పమన్నా చెప్పవు. ఈరోజు చెప్పి తీరాల్సిందే" పట్టుబట్టింది రమ్య. టీ తాగి కప్పు పక్కన బెట్టింది. మనోరమ మొకంలో చీకటి ఆవహించింది. మనోరమ నోరువిప్పడం ప్రకృతికి కూడా ఇష్టంలేనట్టు, హఠాత్తుగా కరెంటు పోయింది. గదంతా చీకటి పరచుకుంది. కొవ్వొత్తి కోసం రమ్యకు లేవక తప్పలేదు. కాసేపటికి గదికి వెలుగు వచ్చినా రమ్య, మనోరమల మనసులో ఆవహించిన వెలితి వల్ల చదువుపై శ్రద్ధ పెట్టలేక గదిలోనున్న లైటునాపి నిద్రకుపక్రమించారు.

***

పరీక్షలై పోయి కాలేజీకి వేసవి సెలవులిచ్చారు. "ఈసారి మీ ఇంటికి పోదాం మనోరమా!" మొదలెట్టింది రమ్య. "సారీ...నేను మా మామయ్య ఇంటికి పోతున్నా..!" అని ఒకసారి, నాయనమ్మ ఇంటికి పోతున్నా" నని ఇంకోసారి చెప్పి

తప్పించుకోవాలని చాలా ప్రయత్నం చేసింది మనోరమ. కానీ రమ్య వదల్లేదు. రమ్యతో బస్టాండుకు బయలుదేరింది మనోరమ. సెలవులు కావడంతో ప్రయాణికులతో బస్టాండు కిట కిటలాడుతుంది. పండుగ సీజను కావడంతో రెట్టింపు చార్జీలు వడ్డిస్తున్నారు. రమ్య కిటికీ పక్కసీటులో కూర్చుంది. బస్సు కంటే వేగంగా రమ్య ఆలోచనలు పరిగెత్తుతున్నాయి. మనోరమ ఊరికి పోతున్నాననే సంతోషం మనసంతా ఆనందాన్ని నింపింది. ఆలోచనలతో నున్న రమ్యకు, మనోరమ మనసులో రేగే అలజడిని గమనించనే లేదు.

***

ముంబై నేషనల్ హైవే మీద బస్సు వేగంగా పరిగెత్తుతుంది. రోడ్డు మీద అప్పుడప్పుడూ పల్లెలు, పట్నాలు కనబడి, ఆ వెంటనే కను మరుగవుతున్నాయి. మనిషి జీవితంలో వయసు తగిన ఎత్తు పల్లాలున్నట్టు, పల్లె పల్లెకూ నాగరికతలలో మార్పులున్నాయి. బస్సుతో పోటీ పడలేక సూర్యుడు అలిసి పోయినట్టుంది. అవమానంతో మొఖం ఎర్రబడి సిగ్గుతో పక్కకు వంగి పోయాడు. గజగజ వణుకుతూ, భయపడుతున్న చలికి, నేనున్నానని వచ్చిన చీకటి నల్లటి దుప్పటి కప్పింది. ఇద్దరూ ఎవరి ఆలోచనల్లో వాళ్ళున్నారు. వాళ్ళ ఆలోచనలతో సంబంధం లేకుండా బస్సు గమ్యాన్ని చేరుకుంది.

"రమ్యా! ఊరొచ్చింది. పద దిగుదాం" అనగానే ఉత్సాహంగా లేచింది రమ్య. ఇద్దరూ ఫుట్ బోర్డు వద్దకు నడిచారు. అదొక చిన్నగ్రామం. అక్కడ రిక్వస్ట్ స్టాప్ ఉంది. కానీ సాయంకాలం దాటితే అక్కడ బస్సులాపరు.

"సార్ కొంచెం బస్సాపండి.." బతిమిలాడినట్టు డ్రైవరును అడిగింది మనోరమ. "అమ్మాయిలు చూస్తే దేవకన్యల్లా ఉన్నారు. ఇక్కడాపమంటారేం" బస్సులో గుస గుసలు మొదలయ్యాయి. ప్రయాణికులందరూ అనుమానంగా, విచిత్రంగా వారినే చూస్తున్నారు. రమ్యకు కొంత అయోమయంగా మనోరమ వైపు చూసింది. "డ్రైవరుగారు...మీకే చెప్పేది. బస్సాపండి" గర్జించింది మనోరమ. మనోరమను చిత్రంగా చూసింది. ఎప్పుడూ శాంతంగా ఉండే మనోరమ ఎందుకలా గంభీరంగా మారిందో అర్థం కాలేదు. డ్రైవరు వైపు కోపంగా చూసింది రమ్య. కీచుమంటూ బస్సాగింది.

మనోరమ దిగుతుంటే, ఆ వెనుకే బస్సు దిగింది రమ్య. హఠాత్తుగా మనోరమ అడుగులు వేగంగా పడుతున్నాయి. రమ్య స్నేహితురాలి వేగాన్ని అందుకోలేక, ఆయాస పడుతూ మాట్లాడుతుంది. “రమ్యా ! మాట్లాడకు. ముందు గబాగబా నడువు..” గంభీరంగా పలికిన మనోరమ మాటలకు ఒక్క క్షణం నిలబడి విస్తుబోయి, చుట్టూ చూసింది రమ్య. రోడ్డు మీద వయసుతో నిమిత్తంలేకుండా మగ కళ్ళన్నీ తమనే వేటాడుతున్నట్టు శూలాల్ల గుచ్చుతున్నాయి. అక్కడక్కడా పదునైన అసభ్యకర మాటలు, నవ్వులు బాణాల్లా చెవిని తాకుతున్నాయి. రమ్య మనసుకు చీకట్లు ముసిరినట్టు, ఒక లోకాన్ని విడిచి మరో లోకానికి వచ్చినట్టు అనిపించసాగింది. వెళ్ళకూడని చోటుకు వచ్చినట్టు అర్ధమైంది. మనసంతా కీచురాయిలా కీడు శంకించింది. ఆ వీధి నిండా అమ్మాయిలూ, మహిళలున్నారు. వాళ్ళు తను ఏనాడు చూడని విధంగా కొత్తగా ఉన్నారు. వాళ్ళ పెదాలపై నవ్వులు. జడలలో మల్లెలు. అసభ్యకర వస్త్రధారణతో వెకిలిగా నవ్వుతూ ఉన్నారు. పురుషుల ఆకలికి వల వేయడం. చిక్కుకున్న చేపలతో చెక్కిలిగింతలు. అదంతా కలలా అనిపిస్తుంది.

“మనోరమా! ఇంటికి వెళ్ళడానికి మరోదారి లేదా?” భయంతో అడిగింది రమ్య. “రమ్యా! అదే మా ఇల్లు. ఆమే మా అమ్మ.”అన్న స్నేహితురాలి మాటకు అటూ చూసింది రమ్య. అక్కడ మనోరమ అమ్మ నిలబడి ఉంది. ఆమెను చూసిన రమ్య స్థాణువయింది. కాళ్ళు భూమి లోకి దిగబడ్డట్టున్నాయి. కదల్లేక పోయింది. మనోరమ వాళ్ళమ్మ, అక్కడ తనకంటే చిన్న వయసు యువకుడితో బేరం ఖరారు చేసుకుంటుంది. బిడ్డను చూసి అతన్ని వెనక్కి తిప్పిపంపుతుంది. అతను వెకిలిగా ఆమె నడుము పట్టి గిచ్చాడు. అదేమీ పట్టనట్టు నవ్వుతూ మనోరమ దగ్గరికి వచ్చింది. రమ్యను చేయిబట్టుకొని మనోరమ అమ్మవేనుకే ఇంట్లోకి లాక్కెళ్ళింది. కలలో నడిచినట్టుగా ఇంట్లోకి నడిచింది రమ్య.

***

‘నాన్నకు ఈ విషయం తెలిస్తే ఇంకేమైనా ఉందా? కాళ్ళు విరగ్గొట్టి చదువు మాన్పించేస్తాడు. ఇలాంటి చోటుకువస్తే తిరిగి వెళ్ళడం ఉండదు. చాలా సినిమాల్లో చూపించారు. వీళ్ళు ఎంతకైనా తెగిస్తారు. సాని నీతి, సన్నాసి జాతి తెలియదు. ఈ మనోరమను కూడా నమ్మడానికి వీల్లేదు. ఎరక్కపోయి ఇరుక్కుపోయాను.’ రమ్య

మనసులో భూకంపం మొదలైంది. కాసేపటికి తేరుకుని "హాస్టల్‌కు వెళ్దాం మనోరమా!" మెల్లగా చెవిలో గొణిగింది. రమ్య మానసిక స్థితిని అర్థం చేసుకున్న మనోరమ "ఇప్పుడు కాదు రమ్యా! రేపు ఉదయమే వెళ్దాం" అని చెప్పి, స్నానానికి లెమ్మని టవల్ అందించింది. మనోరమను "కొర కొర చూస్తూ...నేను స్నానం చేయను. ఏమి చేయను. వెళ్దాం పద." అని నిరాకరించింది రమ్య. అదేమి పట్టించు కోని మనోరమ "నీకొద్దయితే పర్లేదు. నువ్వు టివి చూస్తుండు. నేను స్నానం చేస్తానని," స్నానం చేసొచ్చిన మనోరమ "లే.. రమ్యా, అన్నం తిందాం!" అంది. రమ్య కనీసం కుర్చీలో నుండి కదల్లేదు. రమ్య నోట ఒకటే మాట. "పోదాం..పోదాం." అంతే.

స్నేహితురాలి కళ్ళల్లో బెదురును, గుడ్ల నిండా కన్నీళ్లను గమనించి, రమ్యను డాబా మీదకు తీసుకెళ్ళింది. తక్కువ మాట్లాడే మనోరమ మొదటిసారి వివరంగా మాట్లాడింది. "రమ్యా! మనం ఈ రాత్రి వెళ్ళాలంటే సాధ్యం కాదు. ఇక్కడ బస్సులాపరు. ఇతర వాహనాలను నమ్మలేము. ఆ సాహసం మరింత ప్రమాదం." అని నచ్చచెప్పజూసింది. దాంతో రమ్య ఇంకా బెదిరి పోయింది. "రమ్యా! దయచేసి అర్థం చేసుకో. నా వివరాలు ఎప్పుడూ అడుగుతావు కదా. నేనెందుకు చెప్పడానికి ఇష్టపడనో? ఈపాటికే నీకు సగమర్థమయి ఉంటుంది. అమ్మకు నేను ఒక్కదాన్నే కూతురును. అమ్మ అందమే ఆమెకు శాపమైంది. ఇప్పటిదాక మాకు అన్నమైంది. ఆసరైంది.

తెలిసీ తెలియని వయసులో ప్రేమించిన వ్యక్తిని నమ్మి, పెళ్లి కాకుండానే తల్లయింది. పెళ్లి చేసుకుంటానని లేవదీసుకు పోయిన వాడు హైదరాబాదులో కొన్నాళ్ళు కాపుర ముండి, ఇంటి పరువు ముఖ్యమని అమ్మను ఒంటరిగా వదిలిబెట్టి పారిపోయాడు. కడుపుతో ఇంటికి చేరిన అమ్మను, చెడిపోయిందనే కారణంతో తాతయ్య ఇంట్లోకి రానివ్వలేదు. మావయ్య చచ్చిపోయామనుకో! అన్నాడు. ఆకలి ఆమెపై కత్తులు నూరింది. కడుపాకలి అణుచుకోవచ్చు. కడుపులో పెరుగుతున్న నా ఆకలిని చంపలేక, తను చచ్చిపోలేక తనువును, మనసును చంపుకుంది. తెలిసిన వారి సాయం కోరితే, అక్కడా మోసమే ఎదురైంది. వాళ్ళే ఆమెను ఈ వృత్తిలోకి దింపారు. అందాన్ని లోకం ఆరాధిస్తుంది అంటారు. అది అబద్ధం. అది ఈ లోకం అవసరం తీరుస్తుంది. అంతే. అందం ఆనందం కాదు. అవసరం. ఇదీ అమ్మ

కథ. అందుకే నా వ్యక్తిగత వివరాలు నువ్వు ఎంత అడిగినా ఇన్నాళ్ళు చెప్పలేదు. అమ్మ పక్కన రోజుకో నాన్నను చూసే నా కన్ను, నాన్నకు అర్థాన్ని ఎప్పటికీ వెతుకుతుంది.” అని చెప్పి రమ్యను కిందకు తీసుకొచ్చింది. రమ్యకు మనోరమపై కొంత సానుభూతి కలిగినా, తృప్తి చెందలేదు. జిల్లేడు చెట్టుకు మల్లెపూలు పూస్తాయా? తప్పు చేసే వాళ్ళకు ఏదో వంక దొరుకుతుంది. వీళ్ళ మాటలు ఇలాగే మోస పూరితంగా ఉంటాయి. నమ్మ కూడదు” అనుకుంది. మనోరమ అన్నం తినమని బతిమిలాడినా రమ్య నిరాకరించింది. “అందులో మత్తు మందు ఏమైనా కలిపారేమో” రమ్యలో భయం, అనుమానం, అసహ్యం అన్నీ బయట చీకటితో బాటు క్రమక్రమంగా పెరగ సాగాయి. ఆ ఇంట పచ్చి గంగను కూడా ముట్ట లేదు. “పడుపుకత్తె సంపాదించిన భోజనం తినాలా?” మనోరమ తన స్నేహితురాలన్న సంగతే మర్చి పోయింది. మనోరమపై చిన్నచూపు, ఏవగింపు అంతకంతకూ పెరుగుతుంది. తెల్లారేంత వరకు కళ్ళు కాయలు చేసుకొని నిద్ర కాసింది రమ్య. రాత్రంతా మనోరమను నానా మాటలంటూ, “ఉరుము తరువాత, చినుకులన్నట్టు” మధ్య మధ్యలో భయంతో ఏడుస్తుంది రమ్య. అవమానం అలవాటైన తల్లీ కూతుళ్ళు రమ్య కోసం కన్నీళ్ళతో బాటు, ఆ రాత్రి నిద్రనూ త్యాగం చేశారు.

మరునాడు ఉదయమే బస్సెక్కి హాస్టలు చేరుకున్నాక గాని రమ్య మనసు స్థిమిత బడలేదు. సింహం పంజా తప్పించుకున్న జింక మాదిరి స్వేచ్ఛా గాలిని పీల్చినట్టు అన్పించింది. తరువాత రమ్య మరో రూంకు మారింది. వారి మధ్య దూరం గురించి స్నేహితులు అడిగినా ఇద్దరూ మౌనం వహించారు. ఫైనల్ పరీక్షలై పోయాయి. అనేక సార్లు రమ్యతో మాట్లాడదామని ప్రయత్నించిన మనోరమకు అవమానమే ఎదురైంది. ఎవరింటికి వారెళ్ళారు. తరువాత మనోరమకు మంచి ఉద్యోగం దొరికింది. ఆ విషయం చెబుదామని రమ్యకు ఫోన్ చేస్తే, ఇంకోసారి తనకు ఫోన్ చేయొద్దని కటువుగా చెప్పి పెట్టేసింది.

***

రమ్యకు మంచి ఉద్యోగం దొరికింది. అద్దెకున్న అపార్ట్మెంట్లో పక్కనున్న కుటుంబం బాగా పరిచయమైంది. మంచి మర్యాదస్తులు. వాళ్ళబ్బాయి ఆస్ట్రేలియాలో ఉంటాడని చెప్పారు. అబ్బాయి చాలా బాగున్నాడు. రమ్యకు కూడా నచ్చాడు.

అతను పండుగకు వచ్చినపుడు రమ్యను చూసి పెళ్ళంటూ చేసుకుంటే, ఆ అమ్మాయినే చేసుకుంటానని భీష్మించు కూర్చున్నాడట. వాళ్ళమ్మ చెప్పింది. పైసా కట్నం లేకుండా పెళ్లి చేసుకుని నెలలో అమ్మాయిని ఆస్ట్రేలియా తీసుకు పోతానని చెప్పాడట. ఆ విషయం రమ్యకు చెబితే నాన్న ఇష్టం అన్నది. దాంతో "మీ తల్లిదండ్రులను పిలిపించు" అని చెప్పింది. రమ్య ద్వారా ఆ విషయం వాళ్ళ నాన్న తెలుసుకుని ఆనందంగా ఒప్పుకున్నాడు. పెళ్ళికి దగ్గరి ముహూర్తం ఖరారు చేశారు. దగ్గరి వాళ్లకు నాన్న ఫోన్లోనే ఆహ్వానం పలుకుతున్నాడు. "అబ్బాయి ఆజానుబాహుడు. సినిమా హీరోలా ఉన్నాడు. లక్షల్లో సంపాదన. పైసా కట్నం తీసుకోలేదు. అమ్మాయికి వీసా రాగానే పెళ్లి చేసుకొని ఆస్ట్రేలియా తీసుకెళ్తానని అల్లుడు చెప్పాడు." మిత్రులతో గర్వంగా ఫోన్లో చెబుతున్నాడు రమేశ్. అది విని రమ్య తన అదృష్టానికి పొంగి పోతుంది. రమ్య కూడా "పెళ్లి చేసుకొని విదేశాలకు పోతున్నానని" స్నేహితులందరికీ ఫోన్ చేసి చెప్పింది.

ఆ విషయం మనోరమకు తెలిసి "కంగ్రాట్స్ రమ్యా!" అని శుభాకాంక్షలు చెబితే, "తన పెళ్ళికి రావద్దని కటువుగా చెప్పి ఫోన్ పెట్టేసింది. గంగలో మునిగినా, కాకి కొంగ అవుతుందా? అని మనసులో అనుకుంది. తరువాత పెళ్లి ఫంక్షన్ హాల్లో ఘనంగా జరిగింది. వీసా వచ్చింది. పెళ్ళికి పెద్ద పెద్ద నాయకులు, పేరున్న వ్యాపారవేత్తలందరూ హాజరయ్యారు. భోజనాలు, తదనంతర కార్యక్రమాలు అట్టహాసంగా ముగిశాయి. పెళ్ళికి వచ్చిన తన పై అధికారి ముందు రమేశ్ ఒకింత గర్వాన్నే ఒలకబోసిండు.

అప్పగింతలకు సమయం ఆసన్నమైంది."చీకటి పడుతోంది. త్వరగా కానీయండి" తొందర పెట్టారు పెళ్లి కొడుకు తరపు వారు. అల్లుడు అమ్మాయిని తీసుకొని కారులో ఎయిర్ పోర్టుకు బయలు దేరాడు. అమ్మాయిని ఒంటరిగా పంపాలంటే రమేశ్‌కు దుఃఖం ఆగడంలేదు. కూతురు అదృష్టాన్ని తలుచుకొని మనసు తేలిక బర్చుకున్నాడు. రమ్యలో కూడా బాధకంటే, విదేశాలకు వెళ్తున్నానే ఆనందమే ఎక్కువగా ఉంది. పెళ్లి కూతురులా ఎర్రటి గులాబీలను అలంకరించుకొన్న తెల్లని కొత్త కారు, రమ్యలో రేగే ఉత్సాహభరిత ఆలోచనల్లా విమానాశ్రయానికి పరుగులు పెట్టింది. కారుతో పోటీ పడే చంద్రుడిని కారు విండోలో నుండి చూస్తూ,

రమ్య మెల్లగా ఆలోచనల్లోకి జారుకుంది.

***

"తన స్నేహితురాళ్లకు.. ఎవరికీ దక్కని అదృష్టం. విదేశీ సంబంధం తనకు దొరికింది. అబ్బాయి హాలివుడ్ హీరోలా ఉన్నాడు. మనోరమ గుర్తొచ్చింది. పాపం మనోరమ. తల్లి దొరసాని అనుకుంటుంది. అదొక సాని. అయినా ఆ మనోరమను ఎవడు చేసుకుంటాడు? అది కూడా తల్లిలా అదే మురికికూపంలో ఉంటుందో లేక తనలా పెండ్లి చేసుకునే అదృష్టం ఉంటుందో...లేదో...పాపం మనోరమ" ఆలోచనల్లోనున్న రమ్యకు హటాత్తుగా కారుకు బ్రేకులు పడడంతో ఈ లోకంలోకి వచ్చి పడింది. పెళ్లికొడుకు దారిలో కారాపి భార్య మీద ప్రేమతో ఐస్ క్రీం తెచ్చాడు. అది చాలా మంచి సువాసన, రుచి కలిగి ఉంది. కారు ముందుకు కదిలింది. లీలగా చెవులకు మంద్రంగా, శ్రావ్యమైన సంగీతం వినబడుతుంది. శరీరం అలసటతో ఉంది. కారులో కమ్మని పరిమళం ముక్కు పుటాలకు తాకింది. ఖరీదైన ఫారిన్ సెంటు. ఐస్ కరీం తిన్నాక కళ్ళు బరువెక్కాయి. మెల్లగా మత్తులోకి జారుకుంది.

***

"ఒళ్ళు విరుచుకుంటూ మగతగా నిద్రలేచింది రమ్య. ఎయిర్పోర్టు ఇంకా రానట్టుంది. ప్రయాణ బడలికతో ఒళ్ళంతా నొప్పులు." అనుకుంటూ కళ్ళు తెరిచింది. ఒంటి మీద పాములు పాకుతున్నట్టు చేతులు ఎక్కడెక్కడో తడుముతున్నాయి. భర్త అనుకొని మత్తునొదిలి కళ్ళు తెరిచింది. పెళ్ళికి హాజరయిన నాయకుడున్నాడు. గుండెల మీద బానాపొట్ట బరువు. శరీరం కదలలేదు. క్షణంపాటు మెదడు మొద్దుబారింది. నివ్వెర పోయింది. ఆదుర్దాతో చుట్టూ చూసింది. అది ఒక హొటల్ గది. మెత్తటి పరుపుపై శరీముంది. వంటిమీది బట్టలు దూరంగా చిందరవందరగా కిందపడున్నాయి. "కలా నిజమా?" అర్ధంకాలేదు. ఏం జరిగిందో అర్ధం చేసుకునేలోపు భర్త నవ్వుతూ వచ్చాడు. చేతిలో వీడియో కెమెరా ఉంది. గట్టిగా అరవాలనిపించింది. దుఃఖం పొంగుకొచ్చింది. ఏడుద్దామని నోరు తెరవగానే పరిగెత్తుకుంటూ వచ్చి అతనే రమ్య ముక్కు, నోటిని ఒకేసారి అర చేతపట్టి మూసిండు. ఊపిరి ఆగి పోతుందనిపించింది. మరో చేత్తో అరచేతిలో పౌడర్ వేసి ముక్కుకు

అడ్డంగా బెట్టాడు. గాలికోసం గట్టిగా పీల్చడంతో గాలితో బాటు ఆ పౌడర్ కూడా నోరు, ముక్కులోకి పోయింది. దాంతో శరీరం గాలిలో తేలిపోసాగింది. మదిలో ఇందాకటి బరువు ఇప్పుడు లేదు. హాయిగా ఉంది. గొంతులో నున్న అరుపు మధ్యలోనే ఆగిపోయింది. మోసం అర్థమయినా మత్తులోకి జారుకుంది. బయటపడలేని నిస్సహాయతలో స్పృహ కోల్పోయింది.

***

రోజులు, ప్రదేశాలు మారుతున్నాయి. రోజుకొక పురుషుడు. విచిత్ర కోరికలకు తనువు ఆట బొమ్మైంది. వారికి శరీరాన్ని అప్పగించి నెల రోజులు గడిచి పోయింది. చెరబట్టిన వాళ్ళు కనికరించడం లేదు. భర్త జాడే లేదు. బయటి ప్రపంచంతో సంబంధం తెగిపోయింది. కళ్ళకు ఆ తరువాత మెదడుకు మెలకువ వచ్చింది. నాన్న గుర్తొచ్చాడు. ఏడవడానికి కూడా కన్నీళ్లు మిగల్లేదు. ఓరోజు రాత్రి రమ్యతోబాటు ముప్పై మంది మహిళలకు మత్తు మందునిచ్చారు. అందరినీ మినీ బస్సులో ముంబై తరలింపుకు సిద్దం చేశారు. రోడ్డు మీద మినీబస్సు వేగంగా పరిగెత్తుతుంది. ఒక్కసారి పెద్ద శబ్దంతో టైరు పగిలి వాహనం అంతెత్తున ఎగిరి రోడ్డు కావల పడింది. తీవ్ర గాయాలతో మత్తుగా చుట్టూ చూసిన రమ్య ఉలిక్కిపడింది. “ఎంత విచిత్రం. కాలం భూమిలాగే తనచుట్టూ తాను గుండ్రంగా తిరుగుతుందా? మనోరమ ఊరు దగ్గరే జరిగిందా ప్రమాదం. మనోరమ, వాళ్ళమ్మ గుర్తొచ్చారు. మదినిండా పశ్చాత్తాప పడింది.

***

హాస్పిటల్లో వారం తరువాత కళ్ళు తెరిచింది రమ్య. మనోరమ తల్లి ఎదురుగా ఉంది. తనకు సపర్యలు చేస్తుంది. సిగ్గుపడింది. “దండం బెడుతూ, క్షమించమ్మా!” అంది రమ్య. ఆమె ప్రేమగా తలను నిమురుతూ ఏం గాబరా పడకు తల్లీ. మనోరమకు విషయం చెప్పాను. కాసేపట్లో ఆమె వస్తుందని ధైర్యం చెప్పింది. రమ్య మనసుకు స్వాంతన దొరికింది. కాసేపటికి అక్కడికి మనోరమ వచ్చింది. జరిగిన మోసాన్ని చెప్పి బోరుమంది రమ్య. అంతా తెలుసని చెప్పి రమ్యను ఊరడించి, కోలుకున్నాక ఇంటికి తీసుకెళ్ళింది. అక్కడ మనోరమ భర్తను చూసి ఆశ్చర్యపోయింది రమ్య. అతను నాన్న పైఅధికారి నారాయణగారి కుమారుడు.

డి.ఎస్.పి హోదాలో ఉన్నాడు. మనోరమ అతన్ని పరిచయం చేస్తూ, “రమ్యా! నా పెళ్ళికి నీకు చెప్పాలని ప్రయత్నించాను. కానీ నీ నంబరు పని చేయలేదు. మీ నాన్నను అడిగితే, అది చచ్చిందనుకో!” అని కటువుగా మాట్లాడాడు. తరువాత నీ గురించి తెలుసుకున్నాను. మావారి సాయంతో నీ భర్తను, దోషులను జైలులో పెట్టించాను. ఇదంతా టీవీ ఛానల్లల్లో, పత్రికలలో రావడంతో మీ నాన్న పరువు పోయిందని ఫీలవుతున్నాడు.” మనోరమ చెప్పిందంతా శూన్యంలోకి చూస్తూ, నిరాశగా విన్నది రమ్య.

***

రమ్యకు ఒంటికయిన గాయాలు మానినా, గుండెకయిన గాయాలింకా మానలేదు. “ఏ మొఖంతో నాన్న దగ్గరికి పోవాలి” మధన పడుతుంది. “రమ్యా! ఒక్కోసారి మన ప్రయాణాలే మన చేతుల్లో ఉండవు. ఊహించని ప్రమాదాలు ఎదురవుతాయి. ఇక మన జీవితాలు ఏ ప్రమాదాలు లేకుండా ఎలా ఉంటాయి?. ఆకాశంలో ఎగిరే పక్షి కింద నీళ్ళను చూసి భయ పడకూడదు. కష్టాలు వచ్చినపుడే మన శక్తి ఏంటో మనకు తెలుస్తుంది” ధైర్యం చెప్పింది మనోరమ. ‘ఆరగ దీసినా గంధపు చెక్క వాసన తగ్గదన్నట్టు’ తాను ఎంత అసహ్యించుకున్నా మనోరమ ఆసరాగా నిలబడడంతో త్వరగా కోలుకుంది రమ్య.

రమ్య కోలుకున్నాక అంతా కారులో రమ్య వాళ్ళింటికి వెళ్ళారు. రమ్యను చూడగానే రమేశ్ కు దుఖం పొంగింది. పూర్తి వివరాలు తెలుసుకోక ముందే బోర్లా పడ్డానని గ్రహించాడు. ఆ వెంటనే ఇద్దరు బిడ్డల పెళ్ళిళ్ళు గుర్తొచ్చాయి. మనసు కఠినం చేసుకున్నాడు. “నేను ఎటువంటి పాపం చేశానో, నీలాంటి బిడ్డ మాకు పుట్టింది. ఇలా బరి తెగించడం మా ఇంటా వంటా లేదు. ఇది మా తల రాత, ఇక నీ బతుకు నీ ఇష్టం. నాకు కుటుంబ పరువే ముఖ్యం” అన్నాడు. అన్యాయానికి గురయ్యానని అక్కున చేర్చుకోవాల్సిన నాన్న పరువు ముఖ్యమనే సరికి రమ్య అవాక్కైంది. పరువే మనిషికి బరువు. ఉక్రోషంగా బయటకు నడిచింది. బయట తలుపు చాటుకు నిలుచుండి అంతా విన్న మనోరమ తల్లి, బయటకొచ్చిన రమ్య చేతిని పట్టుకొని ఇంట్లోకి నడిచింది. ఆమెను చూసిన రమేశ్ నిశ్చేష్టుడయ్యాడు.

******

**– వెలుగు, 13 ఫిబ్రవరి, 2022**

# 5. పాకీజ

"సచ్చిపోక ఎందుకు బతికితిని పెద్దమ్మా... మనుండి జేసేదేముంది. ఈ కడుపు నొప్పితోని నా తర మయితల్లేదు పెద్దమ్మా! ఆడ్నే జీవి పోయిందనుకున్నా. యా అల్లా! నన్నెందుకు బతికిచ్చినవ్. జిందగీ పూరా బర్బాత్ హెూగయే, మై జీకే... క్యా ఫాయిదా!" ఎంకటమ్మ పెద్దమ్మతో మదారి ఎక్కెక్కి ఏడ్సుకుంట మద్యల మద్యల ముక్కు చీదుతుంది. "సొప్ప వాములో నిప్పుదాసుకున్నట్టు" బాధను దాసుకున్న బిడ్డను ఎట్లా ఊకుంచాలో ఎంకటమ్మకు సమజైతల్లేదు. "ఊకో బిడ్డా! మన నసీబ్ గిట్టనే తలగబడ్డదని" నిమ్మలపరుస్తుంది. ఎంకటమ్మ మదిలకు గతం ఆ గదిలో తిరుగుతున్న ఫ్యానులా నెమ్మదిగా తిరిగింది.

***

ఎంకటమ్మ సూర్యాపేటలో సినిమాహాల్ల పాయఖానాలు సాపుజేస్తది. ఎంకటమ్మకు పిల్లాజెల్లా లేరు. నెనరు కల్లది. పిల్లలు కాట్లేరని మొగడొదిలేశి ఇంకో దాన్ని జేసుకుండు. ఇంటి పక్కనున్న మస్తాన్ కాకా కొడుకు నబి పాషా. తమ్ముడు నబీతో ఎంకటమ్మ చిన్నప్పటి సంది కాసు అక్కా తమ్ముండ్ల లెక్క మెలిగింద్రు. మస్తాన్ కాక దినాం భత్తేనికి ఊర్లె ఏటల కోసి పాల్లెసేది. అయ్యలనాడే సోలిపేట చెరువు కింద ఇండ్లు పోతే పాత సూర్యాపేటకు ఎల్లొచ్చింద్రు. ఊరి బయట నాలుగు కమ్మ లేసుకొని బతుకుతుండేది. చిన్నగ చిన్నగది బస్తీ అయింది.

"ఉన్నప్పుడుట్ల పండుగ, లేనప్పుడు లొట్ల పండుగన్నట్టు" అయ్య, మస్తాన్ కాకా ఏ లోటు లేకుండా సంసారాలు సాగిచ్చింద్రు. పండుగలు పబ్బాలు కలిసి జరుపుకునేది. తమ్ముడు నబి పాషా పుట్టంగనే పిన్నీ ఏదో మానని రోగమొచ్చి మంచాన పట్టి పోయింది. తరువాత మస్తాన్ కాకా పెండ్లి జేసుకోలె. అయ్యకు కాకా తోళ్ళ నిస్తే, ఆటితో అయ్య చెప్పులు కుట్టేది. చాతనైనప్పుడు పాయఖానలు సాపు చేసేది. ఇండ్ల లెక్కనే యానాది బతుకు ఊరికి దూరంగా ఉండేయి పడావు బడ్డట్టు. ఎట్టనో... గాళ్ళ బతుకులు గట్టా తెల్లారినై."

నబి పాషాకు కాక చిన్న తనాన పెండ్లిజేసిండు. పెండ్లైనంక పదేళ్లకు తొల్సూరు బిడ్డ మదారి పుట్టింది. అది మర్మ మెరుగని పిల్ల. దురదృష్ట వంతురాలు.

నాలుగేళ్లప్పుడే తల్లికి దూరమయ్యింది. నబి పాషా లారీ మీద పోతడు. మదారికి తండ్రి ఉన్నా లేనట్టే. పిల్లను పట్టించుకోడు. ఆమ్దాని మస్తుగున్నా తాగుడుకు తగలేసేది. పెండ్లాం పోయినంక "అంత మిడిశిన కుక్కోలిగ" తాగుడుకు మరిగిండు. సంసారం గాలికొదిలేశిండు. పొద్దస్త మానం తాగడంతో కండ్లు చింతనిప్పుల్లా ఉండేయి. తండ్రిని చూస్తే చాలు పిల్ల జడుసు కునేది. దగ్గరకు సుత పోక పోయేది.

"ఆడ దిక్కులేని సంసారం. పిల్ల ఈడేరుతుంది. గట్టా తాగకు తమ్మీ.." అని నబిపాషపై ఎంకటక్క గుస్సా చేసినా "చెవిటోని ముందు శంఖం ఊదినట్టే". శెవిన బెట్టేటోడు కాదు. తాగి తాగి ముప్పై యేండ్ల నబి పాషా నలబైల కన్పడేటోడు. "ఇంకో పెండ్లి జేసుకో తమ్మీ" అని ఎంకటక్కంటే నవ్వేటోడు. "అక్కా! నువ్వు నాకు అక్కవు గాదు, అమ్మవు. పావురం గల్ల తల్లివి". తాగినప్పుడు గదుమ పట్టుకొని పావురంగ మాట్లాడేది. ఒక్కగానొక్క బిడ్డ మదారిని ఎంకటక్కకు వదిలేసి నెలలు నెలలు లారీమీద పోయేటోడు. ఇంటికి వచ్చినప్పుడు అంతో ఇంతో ఎంకటక్కకి ఇచ్చేవాడు. పిచ్చి తాగుడు చేబట్కి యాల్లకు తిండి తిప్పలు మర్సిండు. తాగుడు తోటి కడుపు నింపుకుండు. ఆకలిని సంపుకుండు.

సోయి తప్పి తాగిన తాగుడుకు కొన్నాళ్ళకు నబి పాషా కార్జం, కిడ్నీలు పాడైనై. దాంతో మంచాల పడ్డడు. అప్పటికే పద్నాలుగేళ్ళ కొచ్చింది మదారి. అబ్బాజాన్ కడుపు నొప్పితో "అమ్మీ...అమ్మీ !" అని అరిసే అరుపులకు భయపడి దగ్గరికి పోవాలంటేనే గజ్జున వణికేది. మంచాన బడ్డ అబ్బాజాన్ తక్కువ రోజులే నంశిండు. అబ్బాజాన్ బాధ పడ్తుంటే మదారి చూడలేక పోయేది. "అబ్బా.." అంటూ కండ్లు ఉబ్బేటట్టు అబ్బాజాన్తో బాటే ఏడ్సేది. అబ్బా వైద్యానికి గరీబు సంసారం ఆన్లేదు. బేటీ కండ్లల్ల అబ్బాజాన్ మీద పావురం నబిపాషాకు అర్థమైంది. గుండె మెలి పెట్టినట్టు అన్పించింది. ఒకనాడు మదారిని దగ్గరకు పిలిశిండు. కన్నీటితో చేతులు గట్టిగ పట్టుకొని " మాఫ్ కరో బేటీ" అడిగిండు. వరద కట్ట తెగినట్టు తండ్రీ బిడ్డ శానా సేపు ఏడ్సిండ్రు. నబి పాషాకు రోజులు దగ్గర పడ్డె. "దీపంలో పడ్డ పురుగు" లెక్క తాగుడుకు బతుకు బలైందని గ్రహించిండు. బేటీ గురించే సోచాయిస్తుండు. ఎంకటక్కను పిలి పించుకుండు. చెప్పి చెప్పి యాష్టకొచ్చిన

ఎంకటక్క "సావుదలకు బిడ్డ మీద పావురం యాది కొచ్చిందారా తమ్మీ" అంది. "అక్కా ! తోడ బుట్టకున్నా నువ్వు నా అక్కకు తక్కువ కావు. నీ బిడ్డ అనుకో. కండ్లల్ల బెట్టి జూసుకో. బిడ్డ నీ జిమ్మేదారి. సచ్చి నీ కడుపున బుడతా. నీ రుడం తీసుకుంటా" అని కాళ్ళు పట్టుకుండు. మాట తీసుకుండు. "సరే తమ్మీ! నీకేం కాదు. దైర్నంగా ఉండు. బిడ్డ నా జిమ్మేదారి. మాటిచ్చింది ఎంకటక్క." అక్కమాటతో నబి పాషా కండ్లల్ల వాన లేని మెరుపు మెరిసింది. మదారి కండ్లల్ల ఉరుములేని వాన కురిసింది. బిక్క సచ్చినట్టున్న మదారిని చూస్తే "నత్త గుల్లలో ముత్తెము లెక్క" అమాయాకంగా ఏడుస్తూ ఉంది. దగ్గరకు తీసుకొని "నేనున్నా బిడ్డా..!" అని ఓదార్చింది.

"గరీబోల్ల ఇందుకు గంపెడంత జనం" అన్నట్టు సావుకు రానోడు కూడా దినాల కొచ్చింద్రు. అయిన వాళ్ళు, కాని వాళ్ళు అందరూ వచ్చింద్రు. నోటికి, చేతికి దూర మెక్కువ. "కాలిన ఇంట్లే కట్టె మిగిలినా లాభమే"నని కార్యాన్ని దగ్గరుండి కత కత అన్పించింది ఎంకటమ్మ. మదారి తండ్రి పోయి యాడాదయింది. ఎన్కకు తిరిగి పిల్ల గురించి అడిగినోడు లేడు. ఎంకటమ్మ యోచన జేస్తుంది. ఎలాగైనా ముందుపడి ఓ పిలగాన్ని చూసి లగ్గం జేయాలని అనుకుంది. తెల్సిన పిలగాడు చాన్పాషా యాదికొచ్చిండు.

చాన్పాషా బుద్ధిమంతుడు. అసలు పేరు చాంద్ పాషా. అమ్మీ బతికున్నప్పుడు గట్టనే పిలిశేదని సంబురంగా జెప్తడు. అమ్మీ అంటే శానా ఇష్టం. చిన్నతనానే అబ్బాజాన్ అమ్మీనొదిలేశిండు. ఇంకో నిఖా జేసుకుండు. అప్పట్నించి అమ్మీ పాత పరుపులు, దిండ్లల్ల దూదినేకే పనికి బోయి సాకింది. కాలు చేయి ముదరంగనే ఓ సైకిలు, ఐస్ క్రీం డబ్బా కోనిచ్చింది. "బేరం మంచిగ చేయి బేటా" అని జాగ్రత్త చెప్పింది. దాని మీద వాడ వాడన తిరుగుతూ మారు బేరానికి పుల్లైస్ ల నమ్మిండు. పిలగాల్ల ఇస్కూలు కాడ మస్తు గిరాకుండేది. తరువాత పోటీకి ఇంకొకలు వచ్చింద్రు.

చలికాలం రాంగనే ఐస్క్రీం డబ్బా ఆయింత మూలకు బడ్డది. ఇంతట్లనే పాడుబడ్డ దుమ్ము పీల్చి పీల్చి అమ్మీ గాలితిత్తులు పాడైనై. చాన్పాషా అప్పుకోసం ఊరంతా తిరిగిండు. యాడ అప్పు పుట్టలేదు. అమ్మీ గాలి తిత్తులకు గాలి సరిపోలేదు.

చాన్పాషాకు అమ్మీ దక్క లేదు. చాన్పాషా శానా కలలు కన్నడు. చిన్నప్పటి సంది అమ్మీని మంచిగ జూసుకోవాలని దోస్తుల తోని చెప్పేటోడు. "నీటి తెప్పకు ఇగి చెదిరిన ఇసుక గూడులా" కలలన్నీ కన్నీటిలో ఎండకు కరిగిన ఐస్‌లా కరిగినై.

అమ్మీ పోయినాక చాన్పాషా నీరుగారి పోయిండు. ముందటి ఉషారు తగ్గింది. గిప్పుడు అలంకార్ టాకీస్ కాడ మాత్రమే ఐస్ క్రీం డబ్బా పెడుతుండు. ఆడ్నే పనిజేస్తున్న ఎంకటమ్మ చాన్పాషాతో చిన్నగ మాట కలిపింది. మదారి ముచ్చట ఎల్లదీసింది. "బిడ్డా చాన్పాష ! మదారి ఏ దిక్కు లేనిది. నీ లెక్కే అమ్మ, అయ్యను పోగొట్టుకుంది. మదారిని నిఖా జేసుకో." అసలు ముచ్చట జెప్పింది. ఆ ముచ్చట జెప్పంగనే చాన్పాషాకు అమ్మీ యాదిల బడ్డట్టుంది. కండ్లల్ల నీళ్ళు గిర్రున తిరిగినై. ఎంకటమ్మ కష్ట, సుఖం ఎరిగిందాయే. "బిడ్డా ! ఇయ్యాల ఇంట్లె, రేపు మంట్లె". ఏన్నటికైనా అందర మెల్లిపోయేటోల్లమే. ఫికరు జేయకు. ఎక్కడున్నా అమ్మీ దీవెనార్తులు ఉంటాయని నిమ్మల బరిసింది."

అదే ముచ్చట నాల్రోజులకు ఇంకోపాలి ఎల్ల దీసేసరికి చాన్పాషా కాదన్లేక పోయిండు."ఇంటికి దీపం ఆలే" అనుకుని ఒప్పుకుండు. ఎంకటమ్మకు పానం నిమ్మలమైంది. ఎంతైనా పెంచిన పావురం గొప్పదాయే. మాదారి లగ్గమయింది. అంతా కల్సి జాన్పాడు దర్గాకు పోయింండ్రు. పొద్దూక సంబురంగా ఇల్లు జేరింండ్రు. ఎంకటమ్మ బొట్టు పెట్టెల దాసుకున్న యాభై వేల రూపాయలు, ముప్పై తులాల ఎండిని తీసి లెక్క బెట్టి చాన్పాషాకు వరదచ్చినం కింద ఇచ్చింది.

***

పెండ్లయినంక మదారి టౌన్లున్న చాన్పాషా ఇంటికి మారింది. ఎంకటమ్మ అప్పుడప్పుడూ వచ్చిపోతుంది. ఆర్నెల్లకు మదారి నీళ్ళు బోసుకుంది. అమ్మాయి పుట్టింది. అమ్మీ పుట్టిందని చాన్పాషా లెస్స సంబుర పడ్డడు. పసి పిల్ల నవ్వు జూసినంక ఎంకటమ్మ దగ్గర మిగిలిన అన్నో ఇన్నో కూడిన పైసలు సుత అడుగు బట్టినై. చినపిల్ల కాళ్ళకు ఎండి గొలుసులు బెట్టింది. చాన్పాషాతో మదారి జీవితం సంబురంగ సాగుతుంది. మదారికి ఎడం లేకుండా ఎంట ఎంటనే కాన్పులు జరుగుతున్నై. నల్గురు పిల్లలయ్యింండ్రు. గదిజూసి చుట్టూతున్న జనం చాన్పాషాను "చైనాపాషా" అని ఎక్కిరిస్తుండ్రు. "ఉంటే, అమీరు లేకపోతే ఫకీరు". జనం నాలుకే

అంత. ఎడం లేకుండా బిడ్డలయ్యేసరికి మదారి కండ్లల్ల జీవం పోయింది. కొడుకు కోసం చాన్పాషా ఎదురు జూస్తుండు. వంట్లే సత్తువ బోతుంది. చాన్పాషా మీద కోపంతో. “మంచిగ జూసుకుంటవని, భంశి పిల్లనిస్తే గిట్టా జేస్తున్నవ్. పిల్లను మింగి నీళ్ళు తాగుతవా ఏందీ?“ అని ఎంకటమ్మ మందలించింది. ఎవలూ లేని మాకు బిడ్డలెక్కువ కావాల్నని కంటున్నామని‘‘అనే సరికి ఎంకటమ్మ మారుమాట్లాల్లేదు.

ఎంత సర్దుకున్నా మదారి సంసారానికి పుల్లైస్ క్రీముల మారు బేరం సరి పోతల్లేదు. “ఏడ్చిన బిడ్డకే పాలు” అన్నట్టు గంపెడు మంది పిల్లలకు బువ్వ పెడుతుండు. సలి కాలం వస్తే ఇంకా ఎటమట మయింది. నోటి కాడికి బువ్వ లేదు. అసలే ఇప్పుడు మాదారి వట్టి మనిషి కాదు. బువ్వలేక మదారి ఒంట్లె సత్తువ బిడ్డ బిడ్డకు జారింది. ఒంటి కున్న కండ పోయి ఎండు కట్టయింది. కండ్లు బాయిల పడ్డె. చాన్పాషా పోరగాండ్లు బువ్వ లేక అప్పుడప్పుడు మట్టి బుక్కుతుంర్రు. నమ్మలేకున్నా అది నిజం. మదారికి తెలిసి అన్నానికి బదులు వాళ్లకు వాత పెట్టింది. చాన్పాషా మాటల్ల బలం పోయి బాయిల పడ్డది. డొక్క లోపలికి పీక్కపోయింది.

దాంతో అవ్వ కోనిచ్చిన ఐస్క్రీం డబ్బాను మూలకేసిండు. “పొట్ట తిప్పలకు జేరుపోతులాట.” లారీ మీద క్లీనరు పనికి కుదిరిండు. రాత్రనక పగలనక పోతుండు. ఎప్పుడో అద్దనేత్రి ఇంటికొస్తుండు. ఓనాడు తాగి ఇంటికొచ్చిండు. మదారి వణికిపోయింది. తెల్లారి పెద్దమ్మను పిలిపించింది. అరిసింది. గోలజేసింది. ఇంకెప్పుడూ తాగనని పిల్లల మీద, తన మీద ఒట్టేయించుకుంది. తరువాత ఇంకెప్పుడూ తాగలేదు. లారీ తోల నేర్సుకుండు. రాబడి పెరిగింది. సంసారం పుంజుకుంది. ఐదో సంతానంకూడా ఆడపిల్లే.

ఐదేళ్ళు నోట్లెకయితే బోతున్నై. పిలగాండ్లకు ఆకలి తెల్వనీయక పోయేసరికి మట్టి బుక్కుడు పురాగాపిండ్రు. జనంల ఇజ్జత్ పెరిగింది. “చాంద్ పాషా ..” అని పిలుస్తుండ్రు. ఎంకటమ్మ పెద్దమ్మకు తబేదు కరాబయిందన్న ముచ్చట తెల్సి ఆలుమగలు బోయి ఇంటికి తోలుకొచ్చిండ్రు. దవాఖానాకు తీసుకుబోయిండ్రు. మంచిగ చూయించి ఇంటికి తెచ్చిండ్రు. మందులాడుతుండ్రు. పెద్దమ్మ కోలుకుంటుంది. మంచం నుండి లేశి తన పనులు సొంతంగ చేసుకుంటుంది.

పురాగ కాల్జేయి స్వాధీనంలోకి రాలేదు. బిడ్డ తనకు ఆసరయినందుకు సంబుర పడ్డది. బిడ్డ బువ్వ బయట పడ్డదని కండ్లనొత్తుకుంది. మదారి ముఖాన మునుపటి జీవకళొచ్చింది. నీళ్ళు బోసుకున్న ముచ్చట పెద్దమ్మ సేవినేసింది మదారి.

***

హైదరాబాదులో లోడు దించి సూర్యాపేటకు తిరిగొస్తుండు చాన్పాష. కేతేపల్లికి ముందే జోరున వానందుకుంది. ఈలోగా చీకట్లు ముసిరినై. వాన తగ్గినాక పోదమని లారీని రోడ్డు పక్కన నిల్పిండు. ఎదురుగా బరువుతో వచ్చిన ఇసుక లారీ బలంగా గుద్దింది. లారీ ఎగిరి రోడ్డు కవతలున్న మడికట్లల్ల పడ్డది. క్లీనరు అక్కడికక్కడే ఊపిరిడిశిండు. లారీతో బాటు చాన్పాష బతుకు కూడా తిరగబడ్డది. కాలురెక్కలు ఇరిగినై. ఎన్నుపూసకు బలంగా దెబ్బతగిలింది. ఎంకటమ్మ మంచం చాన్పాష కొచ్చింది. ఎంకటమ్మ పని మదారి మెడకు పడ్డది. దాంతో పిల్లల నోట్లె మళ్లా మన్నుబడ్డది.

మదారికి ఇల్లు దాటక తప్పలేదు. కంటికి పుట్టెడేడ్సింది. బిడ్డ దుఃఖం చూసి ఎంకటమ్మకు కూడు సయిస్తల్లేదు. మదారిప్పుడు వట్టి మనిషి కూడా కాదు. మదారి గడప దాటకుంటే ఇల్లు గడవదు. మదారి కూడా పోరగాల్లకు ఇంత గంజి నీళ్ళు పోయాలంటే ఇల్లు దాటాలని నిర్ణయించుకుంది.

***

కడుపున బిడ్డనేసుకొని, ఆకలి దాసుకొని సంకన బిడ్డతో గడప దాటింది మదారి. కండ్లల్ల ఆవుసు పోయింది. పనికి బెట్టుకోడానికి టాకీసు యజమాని ఒప్పుకోలేదు. ఎంకటమ్మ జాగల ఇంకోలు పనిజేస్తుండ్రు. శానాల్లు నమ్మకంగ పంజేసిన ఎంకటమ్మ బతిమాలడంతోని ఒప్పుకుండు. మదారికి పని దొరికింది. ఏగిలి బారంగ నాలుగింటి కాంచి తొమ్మిది దాక టాకీసు ఎదురుంగున్న బస్టాండుల పాయ ఖానాలు కడుగే పని కూడా ఆయనే చూపిచ్చిండు. బస్టాండుల రోజు కూలీ ఇస్తమన్నరు. మొదటి దినాన ఇచ్చిన ఆ పైసలు బెట్టి బియ్యం, సరుకులు కొనుక్కొచ్చింది. ఇంటికి రాంగానే వంటికంటిన ఆసనకు పిల్లలు దూరంగా జరిగింద్రు. తానం జేసింది. బువ్వొండి అందరికీ బెట్టింది. కడుపు నిండినట్టైంది తల్లి మనసుకు. నాల్రోజులు పని జేసినాక గానీ మదారికి అర్ధమయింది. ఎంకటమ్మ

పెద్దమ్మ ఎంత బాధ నోర్సుకుందో.

"ఛీ పాడు గాను. గబ్బు.. ఆసన. ఉచ్చ గచ్చు వాసన. ఆ అసనకు బిడ్డతో పాటు కడుపుల పేగులు బయట పడతాయేమో అన్నంత దుర్వాసన వస్తుంది. అల్లా..! ఏందీ నాకీ శర. ఒకడు తాగి కాండ్రించి ఊస్తడు. దవడకు తంబాకుతో ఒకడు. కిల్లితో ఒకడు. నానాచండాలం జేస్తుండ్రు." అనుకునేది. మొదట నాల్రోజుల దాకా కడుపుల గంటెసి దేవినట్టు బాధ పడ్డది. ఆసనకు ఊపిరాపుకొని ఆడ్నించి బయటపడేది. బువ్వ తినేటపుడు కూడా ఆ ఆసనే గుర్తొచ్చేది. తినబుద్ది కాక పోయేది. ప్రతి గంట కోసారి కడిగినా ఇంకో గంట సేపటికి అదే కత. బస్టాండుల పని కష్టంగా ఉంది. కానీ తప్పక ఆ పని చేస్తుంది మదారి. మందులాడడంతో పెద్దమ్మ తేరుకుంది. ఇంటికాడ బువ్వ వండి పిల్లలను, చాన్పాషాను జూసుకుంటుంది. రోజులు గడుస్తున్నె. మదారికిప్పుడు నెలలు. "నేను పనికి బోతా మదారి" అని పెద్దమ్మ అంటే, "పురాగ కోలుకో పెద్దమ్మా"ని చెప్పి పనికి బోతుంది.

ఏగిలిబారంగ బస్టాండుకు పోయింది. దొడ్లను కడిగే పనిలో ఉండగా పైసలు వసూలు జేసుకునే తమ్ముడు శీనుగాడు వచ్చిండు. "అక్కా అవ్వకు బాలేదు. ఇంటికి పోతున్న. తొమ్మిదికి వస్తా. గల్లా జూసుకో" అని చెప్పిపోయిండు. బస్టాండు కాడున్న మసీదులోంచిమైకుల నమాజు చదువుతుండ్రు. గొడ్డుమాదిరున్న నడీడు మనిషి ఒకడొచ్చిండు. లోపలికి పోవడానికి రూపాయిచ్చిండు. బాగా తాగినట్టుండు. రాత్రి తాగిన తాగుడుకు కడుపుల పులిసిన ఆసన అంతదూరం నుండి గుప్పున ఆసనోస్తుంది. దాన్ని సొరుగులేసింది. దొడ్లకు బోయిండు. ఇది కడగలేదు. వచ్చి కడగమని కరుకుగా చెప్పిండు. నీళ్ళు బోసి కడుగుతుంటే ఎనుక నుండి వచ్చి, ఎలుగు బట్టినట్టు బట్టిండు. "కామానికి కన్ను లేదు". అరవబోయిన నోటిని అరజేత నొక్కిపట్టిండు. వాని ఆరాటం ముందు మదారి యాతన పెద్దది. ఒక్కసారిగా చేతులతో వాన్ని తన్ని అక్కడినుండి పారిపోవాలని ప్రయత్నంజేసింది. వాడు మదారి తలను ఒక్కసారి గోడకు బాదడంతో కండ్లు మస్కలు బారినై. తెలివితప్పింది. మదారి కడుపుల బిడ్డ కళ్ళు తెరవకముందే కండ్లు మూసుకుపోయిన కామానికి, సచ్చిన బిడ్డ కడుపులోంచి జారి పాకీ కాలువల బడ్డడు. ఈసారి సచ్చిపుట్టిన బిడ్డ మగబిడ్డ. నెత్తుటి మడుగునున్న మదారిని పుణ్యాత్ముడేవరో గవర్నమెంటు ఆసుపత్రిల షెరీక

జేసింద్రు. గా ముచ్చటంతా చెప్పి పెద్దమ్మతో కండ్లనీళ్ళు బెట్టుకుంటుంది మదారి. డాక్సారు రాకతో ఆలోచనల్లోంచి బయటపడ్డది ఎంకటమ్మ.

***

నాల్రోజులైనంక మదారీని బాగైనంక ఇంటికి తీసుకొచ్చింది ఎంకటమ్మ. "పేదవాని గొంతు సూది బెజ్జమంత". ఆ అన్నేలాన్ని అడిగినవారే లేరు. మదారి పెద్దబిడ్డ సల్మా. పన్నెండేల్లకొచ్చింది. ఇంటి పరిస్థితులను అర్థం జేసుకుంటుంది. మదారి మనసుపై పడ్డ గాయం మానలేదు. అయినా సంసారం కోసం పాయఖానాలున్న ఏర్గును తల మీద నెత్తుకొని ఎత్తి బోస్తునే ఉంది. మదారి జీవితంలో మార్పు లేదు. మొగడు, సంసారం తిరిగి బాగైతయని ఆశతోని కాలాన్ని కష్టంగా ఎల్లదీస్తుంది. "అదృష్టం చెప్పి రాదు, దురదృష్టం చెప్పి పోదు". అయ్యాల బుధారం. మదారి అంగడికి పోయింది. అమ్మీ జిలేబీలు కొనుక్కొస్తదని పిల్లలు, మందుల కోసం చాన్వాషలెదురు జూస్తుంద్రు.

మదారి వయసు ముప్పై రాకముందే ముసలిదానిలా అయిపోయింది. రెండు సంచులు చేతుల బట్టుకొని ఈడ్సుకుంట వచ్చింది. "అమ్మీ..ఇటియ్యి సంచులు' అనుకుంట ఎదురొచ్చింది సల్మా. అమ్మీతో "బస్టాండు ఎదురుగా సులభ్ కాంప్లెక్స్ బడ్డది. పాయఖాన కడగడానికి మనుషులు కావాలని శీనుమామ చెప్పిండనన్నది సల్మా". మదారికి సల్మా మనసు అర్థమయ్యింది. కష్టేఫలి. సల్మా పాకీపనిలో పుట్టిన పాకీజలా కాకుండా బురదలో పుట్టిన తామరలా కన్పించింది. సల్మా చేతులున్న సంచులనందుకున్నాక మాదారి బరువు దిగింది.

*** ***

**-నవ తెలంగాణ, సోపతి- 13 మార్చి, 2022**

# 6. తావు

అది భగవంతాపురం. ఒకప్పుడు చిన్న తండాగా ఉండేది. బువ్వాల్ల కావొస్తుంది. అరక కట్టినోల్లు ఇంటికొచ్చి బువ్వ తాగుతుండ్రు. బయట జీపు సప్పుడైంది. కాసేపటికి పెద్ద శోకంతో శాంతమ్మ గొంతు ఇనబడ్డది. ఏమైందాని జనం బయటకొచ్చి చూస్తుండ్రు. లక్పతి బువ్వగిన్నెతో ఇంటి బయటకొచ్చిండు.

"అయ్యా! నీ కాల్మొక్త... దండం పెడతా .. బాంచన్.. దయ సూపురి సారు. ఆడ పిల్లల తల్లిని. మగ దిక్కు లేని సంసారం...నా ఇల్లు కూల్చకురీ. జర నా తావు నిలుపురి " తండా కొచ్చిన రెవిన్యూ అధికారి విళంబి కాళ్ళను బిర్రుగుండ చుట్టింది శాంతమ్మ.

"వదలమ్మా! వదులు నా కాళ్ళను. జిడ్డులా పట్టుకున్నావు. నేనేం చేయలేను. పై నుంచి నాకార్డరొచ్చింది". "బొంత పురుగు కాలు మీద పాకినట్టు" కాళ్ళను బలంగా జాడిచ్చిండు విళంబి. సైగ జేయంగనే షేక్సిందు ఎంకన్న పనోల్లకు సైగ జేసిండు. ఇంటి మీద పడ్డ గడ్డపార పోటు, శాంతమ్మ గుండెల్లో దిగబడింది. క్షణాల్లో ఇంటితో బాటు సర్కారు బలం ముందు శాంతమ్మ సుత మొదలు నరికిన చెట్టు లెక్క ఒక్కపాలిగ కుప్ప కూలింది. లక్పతి వచ్చి శాంతమ్మను ఇంట్లకు తీసుకబోయి మంచిల్లు తాపి నిమ్మల బరిసిండు.

***

భగవంతరెడ్డి తండా సూర్యాపేటకు ముప్పై కిలోమీటర్ల దూరముంటది. ఆ తండాలో గుడిసెలు, ఎగుసాయం ఒక్క తానుంటై. ఒకప్పుడది చిన్న పల్లె. నాలుగైదు కుటుంబాలుండేవి. వాళ్ళు భగవంతరెడ్డి పటేల్ తాన జీతముండ్రు. పటేల్‌కు వందెకరాల భూమి ఉండేది. పటేల్ తాన నమ్మకంగా రెక్కలు దార బోసిండ్రు. అట్లా అట్లా నికరంగా గుడిసెలు సంపాయించుకుండ్రు.

కొన్నాళ్ళు పొట్టకు బట్టకన్నట్టు సంసారం నడిసింది. మూడు తరాలు నెత్తురును నీరు చేసినాక గాని గుడిసెకో గంటెడు ఎగు సాయం జాగా కండ్ల

జూడలె. పల్లెలో రాాన్రాను జనం పెరిగింగ్రు. తండా భగవంతాపురం అయింది. మంద పెరిగితే యజమానికే లాభమన్నట్టు ప్రభుత్వం తండాను గ్రామ పంచాయితీగ మార్చింది. తరువాత ఆడ ఎన్నో ఇచిత్రాలు జరిగినై. కరెంటు తంబాలు రాలేగని ఇండ్లల్లకు కరెంటు బిల్లులొచ్చినై. ఇల్లు లేనోల్లకు ఇంటి పన్నులొచ్చినై. "గిదేంది గీ అన్నాలం " అని లక్పతడిగితే "పోలీసులొచ్చింగ్రు." బిల్లులు కట్టని ఇండ్లల్ల జొరబడి తలుపులు ఊడ బీక్కబోయింగ్రు. దొడ్లె గుంజకున్న దూడలనిప్పి గుంజుక బోయింగ్రు. చివరికి వాళ్ళ శర పడలేక బిల్లులు కట్టింగ్రు.

ఐదెకరాల ఆసామి లక్పతి. "నేను కట్టనని" పోలీసులకు మర్ల వడ్డడు. లక్పతిని జీపు లెక్కించుకొని నాాల్రోజులైనంక దించి పోయింగ్రు పోలీసులు. వాళ్ళ పిచ్చి కొట్టుడుకు మంచాన ఆర్నెల్లు నమిశిండు లక్పతి. లాభం లేదని పెద్దాసుపత్రికి తీసుకబోతే పోలీసులు కొట్టిన దెబ్బలకు కార్జం దెబ్బతిన్నదని చెప్పింగ్రు. రెండెకరాలు అమ్మినాక గాని మనిషి మనిశైండు.

***

భగవంతాపురం తండా గ్రామపంచాయితీగ మారినంక "ఊరికి స్మశానం కట్టమని సర్కారు హుకుమిచ్చింగ్రు". దాంతో రెవిన్యూ అధికారి విళంబి సర్వేకోసం వచ్చిండు. సర్వే చేసిండు. పంచాయితీ కార్యాలయం తాన "స్మశానంకోసం ఎంచిన భూమి నాలుగెకరాలల్ల శాంతమ్మకున్న ఇల్లు, రెండెకరాల భూమి సుత ఉంది" అని నోటీసు అంటించిండు. నాాల్రోజులకొచ్చి ఇల్లు కూల్చుడానికి మనుషుల తీసుకొనొచ్చిండు. ఎంట పోలీసులున్నరు. "ఎంకి పెళ్లి సుబ్బి చావు కొచ్చినట్టయింది". గీ ముచ్చట తెల్సుకున్న శాంతమ్మ, బాయి కాడ చేస్తున్న పనొదిలి ఉరుక్కుంటొచ్చింది. ఆఫీసరు విళంబి కాళ్ళు పట్టుకొని గోడంత ఎల్ల బోసుకుంటుంది. ఉండ తావు లేదు. "ఆదెరువు లేదు. దయ చూపురి సారూ. నా ఇల్లు కూల్చకుర్రీ, నీ కాల్మొక్త బాంచన్" అని కాళ్ళు పట్టుకుంది.

"మొగుడు పోయిన శాంతమ్మకు గా రెండెకరాల భూమి, ఇల్లే ఆదెరువు" ఎట్టానన్న దయ సూపురి సారూ అన్న ఊరి పెద్ద నోరు నొక్కిండు అధికారి.

***

"కాళ్లొదులు...వదులమ్మా కాళ్ళను" కోపంగా అరిశి చెప్పిండు విళంబి.

శాంతమ్మ మొండిది. ఇడ్వలె.

"అయ్యా నీ దండం పెడతా. నాది పట్టా భూమి. రెండు పంటలు పండుతై. మగ దిక్కులేని సంసారం. ఆడ పిల్లలు గల్లదాన్ని. మీకు కావాల్నంటే ముందుకు బోతే దొరుకుతది. గాడ చాలా మంది పటేండ్ల భూములున్నై. ఇరవైఎకరాల పెద్దాసాములుంగ్రు. వాళ్లై తీసుకొండ్రి. చేసే దిక్కు లేకగా శెల్కలు పడావుబడ్డై. ఆ శెల్కలల్ల రాళ్ళు బోళ్లున్నై. పంట పండదు. గయి తీసుకోరి. మా కడుపు కొట్టకురి సారు. నీ... కాల్మొక్త.. నీ... దండం బెడ్త..." ఒత్తి పలుకుతూ బతిలాడుతుంది."

గదేందమ్మా ! ఊరు హద్దుకు బయటున్న భూములయి. గాల్లెందుకిస్తరు?".

"గయి నాకు తెల్వదు దొర. నీ బాంచన్. నాకుండ తావు లేదు. బొందల గడ్డ నా జాగన కడ్తే నాకున్న ఎకరం పదిగుంటలతో బాటు ఇల్లుకూడా పోద్ది. దిక్కు లేని దాన్నయిత. నా బిడ్డలు అనాదలైతరు. నెనరు చూపురి. నీ కాల్మొక్త. దండం పెడత." రెండు జేతులా మొక్కుతూ కాల్లిడవలె శాంతమ్మ.

విళంబికి నిదానిచ్చి చెప్పే ఓపిక తగ్గింది. కాళ్ళను ఒక్క పాలి విదిల్చిండు. మోకాలు శాంతమ్మ మూతికి బలంగా తగిలింది. శాంతమ్మ ఆక్రోశం లెక్కనే నోటినిండా బుక్కెడు నెత్తురు బయటకొచ్చింది. శాంతమ్మ జుట్టు కొప్పు ఇడివడి ఆమె బతుకుల్లెక్క ఇగి చెదిరిపొయినై.

జరిగేదంతా బెదిరిపోయి చూస్తున్న పన్నెండేళ్ళ రాజ్యం, పదేళ్ళ లక్ష్మిలు "అమ్మా!.." అనుకుంట శాంతమ్మ తానకు ఉరుకుతొచ్చింగ్రు. నెత్తురు జూసినాక విళంబికి గాబరా మొదలైంది. శేక్సిందు ఎంకన్నకు సైగ జేసిండు. శాంతమ్మను రెక్కబట్టి లాగి దూరంగా కూసో బెట్టిండు ఎంకన్న. శాంతమ్మ గోస అధికారులకు "చెవిటోని ముందు శంఖం ఊదినట్టైంది". దాంతో శాంతమ్మ విళంబి కాళ్ళను వదిలేసి నట్టుగానే, ఇంటిని తరువాత భూమినీ వదిలేసింది. "సింహం వేటు పడ్డ జింక లెక్క" శాంతమ్మ మది గింజుకుంటుంది. "దూరంగా నిలబడున్న జింక ల్లెక్క" తండా జనం బెదిరి పోయి దూరంగా నిలబడి చూస్తుంగ్రు. వేట ముగిసింది. ఏలి ముద్ర లేసుకొని అధికారి, పోలీసులు ఎల్లిపోయింగ్రు. లక్పతి శాంతమ్మను ఇంట్లెకు తీసుకు బోయినాక జనం చుట్టూ చేరింగ్రు. గట్టు తెగిన శాంతమ్మ శోకాన్ని ఆగ బట్టుడు అక్కడెవరికీ వశ పడతలేదు.

***

మొన్న గాలివానకు శాంతమ్మ గుడిసె కప్పు లేసిపోయింది. ఆడపిల్లలెది గొస్తుంద్రని సాటు కావాల్నని అప్పుజేసి మరీ నాలుగు రేకులేసుకుంది. కట్టుబడికి కూలీ లెల్లక, కూలికి పోయి మరీ సుతార్లకు డబ్బులు కట్టింది. గూడు నిలబడ్డదన్న సంబురం నాల్గుదినాలు నిల్వలే. ఇల్లుపోయింది. ఎగుసాయానికి, ఇంటికి జేసిన అప్పు మిగిలింది. "అన్నేలానికి ఆకలెక్కువ". అది శాంతమ్మ బిడ్డల నోటికాడ బువ్వకాశ పడ్డట్టుంది. ముచ్చట తెల్సిన అప్పు లిచ్చినోల్లు ఆగలే. సర్కారు ఇచ్చే నష్ట పరిహారం వచ్చినాక ఇస్తనని నచ్చచెప్పింది.

'ఆ పైసలు వచ్చినా చేతిల పైస మిగలదు. ఏడబోదు. ఏం జెద్దా. నామర్దాతో బతుకుడు కంటే సచ్చుడు నయం.' శాంతమ్మకు రేయింబగలు ఇదే యోచన. తావుతో బాటు దైర్నం పోగొట్టుకుంది. కంటి మీద కునుకు కరువయింది. దాంతో బతుకు బరువైనట్టు కడుపుకు బువ్వ సైస్తల్లేదు. ఆకరికి ఒక యోచన కొచ్చింది.

***

రాత్రి రెండోజాము దాటుతున్నట్టుంది. నిద్ర పట్టని శాంతమ్మ బయటకొచ్చి చూసింది. తండా మొత్తం నిద్రలున్నది. దూరంగా నక్కలు, ఆకలితో వూలలు పెడ్తున్నె. బిడ్డలను నిద్ర లేపింది. వాళ్ళు మంచి నిద్రలుంద్రు. బువ్వలేక పోరగాండ్లు అటు నుసిలి, ఇటు నుసిలి ఏ రేత్రికాడనో పండుకుంద్రు. నిద్రచాలక "నిద్దరొస్తుందమ్మా..!" అనుకుంట చిన్నది లేస్తల్లేదు. తరువాత రాజ్యం లేసింది. ఆవులించుకుంట "ఏందమ్మా గిప్పుడు లేపినవ్?" అనడిగింది. "చెప్తగని సెల్లెను లేపు బిడ్డా !" రాజ్యం నిద్రమొకాన్నె చెల్లెను నిద్రలేపింది. శాంతమ్మ దేనికోసమో దోలాడుతుంది. కొంచెంసేపటికి దొరకబట్టింది. అది నీళ్ళబకెట్. దానికున్న చేంతాడిప్పింది. కొడవలితో బారెడు పొడవుతో ముక్కలు చేసింది. చేతుల తాళ్ళను పట్టుకుని పిల్లలతోబాటు బయటకు నడ్సింది శాంతమ్మ.

***

శాంతమ్మ పిల్లలతోని ఊరి బయట మోటబాయి కాడికి తోవ దీసింది. పిల్లలు ఈత కొట్టడానికి ఆ బాయి కాడికి ఇంతకు ముందు ఎన్నో తేపల వచ్చింద్రు.

కానీ అమ్మ ఈ నేత్రికాడ ఎందుకు బాయికాడికి తీసుకొచ్చిందన్నది తెల్వలేదు. "అమ్మా..! ఆకలైతుంది"లక్ష్మికి నడ్సేసరికి ఆకలి యాదికొచ్చింది. రాజ్యం అమ్మనే చూస్తుంది. అమ్మ బదులియ్యలె. అమ్మ కండ్లు ఏడ్చి ఏడ్చి ఉబ్బినై. మొకం ఉద్దరకిచ్చింది. అమ్మ ఒళ్ళు మసిలి పోతుంది. రాజ్యానికి అమ్మ ఆలోచన కొంచెం కొంచెం మతికి తెలుస్తుంది.

శాంతమ్మ పిల్లల్ని తీసుకొని మోటబాయి తానకి చేరుకుంది. మోటతోలే తంబాల కాడికి పోయి బాయిలకు జూసింది. బాయిలో నీళ్ళు వాళ్ళ బతుకులో ఆశల లెక్క లోతులో కనబడ్తున్నై. బాయిల చందమామ పెంక మీద కాలిన జొన్న రొట్టే తీరుగ తేటగా, ఓ దరికి కన్పడుతుంది. శాంతమ్మ ఎంటతెచ్చిన చేంతాడు ముక్కలలో ఒకటి తీసి లక్ష్మి చేతులకి, కాళ్ళకు కట్టింది. తరువాత రాజ్యం కాళ్ళకు, చేతులకు కట్టింది. రాజ్యం అమ్మ ఆలోచన గ్రహించింది. ఏడ్సుకుంట "అమ్మా ఏం జేస్తున్నవే. మమ్మల్ని సంపుతున్నవా ఏందీ? మాకు బతకాలని ఉందమ్మా. అమ్మా! దండం బెడతా ! వదలమ్మా" బతిలాడుతుంది. ఇన్పించుకోలేదు శాంతమ్మ. "మనం బతికి చేసేదేం లేదు బిడ్డా. మనకు బతికే బాగ్గెంలేదు. మన కర్మ గింతే. నేను కూడా మీతో పాటే బాయిల దూకుతా. బిడ్డా ! భయ పడకురి" సావు దైర్నం నూరి పోస్తుంది. బిడ్డల మొకంల భయం చూడంగనే శాంతమ్మకు పురిటినొప్పులు యాదికొచ్చినై. శోకం రెండింతలైంది. అప్పులు మదిల బడ్డె. అంతే. పిల్లలనమాంతం బాయిలకు తోసింది. రాజ్యం, లక్ష్మిలు కాళ్ళు చేతులు ఆడిస్తే బతుకుతరు. ఏటినైనా ఎదురీదే ఆ చిట్టి కాళ్ళు, చేతులకు తాళ్ళు అడ్డుపడ్డె. శాంతమ్మ నడుముకు పెద్దబండ కట్టుకుంది. పైకి జూస్తూ దండంపెట్టి గబుక్కున బాయిల దూకింది.

***

రోజులు గడిచినై. భగవంతాపురం బాగా పెరిగింది. దగ్గరలో పరిశ్రమలు పడ్డె. భూములకు రెక్కలొచ్చినై. ఊరుగుండా నాలుగు వరుసల సడక్ మంజూరైంది. సర్వే మొదలైంది. సర్వే చేసిన కాయితంలో రోడ్డుకు దగ్గరున్న ఇండ్లు, పంట చెల్కల భుములున్నై. సర్కారు నష్ట పరిహారం ఇస్తామన్నారు. బయట మార్కెట్ విలువలో అది పది పైసలు కూడా కాదు. వాళ్ళంతా తమ తావు పోతుంటే చూస్కుంట ఆగ బట్టలేక ఎమ్మెల్యే రాజిరెడ్డిని కలిసింద్రు. "అయ్యా ! ఇది మా తావు. ఇదొదిలి

మేం యాడ బోదుము? ఎట్టనన్న దీన్ని ఆపురని" బతిలాడింద్రు.

కోట్ల విలువైన భూమది. దానిపై రాజి రెడ్డి కన్నుబడ్డది. దాంతో ఇంజనీరును పిలిపించుకుండు. భూముల కబ్జా చేసిండు. తరువాత మ్యాపులో రూటు మార్పించే ఒప్పందం చేసుకుండు. అంతకు ముందే గా భూములను దక్కించు కోవాలని చూసిండు. "పైసలిస్త మీ భూములు నాకియ్యమని" అడిగిండు. నాయకుని మాట విని నివ్వెరబోయింద్రు. "కంచే చేను మేస్తే కావలెవరు?" అనుకుంద్రు. ఆయనకు ఎదురుమాట్లాడితే శాల్తీల్లేకుండా చేస్తడని భయపడ్డరు. కొందరొప్పుకుంద్రు. ఏ అదెరువు లేనోల్లకు అది మింగుడుపడలేదు. తెగువ చూపింద్రు. తమ ఇండ్లను భూములను వదిలిపెట్ట దలుచుకోలే. బలానికి, బలగానికి ఎదురు తిరిగింద్రు. దాంతో వాళ్ళ ఇండ్లకు నీళ్ళు బందైనై. ఇంట్లో కరెంటు తీగలు వంట్లో నరాలు తెగినై. అయినా వాళ్ళు దారికి రాలేదు. మరోవైపు మొదట భూములు ఇస్తామని ఒప్పుకున్న జనం తిరుగుబాటు దారులకు మద్దతు తెలిపింద్రు. జనాన్ని దారిలోకి తేవడానికి పోలీసు లొచ్చింద్రు. నచ్చ జెప్పింద్రు. భయ పెట్టింద్రు. జనం వినలే.

పోలీసులు రెండోపాలి అద్ద రాత్రి ఊరు చేరింద్రు. ఆ రాత్రికి గుండె లేనట్టుంది. బూటుకాలు కిందపడి రక్త సిక్తమైంది. లక్పతి కొడుకు భీక్యా ఎదురు తిరిగిండు. "మీరు దొంగలకు సద్దులు మోస్తుంద్రు" అని పోలీసుల నంటే వాళ్ళు కోపంతో మక్కెలిరగ దన్నింద్రు. భీక్యా పెండ్లాం లచ్చుం బాయి అడ్డం పడ్డది. "అయ్యా ! కాల్మొక్త బాంచన్ ! మా ఎంబడి బడకురి. నా మొగున్ని ఇడిసిపెట్టండి. మీ దండం బెడ్తా. కాల్మొక్తా ..బాంచన్! ఈ జాగాలు కబ్జా పెట్టుకున్నది కాదు. ఆరుగాలం కష్టపడి కొనుక్కున్నం. మా ఇండ్లు కూల్చకురి". గోడు గోడున గోడు నెల్ల బోసుకుంది. "ఏడనన్నా మనుషుల సంపి అందంగా బొందలగడ్డ కడ్తరా అయ్యా?" అని అడ్డం పడ్డది. "లేబరి ముండా! మాకే అడ్డమొస్తవా" అని లచ్చుంబాయి జుట్టుపట్టి ఈడ్చి డొక్కల తన్నిండు అమీసాబు. గొంతున్న వాళ్ళను ఎత్తుక బోయి జీపుల్ల కుక్కింద్రు. జనాల నోట్లె మన్ను కొట్టి, జీపు వేగంగా పోయినై.

దాంతో జనం ఆ తావు మీద ఆశలొదిలేసుకుంద్రు. బతుకు తావు చుట్టూ ముండ్ల కంచె పడ్డది. ఇండ్లన్నీ నేల మట్టమై వాళ్ళ జీవితాల్లాగే ఇట్రీకంగ మార్నై. ఈ అరాచకం బయటకు పోక్క నీయలేదు ఎమ్మెల్యే రాజిరెడ్డి. అధికారం, డబ్బుతో

నోరు మూయించిండు. దస్త్రాల మీద వేలి ముద్రల నేయించుకొని టేషన్లున్న జనాన్ని వదిలి పెట్టింండ్రు. ఇప్పుడు వాళ్ళు సొంత జాగను కంటితో చూసినా ఒంటిమీద లాఠీ తయ్యినాడుతుంది.

పోలీసుల దెబ్బలకు భీక్య తబేదు కరాబయ్యింది. పెద్దాసుపత్రికి పట్నం పోతే భీక్య పెండ్లానికి శాంతమ్మ కలిసింది. కావలించుకొని రోడ్డు మీదనే పట్టుకొని ఏడ్సింది లచ్చుంబాయి. జరిగినందంతా చెప్పింది. ఆమెను నిమ్మలబరిచి ఇంటికి తీసుకబోయింది శాంతమ్మ. చేతనైనంత డబ్బు సాయం చేసింది శాంతమ్మ. భీక్య ఆరోగ్యం కుదుటబల్లేదు. రోజు రోజుకు దిగ జారింది. తన పాలు కొచ్చిన రెండెకరాల్లో ఎకరన్నర రోడ్డుకు పోగా మిగిలిన అరెకరం అమ్మినా మనిషి దక్కలే. శాంతమ్మ పిల్లలతోబాటు భీక్య పీనిగను తీసుకొని ఊరు జేరింది. లక్పతి శాంతమ్మను బట్టుకొని అమ్మా అనుకుంట శోకాన్ని పంచుకుండు. కార్యం అయిపోయాక పిల్లలానాడు అమ్మ తీసుకున్న ఊరి బకాయిలను తీర్చారు. తరువాత పట్నం బయలు దేరింండ్రు.

***

భూమి, కాలం తిరుగుబోతులు. శాంతమ్మకు మొదటిది గాయాన్ని చేస్తే, రెండోది మాన్పింది. లక్పతి వరుసకన్నవుతడు. సచిపోదామనుకున్న ఆ రాత్రి శాంతమ్మను, పిల్లలను భీక్యా కాపాడిండు. ఆ రోజు భీక్య మోట తోలడానికని బాయి కాడికి పోతుండు. మోట బాయికాడికి రాంగానే పెద్ద సప్పుడు ఇనబడింది. దబదబ ఆడికి ఉరికిండు. అప్పటికే పిల్లలను బాయిల తోసి దుంకుతున్న శాంతమ్మను జూసిండు. ఎంటనే బాయిల దుంకి అందరినీ కాపాడిండు. దైర్నం చెప్పిండు. శాంతమ్మకు పైసల సాయం రాకున్నా మాటసాయం అందింది. భీక్య జమానతుతో అప్పులోల్లు మానవత్వం చూపింండ్రు. మిత్తీ వద్దన్నరు. శాంతమ్మ పట్నం పోయి కంపెన్ల పనికి కుదిరింది. చెమట దార పోసి పిల్లల సదివించింది. రాజ్యంను లాయరు చదివించింది. చిన్నది జర్నలిజం చదివింది. అమ్మ కష్టం చూసి పిల్లలు పెరిగింండ్రు. శాంతమ్మ కష్టం పిల్లల భవిష్యత్తుకు అక్కరకొచ్చింది. బువ్వ బయటపడ్డది. అమ్మను కష్టం మర్సిపోయేటట్టు చూసుకుంటుండ్రు. శాంతమ్మ పిల్లలకు జరిగిందంతా చెప్పి, “ అమ్మా! మీ చదువు భీక్యకు, మన ఊరోల్ల తావు నిలపడానికి

ఉపయోగించండి” అన్నది.

***

జర్నలిజం చదువుకున్న లక్ష్మి పెద్ద వార్తాఛానల్లో పనిజేస్తుంది. అప్పటికే ఆ ఛానల్‌లో స్టింగ్ ఆపరేషన్ల ద్వారా లక్ష్మికి మంచిపేరుంది. స్థానిక ఎమెల్యే రాజి రెడ్డిపై స్టింగ్ ఆపరేషన్ ప్రారంభించింది. చట్టానికి కావాల్సిన సాక్ష్యాలు సేకరించింది. ఎమెల్యే అక్రమాలన్నీ పత్రికలో బయటపెట్టింది. ఆ వార్తలను కబ్జా దారులు లెక్క జేయలేదు. అధికార పార్టీ ఎమెల్యే కావడంతో పార్టీ సహకారం తీసుకుండు. వాళ్ళు కూడా “తేలు కుట్టిన దొంగలాగ” బయటపడలేదు. పైగా ఆ భూమి ప్రభుత్వం భూమని పత్రికల్లో తప్పుడు ప్రకటనలు ఇప్పించింద్రు.

మరోవైపు రాజ్యం నల్లకోటు తండా వాసులకు ధైర్యం కల్పించింది. వారితో కేసు రిజిస్టరు చేయించింది. అటు వైపు పెద్ద పెద్ద లాయర్లు రంగంలోకి దిగారు. కోర్టు హాలులో వాదనలు జరుగుతున్నై. అది సర్కారు భూమి అని అడ్డంగా వాదించారు. తరువాత రాత్రికి రాత్రే వాళ్ళు అక్కడ ఇల్లు కట్టారని అధికారులు అబద్ధం చెప్పారు.

రాజ్యం కోర్టుహాలులో విశ్వరూపం చూపింది. “యువరానర్ ! అధికారుల నిర్లక్ష్యం, ప్రజా ప్రతినిధుల అధికార దుర్వినియోగం, భూదాహం ఫలితంగా ముప్పై నాలుగు కుటుంబాలు అనాధలయ్యాయి. ఉండ తావు కోల్పోయినై. ఆ కుటుంబాలు రెండు తరాలుగా గ్రామ పంచాయితీకి కట్టిన ఇంటిపన్ను, భూమిశిస్తు పన్ను రసీదులను పరిశీలించాలని” కోరింది. “కాయ చిన్నదైనంత మాత్రాన కారం తక్కువవుతుందా?” ధర్మం గెలిచింది. ధర్మ దేవత మూడో కన్ను తెరిచింది. “ఎమెల్యేను కటకటాల లోపలికి నెట్టి, సంబంధమున్న అధికారులను తక్షణమే ఉద్యోగాలనుండి తొలగించి, క్రిమినల్ చర్యలు తీసుకోవాలని” ఆదేశించింది. తరువాత గ్రామస్తులకు జరిగిన నష్టాన్ని కట్టియ్యమని ప్రభుత్వాన్ని ఆదేశించింది. కూలగొట్టిన ఇండ్ల మట్టినెత్తి నీళ్ళులేని మోటబాయిని పూడ్చిపెట్టారు.

******

**– నవ తెలంగాణ, సోపతి, 24 ఏప్రిల్, 2022**

## 7. కుర్చీ

అదొక మానసిక వైద్యశాల. అక్కడ పనిజేసే డాక్టర్ పేరు మోసిన వాడని దేశమంతా చెప్పుకుంటుంటే విని అక్కడికెళ్ళాడు సుందర్రావ్. రిసెప్షన్‌లో చెప్పిన ఫీజు విని మూర్ఛ బోయాడు. కాసేపటికి తేరుకొని, చేసేదేం లేక డబ్బు చెల్లించి పేరు రాయించు కొన్నాడు. డాక్టర్ కోసం ఎదురు జూస్తూ అక్కడున్న తెల్లని సోఫాలో నీరసంగా కూల బడ్డాడు సుందర్రావ్. సముద్రంలో సునామీ వచ్చినప్పుడు ఆకాశాన్ని తాకే అలలు లేచినట్టు, సుందర్రావ్ తలలో ఆలోచనలు ఉవ్వెత్తున ఎగిసి పడుతున్నాయి. 'దానానికి దొరికింది దారిలో పోతుందేమో?' ఆ ఆలోచనకు బుర్ర వేడెక్కిపోతుంది.

ఆ హాలులో ఎక్కువ వెలుతురూ లేదు. అలాగని చీకటి లేదు. సెంట్రల్ ఏసి శ్రామికునివలె నిర్విరామంగా అలసట లేకుండా పనిజేస్తుంది. అది కాలిపోతూ గది కడుపును చల్లబరుస్తుంది. గది గోడలు సీతాకోక చిలుకలా రంగు లీనుతూ ఉన్నాయి. వాటిపై అందమైన పెయింటింగ్స్ వేశారు. ఎదురుగా నున్న గోడపై బుద్ధుడు శాంతిని ప్రభోదిస్తూ, ధ్యాన ముద్రలో ఉన్నాడు. అటు పక్కకు భౌద్ధ ధర్మ పాలకుడు అశోకుడు, ఇంకోపక్క ఆర్య భట్ట చిత్రాలతో బాటు మరో వైపు ప్రపంచ మేథావి డాక్టర్ బాబా సాహెబ్ అంబేద్కర్‌ల  చిత్ర పటాలున్నాయి. చూడడానికది హాస్పిటల్‌లా లేదు. ఫైవ్ స్టార్ హొటల్‌లా ఉంది. అక్కడి సిబ్బంది సాధారణ మనుషుల్లా లేరు. బాగా తర్ఫీదు పొంది, వచ్చిన వారితో జాగ్రత్తగా వ్యవహరిస్తున్నారు. కాసేపటికి డాక్టరు గది బయటనున్న బజరు మోగింది. అక్కడి లైటుతో బాటు సుందర్రావ్ మొఖంలో వెలుగొచ్చింది. డాక్టరు వచ్చినట్టున్నాడు అనుకున్నాడు సుందర్రావ్.

"మిస్టర్ సుందర్రావ్... ప్లీజ్ గెట్ ఇన్" అంటూ డోర్ వద్ద రిసెప్షనిస్ట్ నవ్వుతూ పిలిచింది. సోఫాను అదిమి పట్టి పైకి లేచి, నిటారుగా నిలబడ్డాడు సుందర్రావ్. గంజి పెట్టి ఇస్త్రీ చేసినా ముడతలుపడ్డ తెల్లని చొక్కాను ఓసారి చూసుకొని, దానిని కిందికి లాగి సరి చేసుకున్నాడు. తలపై అరకొరగా నున్న జుట్టును, దాంతో బాటు బుర్రలో నున్న సందేహాలను అరచేతితో అదిమిపెట్టాడు. తన పరిస్థితి గుర్తుకువచ్చింది. భుజాలేలాడేసుకుంటూ డోర్ దగ్గరికి నడిచాడు.

ఆమె నవ్వుతూ డోర్ తీసింది. గదిలోకి వెళ్ళాడు సుందర్రావ్. అది కూడా బయట హాలులాగే చాలా అందంగా డెకరేట్ చేయబడింది. డాక్టర్ నవ్వుతూ కూర్చోమని కుర్చీ చూపాడు. చిన్నప్పటి నుండి సుందర్రావ్ కు కుర్చీ అంటే ప్రాణం. రెండో తరగతిలో ఉన్నప్పుడు కుర్చీలాటలో ఓసారి ఓడి పోయాడు. ఓటమికి కారణమయిన ఆ కుర్చీని ఎప్పుడూ వదల కూడదనుకున్నాడు. అప్పటి నుండి దానిపై మమకారం ఏర్పరుచుకున్నాడు. కుర్చీపై కూర్చొని డాక్టరు చూడకుండా, దానిని తనివితీరా అర చేతులతో తడిమి చూసుకున్నాడు. తృప్తిగా అనిపించింది. సుందర్రావ్ కూర్చున్నాక డాక్టరు టేబుల్ పై ఉన్న వస్తువులను పరిశీలించాడు. దానిపై డాక్టర్ ప్రశాంత్ గుప్తా, మానసిక ఆరోగ్య నిపుణులు అని రాసిపెట్టి ఉంది. ఇంకా ఆయన చదివిన డిగ్రీలు, ప్రముఖులతో దిగిన ఫోటోలు గోడలపై వేలాడుతూ కనిపించాయి. సుందర్రావ్ లో నమ్మకం పెట్రోలు ధరలా బాగా పెరిగింది.

“మిస్టర్ సుందర్రావ్. చెప్పండి ఏమిటి మీ సమస్య?” అడిగాడు డాక్టర్ ప్రశాంత్ గుప్తా

“డాక్టర్ గారు నేనొక కుర్చీల వ్యాపారస్తుడను. కొంతకాలంగా నాకు నిద్ర దూరమైంది. ఆకలి లేదు. తమరు బాగా తెలివైన వారు, పేరున్న డాక్టరని నలుగురు చెప్పగా తెలుసుకొని వచ్చాను. దయచేసి నా సమస్యకు పరిష్కారం చెప్పండి”

“మీరు దేని గురించైనా ఎక్కువగా ఆలోచిస్తారా?”

“అవును డాక్టర్. నేను కుర్చీల కంపెనీలో పనిజేస్తాను. కాబట్టి నేను ఎక్కువగా కుర్చీల గురించే ఆలోచిస్తాను”

“విచిత్రంగా ఉందే. కుర్చీ గురించి అంతగా ఆలోచించడమేంటి? అర్థం కాలేదు. మీ సమస్యను ఇంకాస్త వివరంగా చెప్పండి?”

“చాలా సంవత్సరాల క్రితం ఉద్యోగం కోసం నేనొక కుర్చీల కంపెనీకి వెళ్లాను. అక్కడొక పెద్ద కుర్చీలో పెద్దాయన ఒకరు కూర్చొని ఉన్నాడు. ఆ కుర్చీ చాలా బాగుంటుంది. ఆయన ‘ఎందుకొచ్చావని?’ నన్ను అడిగాడు. ‘ఉద్యోగం కోసం వచ్చానని’ చెప్పాను. చిరునవ్వుతో నాకు చేతితో సైగజేసి, దగ్గరికి పిలిచాడు. నువ్వు ఈ ఉద్యోగం చేయాలంటే ఈ కుర్చీని బాగా ప్రేమించాలని చెప్పాడు. ఆ మాట నచ్చింది” అని సుందర్రావ్ కిందికి చూస్తూ ఆగిపోయాడు.

"తరువాత ఏం జరిగింది?!"

"తరువాత ఆ పెద్దాయన నాకు ఉద్యోగం ఇచ్చి, నాకొక కుర్చీ ఇచ్చాడు. దానితో అంతకుముందు లభించనంత గౌరవం, పేరు ఆ కుర్చీతో లభించింది. దాంతో నాకు కుర్చీ మీద గురి కుదిరింది. తరువాత ఆయన చెప్పినదానికంటే ఎక్కువగా నేనా పెద్ద కుర్చీని ప్రేమించాను డాక్టర్."

"ఇంతకూ సమస్య ఏమిటి?"

"ఆ కంపెనీకి పెద్దాయన తరువాత ఆయన వారసుడు వోనర్గా వచ్చాడు. అతడు పెద్దకుర్చీపై కూర్చొని దర్జా చూపించడం నాకు నచ్చలేదు. పైగా ఆ పెద్ద కుర్చీ చూసినపుడల్లా నాదే అనిపించేది. ఆ సంగతే ఓసారి కొత్త వోనర్ కు చెబితే అది పెద్ద కుర్చీ. దానిపై నీలాగే చాలామంది ఆశపడ్డారు. చివరికి అడ్రస్ లేకుండా గల్లంతయ్యారు. అనవసరంగా నువ్వు ఆశపడకని సలహా ఇచ్చాడు. దాంతో నాకు నిద్రాహారాలు దూరమయ్యాయి డాక్టర్"

"ఓహో.. ! అదీ.. నీ సమస్యనా..?"

"ఛ..ఛ..అది కాదు డాక్టర్. నేను చాలా పట్టుదల కలిగిన మనిషిని. 'నమిలే వాడి కంటే మింగేవాడు ఘనుడు' అన్నట్టు పెద్ద కుర్చీ ఎవరి సొంతం కాదండీ. వారసత్వం అసలే కాదు. ఆ విషయమే అతనికి చెప్పి, చివరికి అతనినే గల్లంతు చేశాను. తరువాత ఆ పెద్దకుర్చీని కష్టపడి సాధించుకున్నాను"

"భలే అసాధ్యుడివయ్యా నువ్వు! ఇదంతా ఎలా జరిగింది?"

కంపెనీ వర్కర్స్ చానాళ్లుగా పెద్ద కుర్చీ దక్కలేదని బాధతో ఉన్నారు. "రాజకీయం రాచరికంగా మారింది. కొత్త వోనరు పెద్ద కుర్చీపై కూచునే హక్కు లేదు అని, మనందరికీ పెద్ద కుర్చీపై సమాన హక్కు, భాగస్వామ్యం ఉందని వర్కర్స్కు చెప్పాను. దాంతో వరదలొచ్చినపుడు కట్ట తెగినట్టు, వాళ్ళలో ఆవేశం వరదలా పొంగింది. పెద్దకుర్చీని వదిలిపెడతానని కొత్త వోనరు చెప్పాడు. కంపెనీ రెండుగా చీలింది. తరువాత కంపెనీ ఎలా నడపాలోనని వర్కర్స్ భయపడ్డారు. మీకు నేనున్నానని ధైర్యం చెప్పాను. నా చేతుల్లో బెడితే, అభివృద్ధి చేసి చూపెడతానని వాగ్దానం చేశాను. నమ్మారు"

"అంత సులువుగా ఎలా నమ్మారు? అయినా అది మోసం కాదా?"

‘బొమ్మకు మొక్కినా, నమ్మకముండాలె’ అని చెప్పాను. నమ్మారు. రెండు చేతులు కలిస్తేనే చప్పట్లు. మోసమెలా అవుతుంది డాక్టర్?”

“అయితే నువ్వు కుప్ప తగలబెట్టి పేలాలు ఏరుకున్నావన్నట్టు! అయినా నువ్వు భలే మాటకారివి సుమా!”

“ఆ సంగతి ప్రపంచమంతా తెలుసు డాక్టర్”

“అయినా అది వాళ్ళ నమ్మకం కాదయ్యా. సుదీర్ఘకాలపు స్వప్నం కదా?”

“అవునండి. అయినా నిద్రలో, కలలో ఉన్నవారికి, వాస్తవంలో న్యాయమెలా చేస్తామండీ?

“ఇదన్యాయం! ‘నాలుకలో నారాయణ, చంకలో చురకత్తి’ అనేలా ఉన్నావే?”

“ఏదీ అన్యాయం కాదండీ. అది పెద్ద కుర్చీపైకి వెళ్ళాలంటే అవన్నీ తప్పదు”

“సరే, తరువాత ఏమైందో వివరంగా చెప్పు”

“తరువాత కంపెనీ రెండుగా చీలిపోయింది. కంపెనీ గొడవల్లో చాలామంది వర్కర్లు చనిపోయారు. కొత్త కంపెనీ ఏర్పాటయింది. పెద్ద కుర్చీపై ఎవరు కూర్చోవాలనే ప్రశ్న వచ్చింది. మీదే నిర్ణయం అన్నారు వర్కర్స్. ముందు కుర్చీలు తయారుచేయండి. తరువాత పెద్దకుర్చీ సంగతి చూద్దామని చెప్పాను. కుర్చీలు, పెద్ద కుర్చీ తయారయినై. పెద్ద కుర్చీపై మీ అందరి బాగుకోసం నేనే కూర్చుంటానని చెప్పాను.”

“ఎవరూ అభ్యంతరం చెప్పలేదా?”

“అప్పటిదాక పెద్ద కుర్చీపై ఆశపడ్డ కార్మికులు మింగలేక, కక్కలేక నాతోనే ఉన్నారు. ఇప్పుడు హాయిగా కుర్చీలమ్ముతున్నాను. కొంటున్నాను. వ్యాపారం చాలా బాగుంది.”

“అదేంటి. నిజానికి కష్టపడింది వారే కదా?”

“కష్టపడ్డ వాళ్ళే బాగుపడాలంటే రైతుల కంటే దళారులు ఎలా లాభ పడతారు? ఇదీ అంతే!”

“ఇంకేం మరి ! అంతా బాగుంది కదా?”

“లేదు డాక్టర్. ఇప్పుడు ఆ పెద్ద కుర్చీపైన నా ప్రత్యర్థులతో బాటు, నా వారసుల కన్నుబడింది”

“ఆ కుర్చీ దక్కాల్సింది ఆ కంపెనీలో పనిజేసినవారికి కదా? మరి నీ వారసులకు

ఎలా దక్కుతుంది?"

"అవును డాక్టర్. కానీ వారికి చెప్పేదెవరు? తండ్రిని జైలులోకి నెట్టి కుర్చీ లాక్కున్న చరిత్ర మనది. తండ్రి శవాన్ని పెట్టుకొని అధికారం కోసం రాజకీయం చేసే నాయకులున్న రోజులు ఇవి"

"ఛ...ఎందుకయ్యా! ప్రతి దానికి నాయకులమీద పడ్తరు?"

"నాయకులకున్న క్రేజ్ ఎవరికీ లేదు డాక్టర్. నా విషయంలో హీరోలు, జీరోలు వాళ్ళే"

"సరే కానీ అసలు సంగతి చెప్పు. విలేఖరుల సమావేశంలో సంబంధం లేకుండా సమాధానాలు చెప్పినట్టు కాకుండా..సమస్య ఏమిటో సరిగ్గా, నేరుగా చెప్పు"

"సరే డాక్టర్. ఇప్పుడే నా కుర్చీని ఎవరికీ ఇచ్చే ఉద్దేశ్యం నాకు లేదు"

"ఓహో ..! ఇదీ.. నీ అసలు సమస్య కావొచ్చు!"

"కాదు డాక్టర్"

"ఇంతకూ.. నీ అసలు సమస్య ఏమిటయ్యా మరి?"

"డాక్టర్ల దగ్గర, లాయర్ల దగ్గర నిజం చెప్పమంటారు డాక్టర్. అందుకే నా సమస్య వెనుకగల నిజాలను మీకు చెబుతున్నా"

"సరే చెప్పు...' డాక్టర్ మొఖంలో కొంత చిరాకు కనబడింది. దానిని చూసి సుందర్రావ్ ముఖంలో ఆందోళన మొదలై ఆగిపోయాడు.

"నీ పెద్ద కుర్చీకి వచ్చిన ముప్పేమిటి మరి? అది చెప్పు ముందు. అయినా పెద్ద కుర్చీ వారసులకు చెందదు. కంపెనీ వర్కర్స్ దేనని వారితో గట్టిగా చెప్పలేకపోయావా?"

"నా వారసులకు ఇప్పుడే ఇచ్చే ఉద్దేశ్యం లేదన్నాను. కానీ ఆ పెద్దకుర్చీ నా తరువాత వారికే చెందాలి డాక్టర్!"

"చెప్పేవి నీతులు, తీసేవి గోతులు" నిట్టూర్చాడు డాక్టర్

"ఎందుకు డాక్టర్ అలా అన్నారు?"

"లేకపోతే ఏంటయ్యా? నువ్వు ఒకప్పుడు అదే కంపెనీలో పెద్ద కుర్చీ అనేది వర్కర్స్ కే దక్కాలని కొట్లాడావు కదా? ఇప్పుడేమో నీ వారసులకు చెందాలని అంటున్నావు. న్యాయమా?"

"అవును డాక్టర్. అయినా నన్ను అడిగేదెవరు?"
"ఒకప్పుడు అడగడానికి నువ్వు రాలేదా?"
"మీరన్నట్టు అడగడానికి ఒకడొచ్చాడు డాక్టర్. నీకు కుర్చీ ఇచ్చేది లేదని అతని కుర్చీని లాక్కొని కంపెనీ నుండి బయటకెళ్ళగొట్టాను. ఆ కంపెనీకి పేరు పెట్టింది నేను. పూర్తి హక్కులు నాకే ఉంటాయి. కంపెని నాది. పెద్ద కుర్చీ హక్కు నా వారసులకే దక్కుతుంది అని చెప్పాను"
"పేరుపెట్టినంత మాత్రాన బిడ్డ, మంత్రసానిదెలా అవుతుంది? నాకర్థం కాలేదు"
"మీరు కూడా అలాగే అంటారేం డాక్టర్. అయినా కంపెనీ నడిపించడం అంటే మాటలు కాదు. పెద్ద పెద్ద వాళ్ళే గల్లంతయ్యారు. వర్కర్స్ మంచి కోసమే అలా చెబుతున్నాను"
"ఏమంత కష్టం ఉంది అందులో?"
"డాక్టర్ మీకు అందులో లోతు తెలియక మాట్లాడుతున్నారు?" సుందర్రావ్ మాటకు డాక్టర్ మోహంలో రంగులు మారాయి.
"కంపెనీని అభివృద్ధి చేసి బంగారంలా మారుద్దామనుకున్నాను. డబ్బులకోసం కంపెనీ భూములమ్మాను. దొరికిన ప్రతిచోటా కంపెనీ పేరు చెప్పి, అప్పులు తీసుకొచ్చాను. అవన్నీ ఇప్పుడు గుదిబండలా బరువయ్యాయి. ఇంకోవైపు పెద్ద కుర్చీ కోసం ప్రత్యర్థులు, వారసులు తిరుగుబాటు చేస్తున్నారు. ఇప్పుడు నాకు ఇంటా, బయట తలనొప్పులే. నిద్రలేదు ఆకలి లేదు."
"ఆ కుర్చీపై అంత పిచ్చి ఎందుకండీ? వదిలేయొచ్చు కదా!"
"ప్రాణమయినా వదిలేస్తా. కానీ... ఆ పెద్ద కుర్చీని వదిలేయడం నావల్ల కాదు డాక్టర్. అది నా గౌరవం. అయినా మీకు తెలియదులే.." సుందర్రావ్ మాటకు డాక్టర్లో ఉన్న ఈగో నిద్రలేచి ఆవులించింది.
"నీ కుర్చీ నీ చేతిలోనే ఉంది కదా. దక్కుతుందా గౌరవం?"
"లేదు డాక్టర్. అందుకే మీ వద్దకు వచ్చాను. ఫీజు ఎంతైనా సరే. చెల్లిస్తాను. ఇంటా బయట సమస్యలనుండి గట్టెక్కించండి. మీరు డిల్లీ నుండి గల్లీ దాక కుర్చీ సమస్యలను ఇట్టే తీర్చారట. విన్నాను."
"సరే అయితే దీనికో పరిష్కారం ఉంది. ముందుగా కంపెనీలో వర్కర్స్ కోరికలు

తీర్చండి"

"ఎవరి కోరికలు వారే తీర్చుకోడానికి ఉండదు. అలాంటప్పుడు నేను అంతమంది కోరికలెలా తీర్చగలను డాక్టర్"

"వాళ్ళ కోరికలు తీర్చాల్సిన అవసరం లేదు. తీరుస్తాననను. కొత్త కోరికలను కలగజేయి. దాంతో వారు పాతవి మర్చిపోతారు. నీ పెద్ద కుర్చీకి డోకా ఉండదు"

"మరి ఇంట్లో..?"

"నీ పక్కన మరో పెద్ద కుర్చీ వేయి. అది సాధించుకున్న వాళ్ళకే నీ కుర్చీ అని చెప్పు. వాళ్ళంతా దానికోసం పోటీబడుతారు. వారు ఇక నీ జోలికిరారు"

"మరి ప్రత్యర్థులు?"

"వాళ్ళేం మాట్లాడినా పట్టించుకోకు. అరిచి అరిచి వాళ్ళే పోతారు"

"మీరు గ్రేట్ డాక్టర్. నా సమస్య తీరింది. అందుకే మీకు దేశమంతా అంత గొప్ప పేరుంది. చివరగా నాదో సందేహం. ఇంత తెలివైన మీరే పెద్ద కుర్చీ కోసం ప్రయత్నించొచ్చు కదా?"

'నీలాంటి వాల్లుంటే ఒక్క పెద్ద కుర్చీ ఏంటి? అంతకంటే చాలా పెద్ద కుర్చే నా సొంతమవుతుంది' అని డాక్టర్ మనసులో అనుకున్నాడు. ఇక మీరెళ్ళవచ్చు అని చెప్పి బజర్ మీద చెయ్యేశాడు.

సుందర్రావ్ భుజాలు నిటారుగా మారాయి. కొత్త ఉత్సాహంతో నిలబడ్డాడు. ఫీజు ఎక్కువైనా పర్లేదు మంచి పరిష్కారం చెప్పాడని అనుకుంటూ డాక్టరుకు నమస్కారం చేస్తూ, బయటకి నడిచాడు. కడుపులో ఆకలి, కంటిపైన నిద్ర ముంచుకొస్తుంది. సుందర్రావు బయటకి నడుస్తుంటే తలుపువద్ద భుజం రాసుకుంటూ మరో వ్యక్తిలోనికి ప్రవేశించాడు. అతన్ని చూసిన సుందర్రావ్ మొఖంలో నెత్తురు చుక్కలేదు. తనపై పెద్ద కుర్చీ కోసం పోటీబడే ప్రత్యర్థి అతను.

"మోసం. దగా! ఛ..అనవసరంగా అంత ఫీజునిచ్చి మరీ..ఈ డాక్టరుకు నిజాలన్నీ చెప్పాను." అని గొనుగుకుంటూ కారు దగ్గరికి నడిచాడు. పార్కింగులో సుందర్రావ్ రాకను గమనించని వాచ్ మన్  ఫోనులో ఎవరితోనో మాట్లాడుతున్నాడు.

******

**– వెలుగు, 12 జూన్, 2022**

# 8. అద్దం

ఇవ్వాళ నా పదవీ విరమణ. పోలీసుశాఖలో ఉద్యోగం. అలవాటు కొద్దీ త్వరగా నిద్రలేశాను. నాలుగింటికే వచ్చే పేపరు బాయ్ ఇంకా రాలేదు. సీనియర్లు రిటైరైయినప్పుడు మా ఆఫీసులో పెద్ద అట్టహాసమే జరుగుతుంది. ఆలోచిస్తూ నోట్లో బ్రష్ వేసుకొని స్నానానికి బాత్రుంలోకి నడిచాను. యాథాలాపంగా చిన్నలైట్‌కు బదులుగా పెద్దలైట్ వేశాను. అద్దంలో నెరిసిన జుట్టు వెండిలా తెల్లగా మెరుస్తుంది. రిటైర్మెంట్ ఆలోచనల్లోనున్న నాకు, హఠాత్తుగా ఒకవిషయం గుర్తుకొచ్చింది. అదే ...నాకు అద్దమంటే భయం. నచ్చదు. విచిత్రంగా ఉంది. భయం పోయిందా ? నిజమా ! కలా? గిల్లి చూసుకున్నాను. బయట పేపర్ బాయ్. "పేపర్..." అరుపు వినబడింది. "నిజమే ! అద్దమంటే నాకున్న అయిష్టం, భయం ఇప్పటిది కాదు. నాన్న దూరమైనప్పటిది. చానాళ్లకు అద్దాన్ని ధైర్యంగా చూస్తున్నా.

అద్దం మసకగా కన్పిస్తుంది. నిజంగా మసకబారిందా లేక నా కంటిచూపు మసకబారిందో తెలియరాలేదు. ఎన్నాళ్ళయిందో అద్దాన్ని ఇంత ధైర్యంగా చూసి. అద్దంలో మరకలున్నాయేమోనని టవల్ బెట్టి తుడిచాను. అయినా పోలేదు. నా మనసుపై పడిన మరకలు. రవి గుర్తుకొచ్చాడు. అంతే. నాన్న గుర్తుకొచ్చినపుడల్లా రవి గుర్తుకొస్తాడు. అద్దంలాగే వాళ్ళు నిజానికి ప్రతిబింబాలు. వాళ్ళ జ్ఞాపకాలు నా మనసు మీద బలంగా నాటుకుపోయిన అద్దానికి సాక్ష్యాలు. వాళ్ళు గుర్తుకు రాగానే నా ముఖం వివర్ణమైంది. వికృతంగా మారుతుంది. ఇంతకు ముందయితే ఇలాంటప్పుడు అద్దం పగలగ్గొట్టాలనే కోరిక బలంగా ఉండేది. "ముఖం బాగాలేక అద్దం పగల కొట్టుకున్నట్టు" సామెత గుర్తుకొచ్చింది. వైరాగ్యం ఆవహించింది. "అద్దంలో నిజమే కన్పిస్తుందంటారు". ఇది నా ముఖం కాదు. నా ముఖం ఎక్కడ? అద్దాన్నిమనసు ప్రశ్నిస్తుంది. ఎంత అహంకారం. జవాబివ్వదు. నాకెప్పుడూ అద్దం అందంగా కనపడదు. అలాంటప్పుడు ఈ అద్దాన్ని ఎందుకు చూడాలి? నాన్న, రవి ఆలోచనలతో మనసు గజి బిజిగ మారింది. ఆలోచనల్లో మసకగా నున్న అద్దం కాస్త మాయమైంది.

***

ముప్పై సంవత్సరాలుగా ఉద్యోగ జీవితంలో పోలీసు యూనిఫారం తప్పనిసరైంది. ఆఫీసరు హోదా, దర్జా ఎప్పుడూ నా వెంటే ఉండేవి. వాటికోసం నేను అద్దం ముందు నిలబడక తప్పేది కాదు. నిలబడ్డప్పుడు ప్రపంచం చూసే ముఖం అందంగా కన్పించేది. కాసేపట్లో గతం గుర్తుకొచ్చి అద్దంలో రంగులు మారేవి. అద్దానికి జీవగుణం ఉందనిపించేది. ఊసరవెల్లిలా దానికిన్ని రంగులు ఎలా అబ్బాయో? ఎంత ఆలోచించినా అర్థం కాదు. "అద్దం అబద్దం చెప్పదు" అంటారు కదా. మరి నాకెందుకు అబద్ధం చెబుతుంది. నా నిజరూపాన్ని ఎందుకు చూపడం లేదు? చాలాసార్లు నిలదీశా! లక్ష్యపెట్టలేదు. దానిపని దానిది, నా పని నాదే అయింది. కాలం వేగంగా గడిచిపోయింది. సర్వీసు మొత్తం ఆ జ్ఞాపకాలను మోయలేక, వర్తమానాన్ని భరించలేక అయిందనిపించాను.

***

బొడ్డుతాడు ఊడిపడక ముందే బస్టాండులో వదిలేసిన రవిని పుణ్యాత్ములెవరో అనాధాశ్రమంలో చేర్చారు. నిర్వాహకుల ఆహ్వానం మేరకు గాంధీ జయంతికి ఒకసారక్కడికి వెళ్లాను. అక్కడ నూటా యాభై మందికి పైగా పిల్లలున్నారు. అంతా పద్ధతిగా కింద కూర్చున్నారు. ముందు వరుసలో అత్యంత ఆకర్షణతో చురుగ్గానున్న ఆ పిల్లవాడు నన్ను ఆకర్షించాడు. గల్లా చొక్క, పొట్టి నిక్కరు. చందమామవంటి మోము. పెద్ద కళ్ళు. నల్లటి ఉంగరాల జుత్తు. చక్కని కంఠం. దర్జా ఉట్టిపడేలా రూపురేఖలు. అతనే రవి. వేదికమీదనున్న ఇతరపెద్దలు రవిపై దృష్టి కేంద్రీకరించడం గమనించాను. ప్రసంగాలు త్వరగానే పూర్తయ్యాయి. బహుమతి ప్రధానోత్సవం ప్రారంభమైంది. అన్ని విభాగాలలో రవినే మొదటి బహుమతి విజేత. కార్యక్రమం చివరలో రవి తన కీబోర్డును స్వయంగా తానే వాయిస్తూ అమ్మానాన్నపై అద్భుతంగా పాడాడు. రవి టాలెంట్ చూసి నాతోబాటు అక్కడందరూ ముచ్చట పడ్డారు. అప్పటికే అతిథులంతా తమకు తోచిన సాయం ప్రకటించారు. నేను మాత్రం బయట పడలేదు. నా మనసు నన్నుప్రశ్నిస్తుంది. దాని గొంతును నా అధికారంతో నొక్కేశాను. వెళ్తూ రవిని దగ్గరికి పిలిచి "ఏం చదువుతున్నావ"ని అడిగాను. "పదోతరగతి సార్" చేతులు కట్టుకుని ఎంత వినయంగా చెప్పాడు. జీపునెక్కి స్టేషనుకు బయల్దేరాను. ఆశ్రమం వదిలినా మనసులో

రవి టాలెంట్ చెదిరిపోలేదు.

***

డ్యూటీ ముగించుకొని ఇంటికి చేరుకున్నాను. “అంత టాలెంట్ నా పిల్లలలో లేదాయే”. రవి మీద అసూయ కలిగింది. రవి ఆలోచనలతో అప్రయత్నంగా ఇంట్లోనున్న అద్దంలో నా మొఖాన్ని చూశాను. అద్దం బుద్ది చూపింది. అసహ్యంగా కన్పించింది. “అద్దాన్ని తుడవమని” శ్రీమతికి చెప్పాను. ఈ అద్దం నాకు నచ్చ లేదు. అద్దం మార్చమని చెప్పాను. “పడుకునేటప్పుడు ఆలోచించాను. కొంప దీసి అద్దం నన్ను పగ బట్టిందా? ఆ ఊహకే నాకు నవ్వొచ్చింది. అద్దం నాకు శత్రువా? మిత్రువా?. అద్దాన్ని చిన్నప్పుడు నా మిత్రునిలా భావించాను. రహస్యాలు చెప్పుకున్నాను. నా బాధలు, ఆనందాలను పంచుకున్నాను. నా మాటలన్నీ అద్దానికే ముందు విన్పించే వాడిని. ఈ అద్దానికి విశ్వాసం లేదు. దాని బుద్ది వక్రబుద్ది. స్వార్థ బుద్ది. అద్దం అబద్దం. అద్దంతో నాకు ఏ బంధుత్వం లేదనిపించింది. అప్పుడప్పుడూ చూసే అద్దాన్ని ఇకపై మొత్తానికే చూడొద్దని తీర్మానించుకున్నాను. హాయిగా నిద్రబట్టింది.

***

కరెంటు పోయొచ్చింది. దాంతో రవి ఆలోచనల నుండి బయటకొచ్చాను. ఎందుకో అద్దం ఈరోజు బాత్రూంలో గురువులా కన్పిస్తుంది. ఏదో చెప్పాలని సిద్దమైనట్టుంది. ఉద్యోగంలో చేరిన రోజు సినిమా రీలులా జ్ఞాపకానికి వచ్చింది. ఉద్యోగం సాధించడానికి ఎంత శ్రమ పడ్డాను. ఉద్యోగంలో చేరిన మొదటిరోజు అమ్మ ఎంతో సంతోషించింది. నాన్న గుర్తుకొచ్చాడు. నా భావాన్ని అర్థం చేసుకున్నఅద్దం కన్నీరు కారుస్తుంది. “కొంపదీసి అద్దానిది మొసలి కన్నీరు కాదు కదా? పోలీసోడిని. నీడను సైతం నమ్మరాదని ఉద్యోగశిక్షణలో ఉగ్గుపాలతో రంగరించి చెబుతారు. అద్దంపై జాలి కలిగింది. ఆర్తితో దాని కన్నీళ్లు తుడిచాను. అద్దం తేటగయ్యింది. ఇప్పుడు ముఖం తేటగా కనపడుతుంది. అద్దానికి కూడా హృదయం ఉన్నట్టుంది. ఆలోచనలు నా మదిని నింపినట్టే, వదిలిన ట్యాప్ బకెట్ ను నింపింది. నీళ్ళచప్పుడుకు ఈలోకంలోకి వచ్చాను.

నీళ్ళు మగ్గులో తీసుకొని వంటిపై పోసుకున్నాను. కమ్మని మట్టి పరిమళం.

ఆశ్చర్యపోయాను. కాంక్రీటు జంగిలులో మట్టివాసన ఎక్కడినుండి వస్తుందని చుట్టూ వెదికాను. అది నా శరీరం నుండేనని కాసేపటికి తెలిసింది. తృప్తిగా పీల్చాను. మట్టివాసనతో ఆలోచనలు ఊరికి పరిగెత్తాయి.

***

నాది నకిరేకల్ దగ్గర ఒగోడు. మొదట పోలీసుశాఖలో నేను ఎస్.ఐగా జాయిన్ అయ్యాను. అంచెలంచెలుగా డి.ఎస్పి స్థాయి వరకు పదోన్నతి పొందాను. మాది సాధారణ రైతు కుటుంబం. తెలంగాణ సాయుధపోరాటంలో పాల్గొన్న తాత అమర వీరుడు. నికార్సయిన నిజాం విముక్తి పోరాటానికి గెరిల్లా దళాన్ని చాక చక్యంగా నడిపిన తాత గురించి కథలు కథలుగా చెప్పుకుంటారు. చూడటానికి తాత, నాన్న అన్నదమ్ముల వలె ఉండేవారట. తాత రూపుకు, భావాలకు నాన్న అద్దంలో ప్రతి బింబంలా ఉండేవాడు. తాత అభ్యుదయ భావాలను నాన్న జీవితాంతం వరకు మోశారు.

ఆరోజుల్లో నాన్న ఉర్దూ మీడియంలో నాలుగు చదువుకున్నాడు. మంచి వక్త. చైతన్యం కలిగిన వాడు మాత్రమే కాదు. నిప్పు రవ్వలా చైతన్య కాగడాలను వెలిగించే మనిషి. దాంతో ఉన్నోల్లకు శత్రువయ్యాడు. లేనోల్లకు బంధువయ్యాడు. "దున్నేవానిదే భూమి". ఈమాట నాన్న నోటి నుండి ప్రతిరోజూ పాఠంలా వినే వాన్ని. అలాగని నాన్న హింసావాది కాదు. గాంధీని చాలా ఇష్టపడేవాడు. దేశానికి "గాంధేయ కమ్యూనిజం" కావాలనేవాడు. నాన్నను కమ్యూనిస్టులు విచిత్రంగా చూసేవారు.

నాన్న భావజాలం, ఆలోచనలు నా ఆలోచన విస్తృతిని పెంచాయి. నాకు బడి ఎంతో, ఇల్లూ అంతే. రెండు చోట్లా బోధనే జరిగేది. అప్పుడు నేను ఆరోతరగతిలో ఉన్నాను. "భూమి నిలకడగా ఉండదు. ఆకర్షణతో ఎల్లప్పుడూ సూర్యుని చుట్టూ తిరుగుతుంది" అని సాంఘీకశాస్త్రం మాస్టారు చెప్పారు. ఆశ్చర్యమేసి "భూమి సూర్యుని చుట్టూ ఎందుకు తిరుగుతుంది నాన్న?" అని అడిగాను. నాన్న మాత్రం "భూమి ఎల్లప్పుడూ ఉన్నోడి చుట్టూ తిరుగుతుంది" అన్నాడు. ఆ రెండు విషయాలు నా మనసులో బలంగా ముద్రించుకపోయాయి. ఒకటి శాస్త్రీయత, రెండవది అనుభవం. నాకు ఏదేమైనా భూమి మాత్రం స్థిరంగా ఉండదని అర్థమయింది.

నాకు చిన్నప్పుడు మాట్లాడడమంటే చాలా భయం. నాన్న అది గమనించి "ప్రశ్నించే వాడే ఉత్తముడు, మాట్లాడేవాడే మనిషి" అని చెప్పాడు. టౌనుకు పోయి పెద్ద నిలువుటద్దం తెచ్చాడు. ఆ అద్దం ముందు నిలబడి నన్ను మాట్లాడమని ప్రోత్సహించాడు. క్రమంగా కొంతకాలానికి నాకున్న భయం పోయింది. ధైర్యంగా మాట్లాడుతున్నాను. "మీ నాన్నలాగే మాట్లాడుతున్నావు" అనే అమ్మ పొగడ్తలు ఉత్సాహాన్నిచ్చేవి.

***

అద్దం మీద కోపం వచ్చిన ఆరోజు నా జీవితంలో మర్చిపోలేను. బడికి సెలవు. అద్దం ముందున్నాను. పంద్రాగస్టు ఉపన్యాసం కోసం సాధన చేస్తున్నాను. నాన్నకు విన్పించి మెప్పు పొందాలని ఉత్సాహంతో ఉన్నాను. చీకటిబడింది. ఇంకా నాన్న రాలేదు. పిడుగుబడ్డట్టు నాన్న చావు కబురొచ్చింది. నాన్న శవాన్ని వెతుక్కుంటూ నన్ను, దీపాన్ని తీసుకొని అమ్మ ఊరవతలి అడవికి ఒంటరిగా నడిచింది. చిమ్మచీకటి. అమ్మ వెక్కి వెక్కి ఏడుస్తుంది. ఒక్కోసారి నేల మీద కుప్పకూలిపోతుంది. చీరకొంగుతో నోట్లో కుక్కుకుని ఏడ్పును అదుముకుంటుంది. మొదటిసారి అడవిలో అంత చీకటిని చూసేసరికి భయం వేసింది. నాకు కూడా దుఃఖం పొంగుతుంది. చాలా సేపటి దాక గుడ్డి దీపానికి నాన్న చిక్కలేదు. వెదుకులాటకు కాలం తీరింది. రాళ్ళ మధ్య చలనం లేకుండా పడి ఉన్నాడు నాన్న. ఒంటినిండా తూటాల గాయాలు. నెత్తుటి మడుగులో ఒంటిపై అడవి చీమలు పట్టి ఉన్నాయి. అమ్మ ధైర్యం కన్నీరవుతుంది. మా ఇద్దరి దుఃఖం అడవి కురిపించిన నల్లటి చీకటిలో వృధాగా కలిసిపోతుంది. పొద్దు పొడిచింది. జనం జాతరలా కదిలారు. నాన్నను పొద్దు ఇష్టపడింది కాబోలు. తన వెంటే తీసుకుపోయింది. నాన్న పోయాక ఇంటికి పోలీసులొచ్చేవారు. వాళ్ళను చూసి అమ్మ గజ గజ వణికి పోయేది. తరువాత ఆ ఊరొదిలేశాం. ఇంత జరిగినా అద్దం ఏమి పట్టనట్టుగా ఉన్నట్టనిపించింది. దాంతో అద్దం మీద కోపం, పోలీసుద్యోగం మీద ఇష్టం పెరిగింది.

***

నాన్న ఆలోచనలతో స్నానం ముగించాను. బయటకు వచ్చి కాసేపు ధ్యానం చేశాను. తరువాత పేపరును పూర్తిగా చదివాను. ఈ పాతికేళ్ళు ఉద్యోగంలో ఎన్నో

తప్పులు, ఒప్పులు. చీత్కారాలు, సత్కారాలు. మారుతున్న కాలాన్ని గమనించనే లేదు. నేను కాలాన్ని నడిపాననుకున్నాను. కానీ కాలమే నన్ను నడిపిందని ఈరోజు అర్థమైంది. హడావుడిగా కాలంలో పరుగెత్తే అలవాటున్న నేను ఈ రోజు మాత్రం నింపాదిగా ఉన్నాను. కాలం కూడా నాలాగే ముసలిదై పోయిందా? ఎందుకో కాలం నెమ్మదిగానే నడుస్తుంది.

శ్రీమతి టిఫిన్ తయారుచేసి టేబుల్ మీదకు పిలిచింది. టిఫిన్ కాఫీలయ్యాక ఒక లెటరు తెచ్చి నా చేతికిచ్చింది. క్వార్టర్ ఖాళీ చేయమని దాని సారాంశం. ఇన్నాళ్ళు పోలీసుశాఖలో పనిజేసిన నాకు సొంత ఇల్లు కూడా లేదు. "నిజాయితీ నీకు నిలువ నీడ లేకుండా జేసిందిరా" మిత్రులు సరదాగా అన్నా, అద్దం చెప్పున్నంత నిజంగా తోచింది. మనసు భారంగా మారింది. డ్రైవరు వచ్చాడు. సెల్యూట్ చేశాడు. అందులో భయంకంటే గౌరవం ఎక్కువగా కనబడింది. అద్దంలో వచ్చిన మార్పు స్పష్టంగానే తెలుస్తుంది. "పది నిముషాలు వెయిట్ చేయమని" చెప్పాను. యూనిఫాం వేసుకున్నాను. భయం భయంగానే అద్దం ముందుకు చేరుకున్నాను. శ్రీమతి కొత్తగా చూస్తుంది. ఆమెకు నాగురించి బాగా తెలుసు. ఆసక్తిగా నన్నే గమనిస్తుంది.

అద్దంలో ఏ భావమూ లేదు. అద్దం ఈ పోలీసును చూసి భయపడిందా? నిజమే చూపింది. అద్దానికి నాకు మిత్రుత్వము, శత్రుత్వమూ లేదు. ఏ బంధమూ లేదు. తయారై గబాగబా బయటకు నడిచాను. డ్రైవరు కారు డోరు తీశాడు. ఎక్కి కూర్చున్నా. కారు కదిలింది. కారుపై ఎర్రబుగ్గ కాలంలా వేగంగా తిరుగుతూ జనాన్ని హెచ్చరిస్తుంది. కారు దర్జాను రోడ్డుపొడవునా పరుచుకుంటూ రివ్వున వాయువేగంతో దూసుకుపోతుంది. అనాధాశ్రమం వేగంగా వెనక్కి పోయింది. రవి గుర్తుకొచ్చాడు. కారులోనున్న అద్దంలో రంగులు మారాయి. రవి ఆలోచనలతో బాటు, అద్దం ఇంకా నన్ను వెంటాడుతూనే ఉంది. అందుకే నాకు అద్దమంటే అంత భయం. వెనుక ఆలోచనలు తిరిగి ముసురుకున్నాయి.

***

ఆశ్రమానికి ముఖ్య అతిథిగా హాజరై రవి టాలెంట్ గురించి మరచిపోతున్న సమయం అది. పై అధికారి పోలీస్టేషన్ పర్యవేక్షణకు వస్తున్నాడు. సిబ్బంది మొత్తం హడావుడిగా ఉన్నారు. ఇన్స్పెక్టర్ విక్రం ఫైళ్ళను తీసుకొని నా రూమ్‌కు వచ్చాడు.

నాతో వాటి గురించి సీరియస్ గా చర్చిస్తున్నాడు. అనాధాశ్రమం నిర్వహణ అధికారి, వెంట రవితో ఆఫీసుకు వచ్చాడు. కిటికీ అద్దంలో గమనించాను. ముఖ్యమైన పనికావడంతో దృష్టిని పనిపైకి మళ్ళించాను. అరగంట తరువాత ఫైళ్ళు పరిష్కారమయ్యాక విక్రం బయటకు వెళ్ళాడు. కానిస్టేబుల్ లోపలికి వచ్చి సెల్యూట్ చేస్తూ రవి వచ్చిన విషయం గుర్తు చేశాడు. లోపలికి పంపమని సైగ చేశాను.

లోపలికి రాగానే "ఆ... ! చెప్పండి ఏం కావాలి" అని అడిగాను. మా హడావుడి తెలుసుకొని, "రవి పై చదువులకు సాయం కావాలి సార్" క్లుప్తంగా చెప్పాడు ఆశ్రమ నిర్వాహకుడు. "సర్టిఫికేట్లను సిద్ధం చేసుకో రవి. ఖర్చులు నేను చూసుకుంటాను." రేపు మీ ఆశ్రమం వస్తానని చెప్పాను. చెప్పినట్టే మరునాడు ఆశ్రమం దగ్గర రవిని కారులో ఎక్కించు కొని తీసుకెళ్ళి పెద్ద కాలేజీలో చేర్పించాను. హాస్టల్ ఖర్చులన్నీ కలిపి ఫీజును ముందుగానే కట్టేశాను. రవిని జాయిన్ చేసి, టాటా చెప్పి కారు దగ్గరకు నడిచాను. మనసు దూదిపింజలా తేలిపోతుంది. రవి కళ్ళల్లో ఆనందం కన్నీళ్ళలో మెరుస్తుంది. ఆ దృశ్యం కారు అద్దంలో ఎదురైంది. అద్దం నన్ను కనికరించింది. సంతోషాన్నిచ్చింది. రవిపై నాకున్న నమ్మకం వృధాకాలేదు. ఇంటర్లో మంచి మార్కులొచ్చాయి. తరువాత ఇంజనీరింగ్. నా సాయం కొనసాగుతూనే ఉంది. ఆఫీసులో నాకు ఆత్మీయుడుగా నున్న విక్రం ప్రమోషన్ మీద హైదరాబాదు వెళ్ళాడు. రవి బాగోగులు తానే చూసుకుంటున్నాడు. నాకు ప్రమోషన్ వచ్చినా అదృష్టం. నాకు స్థాన బదిలీ జరగలేదు.

***

ఈలోగా కారు ఆఫీసు ముందాగింది. వాస్తవంలోకి వచ్చాను. ఎర్రబుగ్గ సైరను ఆగిపోయింది. కారు దిగాక పూల మాలలతో మా పోలీసు సిబ్బంది ఆఫీసులోకి నన్ను ఆహ్వానించారు. అటెండెన్స్ రిజిస్టరులో చివరి సంతకం. చేసి నా కుర్చీలో కూర్చున్నాను. ఉద్విగ్నం కలిగింది. "పోలీసు ఆడిటోరియంలో పదవీ విరమణ కార్యక్రమం ఏర్పాటు చేశాము సార్". విక్రం సెల్యూట్ చేస్తూ చెప్పాడు. నేను ఊహించలేదు. విక్రం తానే చెప్పాడు. ట్రాన్స్ఫర్ మీద ఈరోజే జాయిన్ అయ్యానని. నా సీట్లో అతను రేపటి నుండి పనిచేస్తాడు. ఆహ్వానాన్ని సున్నితంగా తిరస్కరించాను. కారణం విక్రం అంటే నాకిష్టం లేదు. కారణం మళ్ళీ రవినే. నా

ఆలోచనలను పసిగట్టాడు కాబోలు. ఈసారి తన సిబ్బందిని ముందుకు తోశాడు.

జీపును పూలతో అలంకరించారు. పొడవాటి తాళ్ళు. వాటికి పూల అలంకరణ ఉంది. ఇవన్నీ విక్రం ఏర్పాట్లు. తెలుస్తూనే ఉంది. విక్రంకు నేనంటే చాలా ఇష్టం. తెలుసు. కానీ రవి విషయంలో విక్రం చేసిన ద్రోహం మరువలేను. ఆడిటోరియం పక్కనే ఉంటుంది. జీపులో నన్ను కూర్చోబెట్టి తాళ్ళతో ముందుకు లాగుతున్నారు. సిబ్బంది హడావుడి మధ్య నా ఇబ్బంది చిన్నది. కెమెరాలు, ఫోటోలు, విలేఖరులు, స్టాఫ్ అట్టహాసం మధ్య జీపు ముందుకు పోతుంటే విక్రంను చూశాక నా ఆలోచనలు మాత్రం వెనక్కు మళ్ళాయి.

***

రవి ఇంజనీరింగ్ కళాశాలలో చేర్పించాక బాగోగులు చూసుకోమని విక్రంకు చెప్పాను. అవసరమైన ఆర్థిక సహాయం చేస్తూనే ఉన్నాను. కాలేజీలో ఏవో గొడవలు. చిలికి చిలికి గాలి వానైంది. మంత్రి కొడుకు ఆ గొడవకు కారణం. అతను ఆవేశంలో కొట్టిన దెబ్బలకు సహవిద్యార్థి తలపగిలి చనిపోయాడు. ఆ కేసులో సాక్ష్యం చెప్పడానికి అందరూ భయపడ్డారు. విక్రం రవిని బలవంతంగా ప్రత్యక్షసాక్షిగా చేర్చాడు. నిజం నిర్ధారణ కావడంతో శిక్ష ఖరారైంది. ఇదంతా నాకు తెలియకుండా విక్రం జాగ్రత్తపడ్డాడు. తరువాత మంత్రి అధికారాన్ని ఉపయోగించి రవిని కనబడకుండా చేశాడు. అడవిలో సగంకాలిన రవి శవం దొరికిందని ఆశ్రమం ద్వారా కబురొచ్చింది. తరువాత నా ఎంక్వయిరీలో విక్రం నిర్లక్ష్యం తెలిసి అసహ్యం కలిగింది. అందుకే అద్దం ముందుకు పోయినప్పుడల్లా నాన్న వెంటనే రవి జ్ఞాపకం వస్తాడు. అద్దం కూడా వాళ్ళలాగే నిజం చెబుతుంది కాబోలు. అద్దం వేసే ప్రశ్నకు నా దగ్గర ఏ సమాధానం లేక భయం వేసేది. అందుకే ఇన్నాళ్లుగా తప్పించుకు తిరుగుతున్నాను. నేను పోలీసును. నాకు తెలుసు. అద్దంలో నా గతం ఉంది. అదెప్పుడూ ప్రశ్నిస్తుంది. నిజం నిగ్గుదేల్చమంటుంది. అద్దం పెట్టె యాతన భరించలేక ఇన్నాళ్ళు దూరం పెట్టాను. అప్పుడప్పుడూ చూడకతప్పేది కాదు.

***

ఆడిటోరియం వచ్చింది. జీపుతోబాటు వెంటనే ఆలోచనలూ

ఆగిపోయాయి. హాలునిండా డిపార్ట్మెంట్ వాళ్ళున్నారు. ఆత్మీయులున్నారు. సహాయం పొందిన వారూ ఉన్నారు. అప్పటికే నా శ్రీమతి అక్కడకు వచ్చింది. మమ్మల్ని వేదిక మీదకు ఆహ్వానించారు. సభ ప్రారంభమైంది. ముఖ్య అతిథిగా జిల్లా ఎస్పీగారు ఇంకా రాలేదు. కొత్త ఎస్పి చార్జ్ తీసుకోవాల్సి ఉంది. నేరుగా ఇక్కడికే వస్తున్నారని విక్రం వేదిక మీద అనౌన్స్ చేశాడు. ప్రసంగాలు నడుస్తున్నాయి. విక్రం హడావుడి గమనిస్తూనే ఉన్నాను. కాని పట్టనట్టున్నాను. ఈలోగా ఎస్పి వేదికపైకి వచ్చాడు. అంతా లేశారు. నేను లేచి సెల్యూట్ పెట్టాను.

విచిత్రం. అద్దంలో చూస్తున్నట్టు చూశాను. భ్రమ పడుతున్నానా? తర్కించు కున్నాను. కొత్త ఎస్పి హెూదాతో రవి వచ్చాడు. మీడియా అంతా ఎస్పీగారి మీద ఫోకస్ బెట్టింది. రవి నేరుగా వచ్చి నా ఆశీర్వాదం తీసుకున్నాడు. ఆ కళ్ళల్లో అదే కృతజ్ఞత. ఉట్టిపడింది. రవి బతికి ఉండడమే సంతోషమైతే, పోలీసు అధికారిగా రావడం రెట్టింపు ఆనందాన్నిచ్చింది. సభ ముగిశాక రవితో బాటు విక్రం నా వెనుకే హాలు బయటకు నడిచాడు. ఇంటికి చేరుకున్నాక విక్రం తన బ్యాచ్ మెట్ సాయంతో రవిని కాపాడిన విషయం చెప్పాడు. రవి భద్రత కోసం ఇన్నాళ్ళు ఈ విషయం దాచి పెట్టాల్సి వచ్చిందని చెప్పాడు. ట్రైనింగ్ పూర్తి చేసుకొని ఇదే రోజు ఇక్కడ పోస్టింగ్ తీసుకుంటున్నాడని తెలిసి ఈ విషయం మీకు సర్ప్రైజ్ చేద్దామని చెప్పలేదని చెప్పాడు. మనసులో భారం దిగిపోయింది. కాసేపు ఉండి కాఫీ తాగి వెళ్ళారు. ఇక అద్దం ముందుకు ధైర్యంగా వెళ్లాను. నాన్న గుర్తు కొచ్చాడు. వెంటనే రవి స్థానంలో అనాధాశ్రమానికొచ్చిన సగం కాలిన శవం గుర్తుకొచ్చింది. ఎవరిది ఆ అనాథ శవం? అద్దం మళ్ళీ నన్ను ప్రశ్నించింది.

******

**– సాక్షి, 10 జూలై, 2022**

## 9. యాక్సిడెంట్

పెద్ద కార్పోరేట్ కంపెనీ రీజినల్ ఆఫీసది. అక్కడ హెచ్.ఆర్ పోస్టు కోసం ఇంటర్వ్యూ జరుగుతుంది. ఆ ఇంటర్వ్యూకు సుభాషిణితో బాటు చాలామంది హాజరయ్యారు. ఒక్కొక్కరిని పిలిచి తక్కువ సమయంలో వేగంగా ఇంటర్వ్యూ చేస్తున్నారు. సుభాషిణి వంతు రానే వచ్చింది. సుభాషిణికి ఈ ఉద్యోగం చాలా అవసరం. ఆత్మవిశ్వాసంతో ఇంటర్వ్యూ గదిలోనికి వెళ్ళింది. అక్కడ "ఐయాం జయ ప్రకాశ్. మీ గురించి చెప్పండి?" ఇంటర్వ్యూ ప్రారంభిస్తూ అడిగిందో దర్జాకోటు. "నా పేరు డా. సుభాషిణి. సోషియాలజీలో పి.హెచ్.డి, గోల్డ్ మెడల్." అని అతని ముందు తన సర్టిఫికేట్ లను పెట్టింది. అతని ఆ సర్టిఫికెట్లను పరిశీలించి, సారీ. మరోచోట ప్రయత్నించండని ఉచిత సలహా ఇచ్చాడు. తరువాత బయటకు వెళ్ళాక, అతను బంధుప్రీతితో ఆ ఉద్యోగాన్ని తనకు బాగా తెలిసిన వారికి ఇప్పించాడని తెల్సి, ఆవేదనతో,  నిరాశగా రోడ్డుమీదకు నడిచింది.

అన్య మనస్కంగా నడుస్తున్న సుభాషిణి పక్కనుండే అతివేగంగా ఒక కారు దూసుకుంటూ వెళ్ళి సడన్ బ్రేక్ తో కీచుమని ఆగింది. ఊహించని ఆ కుదుపుకు షాక్‌కు గురయిన సుభాషిణి తేరుకొని అటు చూసింది. ఆ కారు బైక్ నడుపుతున్న యువకుడిని డాష్ ఇచ్చినట్టుంది. అతను అంతెత్తున ఎగిరి కింద పడ్డాడు. కారు డ్రైవింగ్ సీటు నుండి యువతి, మరో పక్కనుండి ఒక యువకుడు దిగారు. జనం పోగవ్వడంతో వారు కారెక్కి వేగంగా పరారయ్యారు. ఇంతలో బస్సు రావడంతో సుభాషిణి బస్సెక్కి కూర్చుంది. సుభాషిణి మనసునిండా ఆలోచనలు తేనేటీగల్లా కమ్ముకున్నాయి. ఉద్యోగం రాలేదని బాధ. ఆకలితో నీరసం. ఇంకోవైపు నాన్న మాటలు గుర్తొచ్చాయి. "అమ్మా ఆడపిల్లకు చదువెందుకని అందరంటున్నా చదివించాను. ఇప్పుడు ఉద్యోగం చేయాలంటున్నావు. మరొకవైపు బందువులంతా నీకు పెళ్లి చేయడం లేదని, సూటి పోటి మాటలతో కుళ్ళబొడుస్తున్నారు. దగ్గరి సంబంధం అయిన వాళ్ళని బతిమి లాడితే, పెళ్లి జేసుకుంటానని వచ్చిన ఆ సంబంధం కూడా కీడు జరిగిందని వెనక్కి పోయింది. నా మాటినుు. మరో సంబంధం

చూస్తాను. పెళ్లి జేసుకో."

***

హాస్టల్ దగ్గర బస్సు కుదుపుతో ఆగింది. ఆలోచిస్తూనే బస్సు దిగింది. హాస్టల్ వైపు అడుగులేస్తూ ఆలోచిస్తుంది. సుభాషిణికి ఉద్యోగం చేయాలనే కోరిక చిన్నప్పటి నుండి తీవ్రంగా ఉంది. తన ప్రయత్నాలన్నీ నిరాశ కలిగిస్తున్నాయి. ఇక ఈ జన్మలో ఉద్యోగం వచ్చే యోగం లేనట్టుంది. ఆ ఆలోచన రావడంతో, తన కోరిక తీరనందుకు దుఃఖంతో కన్నీళ్ళాగడం లేదు. పుస్తకాలలో చదివే ధైర్యం వేరు. నిజ జీవితంలో ఎదురయ్యే సమస్యలు వేరు. సమస్య ఎదురయ్యే వరకు ధైర్యం గురించి సులభంగానే మాట్లాడవచ్చేమో! ఆలోచిస్తున్న కొద్దీ, నడిచే దారి క్రమంగా మసకబారుతుంది. ఒక్క క్షణం ఆగి, తడిచిన కళ్ళను, కళ్ళద్దాలను తుడుచుకోవడానికి నిలబడింది. వెళ్తున్న వారు ఆమెను విచిత్రంగా చూస్తున్నారు. "వీళ్ళకు కష్టాలు తెలియవా? కన్నీళ్లు రావా? అలా చిత్రంగా చూస్తారెందుకు?" మనసులో అనుకుంటూ పక్కనే ఉన్న పార్కువైపు అడుగులు వేసింది. ఓ మూలగా నున్న సిమెంట్ బెంచిపై కూర్చుంది. శీతాకాలం సాయంత్రం చీకటి. కొద్ది దూరంలో చెట్టుకిందనే ఒకజంట చాటుగా నక్కి ఉంది. వారి మాటలు లీలగా వినబడుతున్నాయి. వద్దనుకున్నా సుభాషిణికా మాట లు వినబడుతున్నాయి.

మధూ! ఈ విషయం తెలిస్తే మా నాన్న నన్ను చంపేస్తాడు.

సుధా! ఏం కాదు. నువ్వు ధైర్యంగా ఉండు. నేనున్నాగా! అతను ధైర్యం చెబుతున్నాడు.

లేదు మధూ! నన్ను హాస్పిటల్కు తీసుకెళ్ళు. డాక్టరుతో నేను మాట్లాడుతాను. ఎలాగైనా ఈ గండం గట్టెక్కితే చాలు. దుఃఖాన్ని అదుముకుంటూ రెండు చేతులలోకి ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తుంది ఆమె. అతన్ని బాగా వేడుకుంటుంది. కానీ అతను మాత్రం ఆమెను సముదాయిస్తున్నాడు.

ఆసక్తితో సుభాషిణి వెనక్కి తిరిగాలనిపించింది. ఆ జంట ఎవరో చూడాలనిపించింది. ఇందాక రోడ్డుమీద తను ఏడుస్తూ నడుస్తున్నప్పుడు జనం తనవంక చిత్రంగా చూసిన చూపు గుర్తుకొచ్చింది. ఆ జనాల్లాగే తాను కూడా వారివంక చిత్రంగా చూడాలనుకోవడంలేదా? వాళ్లకి తనకి ఏంటి తేడా? ఆలోచిస్తూ సిగ్గుపడింది. అయినా ఆసక్తిని అదిమిపట్టలేకపోయింది. కోరిక అంతే. అది మనల్ని

లోబరుచుకున్నంత తేలికగా దానిని లొంగదీసుకోలేము. 'హూ! ఎవరి బాధలు వారివి. అని నిట్టూర్చింది సుభాషిణి. ఒక దీర్ఘ నిట్టూర్పు విడుస్తూ, వారిని ఎలాగైనా చూడాలనిపించి వెనక్కి తిరిగింది. అవాక్కైంది. ఇందాక కారు యాక్సిడెంట్ చేసిన యువతీయువకులే. చూడడానికి గొప్పింటి బిడ్డల్లా ఉన్నారు. చీకటిలో కూడా నియాన్ లైట్లలా, పాలనురగలా తెల్లగా మెరిసిపోతున్నారు. చూడ ముచ్చటగా ఉన్నారు.

***

రాత్రి ఎనిమిది గంటలకు హాస్టల్ కు అలసటగా చేరుకున్న సుభాషిణి మరునాడు హెచ్.ఆర్ పోస్టు ఇంటర్వ్యూకు ప్రిపేర్ అవుతుంది. ఇంతలో రూమ్మేట్ రాజీకి కడుపునొప్పి మొదలైంది. సాయంత్రం ఏదో చైనా డిష్ తిన్నదట. అరగక తీవ్రమైన కడుపు నొప్పి మొదలైంది. ఆ నొప్పిని తట్టుకోలేకపోవడంతో, రాజీను తీసుకొని టాక్సీలో హాస్పిటల్ చేరుకుంది సుభాషిణి. డాక్టరు రాజీని పరిశీలించి, ఫుడ్ పాయిజన్ అయిందని ఇంజక్షన్ ఇచ్చాడు. అబ్జర్వేషన్ కోసం కాసేపు కూర్చోమన్నాడు. రాజిని కూర్చోబెట్టి మందులు తీసుకొద్దామని బయటకు నడిచింది సుభాషిణి. రిసెప్షన్ దగ్గర మధు, సుధలు కన్పించారు.

సుధ ఆసక్తితో అటువైపు అడుగులేసింది. సుధ బ్యాగునుండి రెండు చేతులా డబ్బు తీసి, కౌంటర్ పైన పెట్టింది. లోగొంతుకతో "మధూ! అంతా ఓకేనా? నాన్నకు తెలియకుండా ఈ డబ్బులను అన్నయ్య సర్దాడు" అంది సుధ. "అంతా ఓకె. పోలీసు కేసు పెట్టలేదట. యాక్సిడెంట్ ప్రదేశంలో మా ఫ్రెండ్ ఒకరు మనల్ని గుర్తుబట్టాడు. అతనికి నేను సర్దిచెప్పానులే. నువ్వేం భయపడకు. అతనికేం కాదు. అతనితో నేను మాట్లాడాను. వైద్యాకయ్యే ఖర్చు భరిస్తే చాలంటున్నాడు. నేను మేనేజ్ చేస్తాను. నువ్వెళ్ళు ఇంటికి" అన్నాడు. ఆ అమ్మాయి ఇంటికి వెళ్ళగానే అతని స్నేహితుడు అక్కడికి వచ్చాడు. అతన్ని చూసి, రెండోసారి అవాక్కైంది సుభాషిణి. సుధ వెళ్ళిపోయాక వచ్చిన ఆ యువకుడు ఎవరో కాదు. పొద్దున్న ప్రమాదానికి గురైన యువకుడే. చక్కగా ఆరోగ్యంగా ఉన్నాడు. మధుతో నవ్వుతూ మాట్లాడుతున్నాడు. వారు ఆ డబ్బులను నవ్వుతూ లెక్కబెట్టుకుంటున్నారు. అది చూసిన సుభాషిణి "బుద్ధిమంతుడికి సద్ది కడితే బొద్రాయి కాడనే ఇప్పుకొని తిన్నట్టు ఉంది వీడి వ్యవహారం' అనుకుంది. ఒళ్ళు మండిపోయింది. ఉదయం ఉద్యోగం

దగ్గరా, ఇప్పుడు స్నేహంలో...అంతా మోసమే. విషయమంతా రాజీకి చెబితే, "మనకెందుకా గొడవ. హాస్టలుకు పోదాం పద" అని అక్కడినుండి బయల్దేరేవరకు తొందరబెట్టింది.

***

మరునాడు సుభాషిణి ఇంటర్వ్యూకు హాజరైంది. అక్కడ వాళ్ళు ఏవో కొన్ని ప్రశ్నలడిగారు. టపీ టపీమని అన్నీటికి జవాబులు చెప్పింది. అది చాలా పెద్దకంపెనీ. సుభాషిణికి ఆ ఉద్యోగం వస్తుందని నమ్మకం లేదు. కానీ ఊహించని విధంగా, వాళ్ళు మీరు ఈ ఉద్యోగానికి ఎంపికయ్యారు. కంగ్రాట్స్ అన్నారు. నమ్మ లేకపోయింది. అదే కంపెనీకి చెందిన చిన్న బ్రాంచ్ లో రాని ఉద్యోగం మెయిన్ బ్రాంచ్‌లో రావడం సుభాషిణి ఊహించలేదు. ఆ విషయం నాన్నకు ఫోన్ చేసి చెబితే ఆయన చాలా సంతోషించాడు.

***

తొలిరోజు ఎచ్.ఆర్. మేనేజరుగా సీటులో కూర్చుంది సుభాషిణి. సహెూద్యోగులంతా చైర్ వద్దకొచ్చి విష్ చేసి అభినందించారు. పనిని, వ్యక్తులను త్వరగానే అర్థం చేసుకుంది. ఆర్నెల్ల తరువాత ఒకరోజు సుభాషిణికి జియం నుండి మెయిల్ వచ్చింది. కంపెనీ రీజినల్ మేనేజరు పనితీరు నెమ్మదించిందన్నది దాని సారాంశం. దాంతో రీజినల్ మేనేజరుకు తన ముందు వచ్చి హాజరుకమ్మని మెయిల్ పెట్టింది. అతను చెమటలు కక్కుకుంటూ వచ్చి సుభాషిణి ముందు చేతులు కట్టుకొని నిలబడ్డాడు. అతన్ని చూడగానే సుభాషిణి ఆశ్చర్యపోయింది. అతను జయ ప్రకాశ్. అంతకు ముందు తనకు న్యాయంగా రావాల్సిన ఉద్యోగాన్ని ఎవరికో బంధువులకు ఇచ్చిన వ్యక్తి. ఇప్పుడు సుభాషిణి ఒక్క సంతకం చేస్తే, అతను మరుక్షణంలో కంపెనీ అవతలుంటాడు. ప్రొఫెషనల్ గా ఆలోచించింది. అప్పటికే అతను సుభాషిణిని గుర్తుపట్టి పశ్చాత్తాపంతో తల దించుకున్నాడు.

"సారీ మేడం! కుటుంబ సమస్యల వలన ఈమధ్య ఉద్యోగబాధ్యతలు సరిగ్గా నేరవేర్చలేకపోయానని" చెప్పి ఆదివారం లంచ్ కి ఆహ్వానించాడు. ఉద్యోగులతో సన్నిహితంగా ఉన్నప్పుడే వాళ్ళ సమస్యలు తెలుస్తాయని ఒక హెచ్.ఆర్ గా తనకు తెలుసు. అదీగాక కుటుంబ సమస్యలు అంటున్నాడు కాబట్టి అతని

కుటుంబాన్ని చూసే అవకాశం ఉంటుందని ఆలోచించి వెంటనే ఒప్పుకుంది. ఆదివారం రాజీని తీసుకొని ప్రకాశ్ ఇంటికి వెళ్ళింది.

అక్కడ వాళ్ళబ్బాయి మధును చూసి అవాక్కైంది. ఆవు చేనులో మేస్తే, దూడ గట్టున మేస్తుందా?. తండ్రి కూడా కొడుకు లాగే మోసపూరిత వ్యక్తేనా? తండ్రి కొడుకులు భలే మోసగాళ్ళులా ఉన్నారనుకుంది. ఒక నిశ్చయానికి రాలేకపోతుంది. మెల్లగా మధును మాటల్లో పెట్టింది. ఆరోజు హాస్పిటల్లో జరిగిన సంఘటన గురించి ఆరా తీసింది. ఈసారి మధు ఆశ్చర్యపోయాడు.

తరువాత మధు అసలు విషయం చెప్పాడు. "సుధ నా క్లాస్మేట్ మేడం. సుధ వాళ్ళన్నయ్య నిర్లక్ష్యంగా కారును నడిపి, ఆరోజు హాస్పిటల్ లో చూసిన నా మిత్రుని నాన్నగారికి యాక్సిడెంట్ చేశాడు. ఆయన ఒక చిరుద్యోగి. నా మిత్రుడు నిరుద్యోగి. నష్ట పరిహారం కోసం అడిగితే సుధా వాళ్ళ నాన్నగారు, అన్నయ్య ఇద్దరూ కలిసి వాళ్ళ అధికారాన్ని, అహాన్ని ప్రదర్శించారు. అలాంటి విధిలేని పరిస్థితుల్లో తప్పక స్నేహితునికి సాయం చేయాలని ఆ నాటకాన్ని ఆడాల్సి వచ్చింది. ఆరోజు అదే హాస్పిటల్లో వాళ్ళ నాన్నకు ఆపరేషన్ జరిగింది. గాయాల నుండి ఇప్పుడిప్పుడే అతను కోలుకుంటున్నాడు. ఆ యాక్సిడెంట్ వలన మా ఫ్రెండ్ వాళ్ళ అన్నయ్య రాజేష్ పెళ్ళాగిపోయింది. హాస్పిటల్ చుట్టూ తిరిగడంతో అతని ఉద్యోగం పోయింది. తరువాత నాన్న గారు వాళ్ళ ఆఫీసులో ఎచ్. ఆర్. ఉద్యోగం ఇప్పించారు. సుభాషిణికప్పుడర్థమైంది. రాజేష్‌తో తన పెళ్లి, ఉద్యోగం అదే యాక్సిడెంట్‌తో ముడిపడ్డాయని. తరువాత మధు, సుభాషిణిల స్నేహం ఏడడుగులు వేసింది.

******

**– తంగేడు పక్ష పత్రిక, 1–15 నవంబరు, 2022**

# 10. భయం

'ఆ జంబూకరావు ఎప్పుడూ ఇంతే. అవతలి వాళ్ళను ఇబ్బందుల్లోకి నెట్టేసి, వాళ్ళు బాధ పడుతుంటే చూస్తూ ఆనందపడతాడు. పరమ శాడిస్ట్ వెధవ. ఈ గండం గట్టెక్కేది ఎలాగో?' తనలో తానే గొణుగుతూ అటూ ఇటూ వరండాను తన ఏనుగు పాదాలతో కొలుస్తున్నాడు ఆందోళన రావు.

''ఏంటండీ? ఏం జరిగింది? అర్ధరాత్రి వరకు అలా నిద్రపోకుండా అటూ ఇటూ తిరుగుతున్నారు. సమయం రెండు దాటింది. ఇక చాలు. వచ్చి పడుకోండి." అంటూ ఆవులిస్తూ "లోపలికి రండి. వచ్చి పడుకోండి" అంటున్న భార్య వంక ఓసారి ఏ భావం లేకుండా చూసి, ప్చ్ ! నీకేం తెలియదులే! నువ్వెళ్ళి పడుకోమని చెప్పి, ఈసారి ఆలోచనతో కాలాన్ని వెనక్కి కొలిచాడు ఆందోళనరావు.

ఆందోళనరావుది తండ్రి చనిపోతే వచ్చిన కారుణ్య నియామకం. మొదట మార్కెటింగ్ శాఖలో చిరుద్యోగిగా ఉద్యోగం లభించింది. ప్రమోషన్ తరువాత ప్రమోషన్ లభించడంతో ఆఫీసరు హోదా దక్కింది. మనిషి బాగా కురచ. బట్టతల, బానా పొట్టతో బస్తాలో కుదేసినట్టు నిండుగా ఉంటాడు. వయసు ఐదుపదులుంటుంది. చీకట్లో అద్దాన్ని చూసి దడుసుకునే అతి భయస్థుడు. తలపై కళ్ళద్దాలు పెట్టుకొని ఇల్లంతా వెతికే మతి మరుపు మనిషి. బి.పి రాకముందే మెడికల్ షాపులో మందులు కొనుక్కొని వాడే అతి జాగ్రత్తాపరుడు. టైంకు ముందే ఆఫీసుకు వెళ్లి గడియారం వంక గర్వంగా చూసే నిగర్వి. గబగబా ఆఫీసుకు తయారవుతూ చొక్కా గుండీలను పైకొకటి కిందికొకటి పెట్టుకునే హడావుడి మనిషి. ఇన్ని సవలక్షణాలున్న ఆందోళనరావంటే సహోద్యోగులకు చిన్నచూపు, చింత చూపు. వింత చూపు.

ఈ మధ్యే ప్రమోషన్ వచ్చింది. మండల మార్కెట్కు ఆఫీసరుగా ప్రమోషన్ పొందాడు. సంతోషించాల్సిన విషయమైనా ఆందోళన రావుకది ఇష్టం లేదు. ప్రమోషన్ తిరస్కరించాడు. కానీ ఆ జంబూక రావు ఉన్నతాధికారులతో ఒత్తిడి తెప్పించి ప్రమోషన్ తీసుకునేటట్టు ఇరికించాడు. "పరిగెత్తే వాడిని చూస్తే తరిమే

వాడికి లోకువన్నట్టు" జిత్తుల మారి జంబూక రావు బామ్మర్దికి పెద్ద మార్కెట్ ప్రమోషన్ ఇప్పించడంకోసం ఈ కుట్రను పన్నాడు. కొత్త మార్కెట్ కు బదిలీకాగానే ఆందోళన రావుకు బీపి వచ్చింది. మార్కెట్ చిన్నదే. కానీ రాజకీయ ప్రభావం ఎక్కువ. పంటల సీజన్. మొదట్లోనే అక్కడున్న చోటా మోటా నాయకులు, పెద్ద పెద్ద వ్యాపారులు పట్ట పగలు చుక్కలు చూపిస్తున్నారు. ఆ చుక్కలను లెక్క బెట్ట లేక ఆందోళన రావుకు నీరసం వచ్చేది. ఆందోళన రావులో ఇప్పుడు ఆందోళనకు మించిన ఆపద మరొకటి వచ్చి పడింది. అదే కరోనా. జనాలను సెకండ్ ఇన్నింగ్స్ ఆడుకుంటుంది. తెల్లారితే మంత్రి గారిచే నూతన మార్కెట్ భవనం ప్రారంభోత్సవం. ఆ జనంలో కరోనా నుండి తప్పించుకోవడం అసాధ్యం. డిస్కవరీ ఛానల్లో పులి నోట కరుచుకున్న లేడిపిల్లలా గింజుకుంటున్నాడు.

***

మాస్కు లేకుండా ఐసోలేషన్ వార్డులో నడుస్తున్నట్టు కలబట్టి గబుక్కున నిద్ర లేచాడు ఆందోళనరావు. మనిషికి కావాల్సింది నిద్ర కాదు. విశ్రాంతి. దాని కోసమే నిద్ర. కానీ మది నిండా ఒత్తిడి ఉంటే నిద్రకు చోటెక్కడిది. ఆలోచిస్తుంటే... నిన్న సాయంత్రం ఇంటికి వస్తుంటే, కారులో భయంకర్ అన్న మాటలు గుర్తుకొచ్చాయి. "మంత్రిగారు చండ శాసనుడు. ఎక్కడ పోయినా, ఏర్పాట్లలో తేడా వస్తే అస్సలు సహించడు. ఏర్పాట్లలో నిర్లక్ష్యం చేసిన వాళ్ళకిక శంకరగిరి మాన్యాలే. " చలి కాలమయినా నుదురంతా చెమటలు బట్టాయి. నిద్ర బట్టక వరండాను కొలుస్తూ ఆ మార్కెట్ కు బదిలీకి కారణమైన జంబూక రావును తిడుతూ తిరుగుతున్నాడు.

***

ప్రమోషన్ పోస్టు తీసుకోకముందు ఉద్యోగం స్థానికంగా ఉండేది. బాధ్యతలు తక్కువ. ఆఫీసు సమయం తరువాత ఆఫీసు విషయాలతో సంబంధం ఉండక పోయేది. ప్రమోషన్ వచ్చాక ప్రయాణం అవసరమయింది. లంచ్‌బాక్స్ అవసరమైంది. కొత్తలో ఆఫీసుకు బస్సులో ప్రయాణించేవాడు. గంట ప్రయాణం. కారయితే సౌకర్యంగా ఉంటుందని పాతకారొకటి కొన్నాడు. స్వంతంగా నడుపుతూ వెళ్ళేవాడు. ఒకసారి రోడ్డుపై ఎడ్లబండి అడ్డమొస్తే బ్రేకు బదులుగా ఎక్సలేటర్

తొక్కాడు. దాంతో కారుకు ఆందోళన పెరిగింది. ఫలితం ఎడ్లబండితో బాటు కారు తిరగబడింది. 'దుర దృష్టం ఎక్కిరించినా అదృష్టం కాపాడింది.' వేగం తక్కువనే కావడంతో ప్రమాదం తప్పింది. స్వల్ప గాయాలతో బయట పడ్డడు.

దాంతో కిరాయికారును ఏర్పాటు చేసుకున్నాడు. రెండో వేవ్ కరోనా భయానికి, అదొలేసి సొంతంగా మరోపెద్ద కారును కొన్నాడు. పెట్రోధరలు ఆకాశం చేరాయి. కొత్త కారుకు కడుపు పెద్దది. ఆకలెక్కువ. కడుపు కట్టుకొని మరీ కారు కడుపు నింపుతున్నాడు. కొత్త కారు భయంతో నడవడం మొదలుబెట్టింది. అయినా ఆందోళనరావు అప్పుడప్పుడూ బ్రేకు బదులు ఎక్సిలేటరు వాడుతూనే ఉన్నాడు.

సహోద్యోగి భయంకర్ అవకాశవాది. మాట పదును. ఎప్పుడూ ఇతరులను ఆడి పోసుకోవడానికి ప్రతీది అదును. విషం ఎక్కువ. విషయం తక్కువ. చేయి చిన్నది. నోరుపెద్దది. "అత్త పోరు లేదు, మామ పోరు లేదు. గుడిసెలో గుడ్డివాని పోరు" సామెతన్నట్టు ఆఫీసులో అందరూ అతనితో జాగ్రత్తగా ఉంటారు. ఎప్పుడు బద్నాం చేస్తాడోనని కారులో రోజూ భయంకర్‌ను తనవెంట తీసుకుపోతాడు. భయంకర్ తన గాలి వార్తలతో ఎదుటి వారిని భయపెట్టి హడలెత్తించే రకం. అయినా అతను మాత్రం 'ఆందోళనరావు పాపం ...హడావుడి జీవి'అని కనీసం కనికరించడు. "అక్కర తీరినాక, తక్కెడ పొయ్యిలో పెట్టే రకం". ఆందోళనరావుకు ఆ విషయం తెలుసు. అయినా మటన్ షాపు దగ్గర కరోనాను మరిచిపోయి, తోసుకుంటున్న సామాన్య జనంలా అలవాటు చేసుకున్నాడు.

***

మంత్రిగారి చేతుల మీదుగా మార్కెట్ శంకు స్థాపనకు సోమవారం మంచి ముహూర్తంగా నిర్ణయించారు. ఏర్పాట్లు బాగుండాలని మంత్రిగారి పేషీ నుండి హెచ్చరిక వంటి సమాచారం వచ్చింది. ఒకవైపు టీవిల్లో సామాజిక మాధ్యమాల్లో కరోనా మరణ వార్తలు చెవిన ఇల్లుకట్టి, ఆ పైన స్లాబ్ పోసి పోరుతున్నాయి. జనం కరోనా వైరస్ ఉందన్నట్టు, జ్ఞాపకంలో పెట్టుకున్నట్టు అన్పించదు. కరోనా ఏమైనా వాళ్ళ బానిసలాగ పనిచేసే ఉద్యోగి అనుకుంటారా? ఈ నాయకులు!. ఆందోళన రావుకు ఆదివారం రాత్రి నిద్ర కనికరించక కాళరాత్రయింది. నిద్రలేమితోనే తెల్లారింది. కండ్లు ఉబ్బి సీమ చింతకాయల్లా మారాయి. హడావుడిగా ఆఫీసుకు

బయలు దేరాడు. భయంకర్ చెప్పే కరోనా కబుర్లు విని ఆందోళన రావు ఒకటి రెండుసార్లు బ్రేకుకు బదులు ఎక్సలేటరు తొక్కినా భయంకర్ మాత్రం కనికరించలేదు.

***

మంత్రిగారి కార్యక్రమం ఏర్పాటు చేసిన ప్రాంతానికి ఆలస్యంగా చేరుకున్నాడు ఆందోళన రావు. మంత్రి గారు అప్పటికే వచ్చి ఉన్నారు. కార్యకర్తలు వందల్లో ఉన్నారు. అక్కడెవరికీ మాస్కులు ఉన్న దాఖలాలు లేవు. గుప్పున మద్యం కంపు. పాపం అమాయక ప్రాణి ఆ వాసనకే ఊపిరి వదిలేసేటట్టుంది కరోనా. భౌతిక దూరం ఇక సరే సరి. సౌనమ్మ దేవత దగ్గర బలి ఇయ్యడానికి తెచ్చిన మేకల మాదిరి కార్యకర్తలను తరలించారు. గొర్రె కసాయిని నమ్మినట్టు నాయకుల మత్తు మాటలు నమ్మివచ్చారు జనం. “మంది మాటలు బట్టుకొని మార్వానం బోతే మల్లొచ్చె వరకు ఇల్లాగమయితని” ఎరగరు. మంద లేపిన దుమ్ములో ఊపిరి ఆగినట్టు గాలి ఆడడం లేదు.

అక్కడి హడావుడి చూడగానే ఆందోళన రావుకు పై ప్రాణాలు పైనే పోయాయి. కరోనా కాళికా మాతలా తాండవం ఆడుతున్నట్టు కన్పడుతుంది. భయంకర్ “సార్ మనకు ఇప్పటికే ఆలస్యం అయింది. లోపలికి తోసుకు పోదామని” చెప్పి సమాధానం కోసం ఎదురుచూడకుండా చేయిబట్టి గుంపు లోపలికి లాగాడు. చుట్టూ డప్పుల మోత. కార్యకర్తల రంగుల హెూలీ. టపాసుల మోత. తన అంతిమ యాత్రకు తానే ముందు నడుస్తున్నట్టుగా అన్పిస్తుంది ఆందోళనరావుకు.

మంత్రి గారు కనబడకుండా చుట్టూ కార్యకర్తలు బెల్లంపై ఈగలు మూగినట్టు మూగారు. అచ్చుమ్మ పెళ్ళిలో బుచ్చుమ్మ శోభనమన్నట్టు కార్యకర్తల ముఖాలు వెలిగి పోతున్నాయి. ఇంతలో ఎవరో అరిచారు. “ఆఫీసరు గారిని సారు పిలుస్తుండు.” ఎప్పటిలాగే భయంకర్ జబర్దస్తీ మొదలైంది. ఆగకుండా చేయిబట్టి గుంపులో నుండి శంకు స్థాపన శిలాఫలకం చోటుకు లాక్కెల్లాడు. అప్పటికే మంత్రి గారు శంకుస్థాపనకు సిద్ధ మయ్యారు. కొబ్బరి కాయ కొట్టారు. శిలా ఫలకం మీదనున్న తెరను పక్కకు జరిపారు. చప్పట్లే చప్పట్లు. జయ జయద్వానాలు. ఈలోగా మీడియా వచ్చింది. మంత్రిగారు మీడియాతో మాట్లాడుతున్నారు. జనం వెనుకనుంచి తోస్తున్నారు. ఆందోళనరావులో అంతా అయోమయం. ఇంతలో ఎవరో ఒక

నాయకుడు "తీయవయ్యా ఆఫీసరుగారు నీ మాస్కు. ఫోటోలో రావొద్దూ.." నోట మాట పూర్తిగాకముందే ఒక కార్యకర్త మాస్కును అమాంతం లాగేసుకున్నాడు. "హతవిధీ! అనుకున్నంతా అయింది." ఆందోళనరావు వెన్నులో భయం జొరబడింది. పత్రికల్లో వార్త కోసం ప్రాణాలకు తెగించక తప్పింది కాదు.

డప్పుల మోత మొదలైంది. ఆందోళన రావుకు ఆ చప్పుడు ఇంకో రకంగా వినబడుతుంది. కార్యకర్తలు మంత్రిగారిని గుంపుతో బాటు కారెక్కించేశారు. తరువాత తుఫాను ప్రశాంతత. అప్పు తీసుకొని కట్టకుండా దేశం వదిలి పారిపోతే సమాధానం చెప్పలేని నిస్సహాయ బ్యాంకు మాదిరి ఆందోళనరావులో నిస్సహాయత కమ్మింది. "హమ్మయ్య !" అనుకుంట కారెక్కాడు ఆందోళనరావు. అది గమనించిన భయంకర్ కారులో కూర్చున్నాక "నిండా మునిగాక చలెందుకు సార్" దారిపొడుగునా ధైర్య వచనాలు చెబుతూనే ఉన్నాడు.

"మీ రెండో డోస్ వాక్సిన్ అయిపోయిందా సార్" భయంకర్ ప్రశ్నకు అవునని తల ఊపాడు ఆందోళనరావు. "ఏ వాక్సిన్ వేయించుకున్నారు సార్". "కోవిషీల్డ్" అన్నాడు ఆందోళనరావు. నేను "కోవాక్సిన్ వేసుకున్నాను సార్." గొప్పగా చెప్పాడు భయంకర్. 'సిరంజీవి'లా' ఫోజుపెడుతూ చెబుతున్న భయంకర్ ధైర్యానికి పట్టపగ్గాలు లేవు. "ధైర్యమున్నోడే, భయమెక్కువ కల్గిస్తాడు. ఏదేమైనా భయం మహాచెడ్డది." మనసులో అనుకున్నాడు ఆందోళనరావు.

***

శంకుస్థాపన జరిగి నాల్రోజులు దాటింది. భయంకర్ కరోనా బారిన పడ్డాడనే దుర్వార్త తెలిసింది. సాయంత్రం ఫోన్ చేసి చెప్పాడు. 'వట్టి గొడ్డుకు అరుపు లెక్కువ. వానలేని మబ్బుకు ఉరుము లెక్కువ' అన్నట్టు భయంకర్ ధైర్యం వట్టిదేనని అర్ధమైంది. భయం అలాంటిది మరి. ధైర్యాన్ని కూడా భయపెడుతుంది. ఆందోళన రావులో అనుమానం భయం అనే పెనుభూతమైంది. రాత్రి నిద్రలేదు. సూర్యుడు రాకముందే ఆందోళనరావులో జాగ్రత్త మేలుకొంది. తుఫాను ప్రమాద హెచ్చరికలా... ఆందోళనతో నున్న కరోనా భయం ఏ క్షణమయినా తీరం దాటేట్టు ఉంది. 'భయం...భయం...భయానికి భయం లేదు. ఎవ్వరి దగ్గరకయినా నిర్భయంగా వచ్చేస్తుంది. చావు లేని వాడున్నా భయంలేని వాడు ఉండడు. అసలు దీనిని

భయపెట్టేవాడే లేడా?.' ఆలోచిస్తూ ఆఫీసుకు సెలవు బెట్టి, కరోనా టెస్ట్ కోసం ప్రభుత్వ హాస్పిటల్ కు పరుగు దీశాడు. అక్కడ జనం..జనం....జనం. వాళ్ళంతా కరువు బాధితుల్లా మద్యం షాపు ముందున్నట్టు బారులు తీరి ఉన్నారు. ఓపిక చేసుకుని తనవంతు రాగానే ముక్కును వారికి అప్పనంగా అప్పగించాడు. ఆందోళన రావు ముక్కులోకి నెట్టిన పుల్ల నషాళానికి తాకింది. నొప్పి కళ్ళలోకి పాకి కన్నీటిగా జారింది. ఆందోళన రావు సప్లిమెంటరీ ఫలితాల కోసం విద్యార్థి ఎదురు చూసినట్టు, కరోనా రాపిడ్ పరీక్ష ఫలితం కోసం ఆత్రుతగా ఎదురు చూస్తున్నాడు. ఫెయిల్ అయితే బాగుండునని జ్ఞాపకమొచ్చిన దేవుళ్ళకి మొక్కుతున్నాడు. ఫలితం రానే వచ్చింది. అది చూసి ఆటంబాంబు పక్కనే పడ్డట్టు ఉలిక్కిపడ్డాడు. ఫలితం పాజిటివ్ అని తేలింది. విద్యార్థి పరీక్ష పాసయితే సంతోషం. ఆందోళన రావుకు మాత్రం బాధ కలిగింది. నీరసంగా అక్కడనుండి బయట పడ్డాడు. నిండా మునిగాక చలిఎందుకు? శతకం దాటిన పెట్రోల్ ధరల్లా ఆందోళన రావుకు దడుపు జ్వరం శతకం దాటింది. కరోనా భయానికి తీవ్ర లక్షణాలు లేకున్నా ఆఫీసుకు మూడు రోజులు సెలవు పెట్టాడు.

***

అది జలగ పేరుతోనున్న పెద్ద ప్రైవేటు హాస్పిటల్. హాస్పిటల్లో జాతర సాగుతుంది. డాక్టరుగారి అపాయింట్ మెంటు కోసం ఎదురు చూస్తున్నాడు. "పిల్లను జూసి పీట వేయమన్నట్టుంది" అక్కడి పరిస్థితి. రికమండేషను లేనిది అపాయింట్ మెంటు కూడా దొరికేట్టు లేదు. చాలాసేపయింది. తనకంటే వెనుక వచ్చిన ఎవరెవరో డాక్టరుగారిని ఇలా కలిసి, అలా వెళ్ళిపోతున్నారు. ఆలస్యం కావడంతో "ఇంకో ఆసుపత్రికి వెళ్లి చూద్దాం ! అనుకుంటూ బయట కొచ్చి బైక్ స్టార్ట్ చేశాడు ఆందోళన రావు.

చివరికి ఒక సందులో ఉన్న చిన్న హాస్పిటల్‌ను దొరకబుచ్చుకున్నాడు. అక్కడ జనం కిటకిటలాడుతూ ఉన్నారు. త్వరగానే డాక్టరు దర్శనం దొరికింది. ముసుగులో ఉన్న డాక్టరుకు భయం స్పష్టంగా కనబడుతుంది. అది భయం. అంతే. అందరికీ ఉచితం. అతను పరీక్షించి మందులు రాశాడు. హోం ఐసోలేషన్ ఉండ మన్నాడు. బాగా తినమని సలహా ఇచ్చాడు. భోగానికి రోగమే మందు

అన్నట్టు తిండిని ఉద్యమంలా పిచ్చిపట్టినట్టు తినసాగాడు. “తింటే ఆయాసం, తినక పోతే నీరసం”. సమయానికి వైద్యం అందుతుందో లేదోనని మనసులో ఆవేదన మొదలైంది. “ఏ పుట్టలో ఏ పాముందో “ నని సోషల్ మీడియాల్లో వచ్చిన ప్రతి దానిని అనుసరించాడు. ఆనందయ్య అడ్రసు దొరకబట్టుకున్నా వైద్యం ఆపేశారని తెలిసి ఆవేదన చెందాడు. కరోనా వైద్యానికి తెలిసిన వారందరూ డాక్టర్లయ్యారు. వద్దన్నా బోలెడు సలహాలు ఇచ్చేస్తున్నారు. “అందని పళ్ళు పుల్లన”. కరోనా వాక్సిన్ లభించని మిత్రులు మరోలా ప్రచారం చేశారు. ఆందోళనరావు అస్వస్థతకు కారణం వాక్సిన్ అని దుష్ప్రచారం చేశారు.

కరోనా భయానికి ఆందోళనరావు ఎన్ని రకాల మందులున్నాయో అన్నీ వాడేసాడు. వంట్లో ఉన్న కరోనాపై యుద్ధం చేస్తానని భీష్మ ప్రమాణాలు, ప్రయోగాలు చేశాడు. దానితో ఆందోళనపడ్డ కరోనా ముక్కులో నుండి ఊపిరితిత్తులలోకి పాకింది. ఆందోళనరావు పరిస్థితి విషమించింది. మూడు నెలలు సెలవు బెట్టాడు. డాక్టరుగారి సలహామేరకు మందులు తగ్గించాడు. పదిహేను రోజుల్లో ఉపశమించింది. చావు తప్పి కన్ను లొట్టబోయింది. గజేంద్రమోక్షంలో మొసలి పట్టిన ఏనుగుకున్న నీరసం ఆవహించింది.

***

‘తీర్థం, స్వార్థం కలిసొచ్చినట్టు’ ఆందోళనరావుకు కరోనా భయం ‘కలి’సొచ్చింది. భయం గెలుపుకు తలుపు. మూడు నెలలుగా తన పోస్టు ఖాళీ ఉండడంతో ఆ స్థానంలో జంబూక రావును బదిలీచేశారు. మూడునెలల సెలవయిపోయింది. వంటి నిండా నీరసంతో నున్న ఆందోళన రావు ఉద్యోగంలో జాయిన్ అవడానికి దరఖాస్తును బెడితే జంబూక రావు స్థానంలో పెద్ద మార్కెట్ పోస్టింగ్ ఇచ్చారు. ఆందోళన రావుకు దండగలో పండగొచ్చింది. కరోనా పుణ్యాన ఉద్యోగం పెద్దమార్కెట్కి మారింది. ఇప్పుడు జంబూకరావు కారులో భయంకర్ ఉద్యోగానికి వెళుతున్నాడు. పాపం జంబూకరావు...భయంకర్ దెబ్బకు.. కలలో నిద్ర...నిద్రలో కలలా రోజులను ఎల్లదీస్తున్నాడు.

******

**– తంగేడు పక్ష పత్రిక, డిశంబరు సంచిక (2), 2022**

# 11. కాగడ

మాగి పొద్దు. ఎర్రని సూరీడుని నల్లటి చీకటి మబ్బులు ఆకలితో గబుక్కున మింగినట్టు చీకట్లు సూరీడును గట్టిగ అమురుకున్నై. ఊర్లను పట్టిన రజాకార్ల లెక్క మబ్బులు ఇడిసి పెట్టేదెన్నడో. ఎలుగు బయటపడే దెప్పుడో...! మదిల తలబోస్తూ మైబెల్లి సావాట్ల కాంచి ఊరి బయట సీకట్లకు దారి తీసింది. సీకట్ల నుండే ఎల్తురు వస్తది. ఆ ఎల్తురు కోసమని మైబెల్లి ఊరంతా తిరిగిండు. యాడా కాన్రాలే. మైబెల్లికి అరవై ఎనిమిదేళ్ళు. గడ్డం తెల్లబడి, నెత్తిమీద పల్చటి జుట్టుతో, ఒంటిమీద శంశ కండలేకుండా, భుజాలు జారేసి నడుస్తూ ఉంటడు. చినిగిన ముల్లా టోపీ, నవాబు పంచె, రంజాన్ పండుగకు దానమిచ్చిన పాత కుర్తా ఆయన ఆస్తి. కొడుకు మదిల పడ్డప్పుడల్లా పెద్దగా అరుస్తడు. ఊర్లె దయ తలిసిన తల్లి ఎవలన్నా బుక్కడేస్తే తింటడు. లేకపోతే అట్టనే మజీదు కాడ పంతడు. ఆయన మతి మనుషుల్ల లేదు.

మైబెల్లి కొడుకు యాకూబ్. రెక్కలు ముదరకున్నా తిప్పల బడి తండ్రికి యాలకింత జీవి గంజి పోసుకుంటుండు. ఒకనాడు యాకూబ్ పొద్దు గుంజాల మజీదుల నమాజ్ చదువుతుండు. రజాకార్లు పది మంది తుపాకులను భుజానేసుకొని నెత్తురు బట్టలతో ఆడికి వచ్చింద్రు. నుదుట పొడుగు బొట్టుతో ఎదురైన శంకరయ్యను గొర్ర గొర్ర మజీదులకు గుంజుకొచ్చి, రాతితంబానికి కట్టి, సావసావకొట్టి, కాళ్ళు చేతులు కట్టేసి మజీదు వెనకున్న పడావు బడ్డ బాయిలేసి పోయింద్రు. ఆల్లటు పోంగనే యాకూబ్ బాయిల దునికి శంకరయ్యను సావకుండ కాపాడిండు.

గీ ముచ్చటాయింత రజాకార్లకు చేరవేసిండు రజాక్. ఆడు రజాకార్లకు భయపడి పేరు, మతం మార్చుకుండు. ఆడు రజాకార్ల తొత్తు. ఊర్లె ఏం జరిగినా మత్లబు రజాకార్ల కేంపుకు మోస్తడు. యాకూబ్ ముచ్చట తెల్సిన రజాకార్లు కోపంతో వచ్చింద్రు. నమాజు చదువుతున్న పిలగాడి తలకాయను గొడ్డలితో నరికి, చేత బట్టుకొని నడూర్ల నుండి జనానికి సూపిచ్చుకుంట గుర్రాలపై పోయింద్రు. అన్నించి, చీమను సుత సంపి ఎరగని శంకరయ్య ఎర్ర కండువాల్లో కల్సిండు. ఆల్లతో ఊరూరా తిరుగుకుంట ఆట పాట నేర్సిండు.

అయ్యాల పొద్దుగుంజాల సవాట్లకు ఎర్రకండువాలొస్తున్నయని శంకరయ్య

గల్మగల్మకు తిరిగి చెప్పిండు. నలభై ఏండ్లొచ్చినా శంకరయ్య పెండ్లి చేసుకోలేదు. ఊర్ల ఎవ్వరేం పనిజెప్పినా తొలగకుండాజేస్తడు. మెతక మనిషి. ఏనాడు చిన్న పోరన్ని కూడా కోప్పడి ఎరగడు. తనవల్ల రజాకార్లు యాకూబ్ తలకాయ కోసుకపోయింద్రని, మైబెల్లిని కంటికి రెప్పలా కన్న తండ్రిలా చూసుకుంటుండు శంకరయ్య. అయ్యాల కూడా మైబెల్లికి బువ్వతా పిచ్చి సవాట్లకాడికి తీసుకొచ్చి కూసో బెట్టిండు. సభల రజాకార్ల మాట ఇనంగనే మైబెల్లికి కొడుకు యాదిల పడ్డడు. కొడుకుకు రజాకార్లొస్తుంద్రని చెప్పాలని సభ బయటకు నడిచాడు.

సభల రజాకార్ల తిప్పలిరగడైతయని శంకరయ్య చెప్పడంతో జనాలకు గంపడాశ కలిగింది. ఈడేరిన పిల్లల్ని కాపాడుకోవచ్చని సభకు వచ్చింద్రు. ఆడ చెప్పే మాటలకు జనం తకి మికి అయితుంద్రు. సభ మొదలైనాక పొయ్యి మీద కాలే పెంకతోబాటు, ఒత్తుకుండలో నీళ్ళు కూడా మసిలినట్టు, శంకరయ్య పాడేపాటకు, మాటకు అక్కడి జనం కుత కుత ఉడుకుతుంద్రు. కాసేపట్ల మన నాయకుడు మల్లయ్య ఈడకు వస్తడన్న శంకరయ్య మాటకు జనంలో గుసగుసలు ఇన్పించినై. మల్లయ్య పెద్ద లీడరని ఒకలు. నిజాం మీద తిరగబడ్డడని ఒకలు. ఆయన కాడ పెద్దతుపాకి ఉందని, దానితో రజాకార్లందరినీ మట్టుపెట్టగలడని ఒకలు, కాదు.. కాదు ఆయనకు దేవుడు కలలో కనిపించి శక్తినిచ్చిండని ఇలా తలో రకంగా అనుకుంటుంద్రు.

ఇంకోపక్క ఊర్ల కోడెకచ్చు పోరగాల్లు చిడతలందుకొని హనుమాండ్లకాడ జమైనరు. జనమంతా ఆడింత ఈడింత అన్నట్టు, ఊరు ఊరంతా వాళ్ళను చుట్టూ ముట్టిన చీకటితో లడాయి చేస్తుంద్రు. హనుమాండ్ల కాడ 'జై భజరంగ్' గుంపు నాయకుడు యాదయ్య రాగం అందుకుండు.

"దండు కదిలింది ర, జంబాయిరే...

రామ దండు కదిలింది రా, జంబాయిరె...

జై బోలో ససంత్ర బారత్ కి జై!"

కండ్లు పోగొట్టిన దేవుడు, ఇల్లు చూపియ్యక మానడని, దేవునిది పేరు, ప్రజలది పోరు అన్నట్టు అర్ధమ్మ రాత్రుల్లు వాడవాడన తిరిగి పదం, పాదం కలుపుతుంద్రు. నచ్చత్రాలైనా సీకట్లలోనే ఎలుగుతాయి. నడిరేయి దాటినా వాళ్ళు పట్టు ఇడవలె.

***

రజాకార్లొస్తుంద్రు!...రజాకార్లొస్తుంద్రు!...రజాకార్లొస్తుంద్రల్లో......!
మైబెల్లి బజార్లో అర్సుకుంట కాసేపు, ఏడ్సుకుంట కాసేపు అట్లనే ఊరి బయటకు పోతనే ఉండు. ఊరు బయట మైబెల్లి కీచుగొంతుకు సీకట్ల పురుగులు భయపడ్డాయో లేక రజాకార్ల పేరు చెప్పేతోలికి బెదిరిపోయినయో గని, అవి కూడా సడీసప్పుడు చేయకుండా  గమ్మునున్నయి.

***

"ఏమే ఎల్లమ్మా ! నిన్నే...! ఇన్నావా? దున్నపోతు మీద ఆన పడ్డట్టు.. ఉల్కవు పల్కవు. ఏందో... నీతోని నాకు. అనుకుంట గుడిసెనకాలున్న ఎల్లమ్మ కాడకురికిండు లచ్చయ్య. ఆడ మల్లయ్య మావతో ఎల్లవ్వ మాట్లాడుతంది.
"అయ్యా! నాబి కాడ సల్లవడితే, నవాబుకైనా జవాబు చెప్పొచ్చు. జర్ర గింత ఎంగిలిబడి పో...సభ అయిపోయేతలికి ఏయాల్లయితదో! మల్లెప్పుడొస్తవో"
బిడ్డా! నా గురించి యోచన చేయకు. "కొరివి పెట్టేవాడె కొడుకు, కూడు పెట్టేది కూతురు" అన్నట్టు ఆకలి తెల్సుకొని కూడు పెట్టినవు. బతికుంటే మళ్ళా  వస్తా. లేకపోతే ఈ అయ్యను మర్సిపో. చావైనా బతుకైనా ఈ తేప లడాయిలోనే పోవాలి. పెద్ద జంగు ముందలున్నది. చెబ్తిని గా. నీ అవ్వను బలి తీసుకున్న ఆ రజాకార్లను వదిలిపెడతనా?

అయ్యా! గట్టయితే నీతో నన్ను సుత తీసుకబో. నేనొస్త. కుక్కలుండే ఊరికి, నక్కే పోతురాజన్నట్టు ఈ ఊర్లో దోరోనిదే పెత్తనం.
బిడ్డా! ఇంకొన్నాళ్ళు ఓపిక పడితే రాజ్జెం మారతది. అప్పుడు ఈల్లంతా పెత్తనానికి మన కాడికే వస్తరు. అప్పటి దాంక సైసు జర. అయినా 'ఆడది లేంది అడవి, మగాడు లేంది మఠం.' లచ్చయ్య లోక మెరుగనోడు. మనకయినోడు. మొగడనుకోకు. నీ బిడ్డనుకొని కనిపెట్టుకో. ఆనమ్మ నా చేతిల బెట్టి పోయింది." అని ఎల్లమ్మ చేతిల బువ్వముంత తీసుకొని సీకట్లో నిలబడి తాగుతుండు.
ఆడికొచ్చి మావను చూసిన లచ్చయ్య గబాల్న ఇంటి ముంగలకురుకొచ్చి, తడికడ్డమేసి ఎనకాలకు నడిసేసరికి, మల్లయ్య మావక్కడ లేడు.
"పోయిండానే.. మీ అయ్య!"
"హ..ఏమన్నా మాట్లేడేదేమన్నా ఉందా?"
ఏం లేదు. అవతల రజాకార్లొస్తుంద్రని మైబెల్లి పెద్దయ్య మొత్తుకుంట పోతుండు

"పాపం మైబెల్లి మావ. అన్నేలంగా.. ఆ పిలగాన్ని రజాకార్లు పొట్టనబెట్టుకుండ్రు బావా. కొడుకు మతిల పడ్డకాంచి గట్టనే మొత్తుకుంటుండు. అయినా అయ్య గుంపు ఉండంగా... రజాకార్లు రారు లేవయ్యా. అయినా మన దగ్గరేముంది భయపడడానికి?

'ఈ ఎల్లవ్వ అంతా... మావ పోలికే' మదిలనుకుంటూ.. "మడుషులం చాలదానే ఎల్లమ్మా? ఆ రజాక్ గాడు మల్లయ్య మావ ముచ్చట పసిగడితే మొదటికే మోసమైతది. ఇంకో ఊరు చూసుకుందామంటే ఈడ నుండి కదలవు. ఈడ నీ అయ్య రాసిపెట్టినట్టు తంబం లెక్క పాతుకపోతివి.

మా అయ్య చెప్పిండు. రజాకార్లు రాక్షసుల మాదిరి ఊర్ల మీద బడుతుండ్రట. ఆల్ల మీద మన్నుబడ. అయినా 'రాజు నీతి తప్పితే, నేల సారం తప్పదుగా! ప్రజలు తిరగబడే రోజొచ్చింది బావా.

నువ్వెక్కడ మోపైనవే నాకు? దా... గుడిసెలకు పోయి మాట్లాడుకుందాం. సీకట్లకు కన్నూ ఉంటది, చెవులూ ఉంటయి.

అట్లనే పా! అని ఇద్దరూ గుడిసెలకు నడిసిండ్రు.

ఏందాట. మీ అయ్య ఏమో! చెబుతుండు?

నీకన్నీ.. ముచ్చట్లు కావాలె. సావాట్లకు పోయి ఇనరాదు.

నిద్దుర కాయలేను గని, బువ్వతాపి నువ్వే గా ముచ్చటేందో చెప్పరాదు.

ఎల్లమ్మ, లచ్చయ్య బావా మరదల్లు. చిన్నతనం కాంచి ఇద్దరూ కలిసి ఆడుతూ పాడుతూ పెరిగారు. లచ్చమ్మ అంతా నాయిన పోలిక. తెలివైనది. లచ్చయ్య మెతక మనిషి. పెండ్లై ఆరేల్లయినా పిల్లా జెల్లా కలగలేదని అప్పుడప్పుడూ బాదపడే ఎల్లమ్మకు మొగడే పిలగాడయితడు.

బువ్వ ముంతల పోసి, చేతికిచ్చుకుంట చెప్పింది ఎల్లమ్మ...

జంగు జరుగుతదట. జనం కావాలని అయ్య ఈ ఊరికి వచ్చిండాట

అవును ఎల్లవ్వా. ఇయ్యాల ఊర్లకు పోతే ఆడ కూడా జనం శానా ముచ్చట్లను మాట్లాడుకుంటుండ్రు. గీడ రాజ్యం మారుతదట. పేదోడే ప్రభువయితడట. గద్దెనెక్కుతడట. ఇంకా ఏవేవో చెప్పిండ్రు. కనీ.. నాకు పురాగ మతికెక్కలేదు."

అనుకుంట తలకాయ గోక్కుంట, ఆ...అని ఆవులిచ్చుకుంట చెప్పిండు.

ఏమయ్యో ! ఇజ్జరమజ్జర మాట్లాడబడితివి. ఆల్లకు, నీకింకా నిద్దురిచ్చుకోనట్టుంది

ఏందే గట్లంటవ్. చెప్పకబోతే చెప్పలేదంటవ్. చెబ్తే గీ మాటంటవ్!

మనల్ని ఊర్లకే పురాగ రానీయరు. అంటు ముట్టు చూసుకునే ఈ జనం మనల్ని గద్దెనెక్కనిస్తరా?

అవునే ఎల్లవ్వా, మనకు మంచి రోజులొచ్చినట్టే. నా ఈ మాట కాయం చేసుకో. అమాయకంగా అంటున్న మొగన్ని చూసి నవ్వుకుంది ఎల్లమ్మ.

అంత నమ్మకంగా మొగడు చెప్పేతోలికి, తెల్వని దానిలెక్క ఎల్లమ్మ కండ్లు పెద్దగ జేసుకొని, నోటి మీద చెయ్యి పెట్టి, అరచేత బుగ్గల్ని నొక్కిబట్టి, గుస గుసగా మల్లోపాలి అన్నది. నిజమేనానయ్యా? మనం గద్దె నెక్కే కాలమొస్తదా?

అవునే ఎల్లవ్వా. ఇంగ దోరోనికి వంతు పోవద్దట. ఎవని భూములల్ల వాడే చెమట తీయాలనట. ఇంకో మాట సుత చెప్పింద్రు. రజాకార్లు రాజ్జెం గుంజు కోవాల్నని చుస్తుంద్రట. అదిడిపిచ్చి మనమే ఏలాలని ఎర్ర కండువాలు, జై భజరంగ్ దళం జంగు చేస్తుంద్రట.

ఏ...ఊకోవయ్యా. నాకైతే నమ్మకం లేదు. ఆడు రాజ్జెం వదలడు. ఈళ్ళు మనకిచ్చేది లేదు. అది జరిగేటిది కాదులేయ్యా.

ఆనబడితే ఆగుల నీల్లాగుతాయే? కాలం ముందుకురికితే మనుషులు నిలుస్తరా? ఏందే నీ ఎక్కిరింపు. నాకేం తెల్వదనేనా?

మొగని కోపానికి ... అట్లా కాదయ్యా, కాలం మారితే మనిషి మారుతడేమో గని, ఆశ మారదయ్యా. ఇది పేదోనికంటే పెద్దోనికే ఎక్కువుంటది. ఎంత కలిగితే అంత ఆశ. అయినా సవాట్లకాడికి యెంత మంది రాలేదు. ఎర్రకండువాలొచ్చినై, పోలీసులొచ్చింద్రు, కాగ్రీసోల్లొచ్చింద్రు, జై భజరంగ భళీ గుంపొచ్చింది. ఆల్లదంతా ఒక్క మాటే. పెద్దోల్లనుండి పేదోళ్ళను రచ్చిస్తమని. పేదోనికి రచ్చన మాట దేవుడెరుగు. ముందు వాళ్ళల్లో వాళ్ళే కొట్టుకుంటరు. ఆ కొట్లాటకు మనల్ని రమ్మంటారు. గొడ్లు గొడ్లు కొట్టుకొని, లేగదూడల తొక్కి చంపినట్టు ఆ తొక్కిసలాటల పేదోని పానమే బలయితది బావా. వీలదంతా ఎట్లా ఉందంటే..."లోక మేట్లుంటది రా సిద్దా? అంటే, ఎవరి లోకం వాళ్ళదే గురూ!" అన్నట్టు అంతా కలిసి ఎవలికి వాళ్ళు జనాల మీద పడ్తరు. అంతట్లనే మంచిగైతరు. అయినా గిదంత ఏపీటికి ఎర్కేనా?

ఏమో ! నువ్వే చెప్పు. నువ్వు ఇకమతు తెల్సిందానివి.

ఏవీటికంటే రాజ్జెం కోసం. అతికారం కోసం. ఉన్నోని మీద కాదు. లేనోని మీద పెత్తనం కోసం. ఆల్ల నీతి ఒకటే ఉంటది. ఆల్లకాల్లకు కంటూ ఉండదు, అంటూ ఉండదు. అయినోనికి, పరాయోనికి దుష్మన్ పేదోడేనాయె.

నువ్వెందే! అందరినీ ఒక్క గాటన కడ్తావ్. ఇంగ్లీషోడి రాజ్యంల ఆజాద్ కోసం లడాయి జరుగుతుందట. ఆల్లతో బాటే మనకూ ఆజాద్ తేవాల్నని పెద్దోల్లు కొట్లాడుతుంన్రని అందరనుకుటుంన్రు. నువ్వేమో ఆల్లు మన ఆజాది కోసం కాదు పెత్తనం కోసమనబడితివి. అయినా మీ అయ్య కూడా ఆ గుంపులల్లనే తిరుగుతడాయే.

అవునయ్యా! కోట్లాడేటప్పుడు మా అయ్యలాంటోల్లే ముందు బడ్తరు. పోరు గెల్సినాక గద్దెనెక్కేది వాళ్ళే. ఒకవైపు రజాకార్లు జనం పచ్చి నెత్తురుకు మరిగింన్రు. వీళ్లేమో ఒకలంటే ఒకలు పెత్తనానికి పోటీపడ్తుంన్రు.

ఎంతయినా నీకు శానా తెలివుందే. మల్లయ్య మావకు పావురంగల్ల బిడ్డవైతివి. అయితామగని ఈ రజాకార్ల గోడవెందే ఎల్లమ్మా?

రజాకార్లంటే ఎవరనుకున్నవు బావా? దోసుకబోయే గుండాల దొంగలు. నరరూప రాచ్చసులు. ఊరూరా జనం పడే గోస చూస్తుంటే, కడుపు తరుక్కపోతంది తెలుసా? అందుకే నేను సుత జంగు చేస్తానంటే అయ్య వద్దన్నడు.

ఏంకాదు లే ఎల్లవ్వా. ముందు ముందు అన్నీ మంచి రోజులొస్తయని మొన్న సవాట్ల కాడ ఎర్ర కండువాలు చెప్పినాయి కదే!

ఏంరావు బావా. పేదోనికి మంచిరోజులు ఆకాశంలో ఉంటయి. అయి ఎగిరినోనికే అందుతయి. ఊకున్నోనికి యాడందుతై. అన్నేలంగా ఆ మైబెల్లి పెద్దయ్య కొడుకు యాకూబ్ ను పొట్టన బెట్టుకునే. అయినా ఈ రాచ్చాసులను కూడా ముందు ముందు పూజించే రోజులొస్తాయేమో! అప్పుడాల్లకు సుత గుడి కడ్తరేమో!

ఏందే గట్టనబడ్తివి? ఈ రాచ్చాసులనెదుర్కునే సత్తువ లేదాయే మనకు?

గిప్పుడు ఊరూరా కోడెకారు పోరగాండ్లంతా గ్రామ రక్షక దండనే పేరుతోని ఏవాడ కా వాడ రాత్రిళ్ళు కంటికి రెప్పలా కాచుకొని ఉంటుంన్రు. గీ పోరగాండ్లు, ఎర్ర కండువాల అదురుకు రజాకార్లు ఈ దిక్కు చూస్తల్లేరుగని.. లేకపోతెనా... ఈ ఊరెన్నడో వల్లకాడయ్యేది. అయినా ఆ రాచ్చాసులు నెత్తురు మరిగి మనల్ని దొంగ దెబ్బ తీస్తూనే ఉంన్రు.

ఈ రజాకార్లు యాడ పుట్టింన్రే ఎల్లవ్వా?

ఏమో! నా మదికి తోసిన ముచ్చట చెబుతున్నా. రజాకార్లు ఈడున్న ఊరి జనంలోంచే కాదా వచ్చింది? ఉన్నమాటంటే ఊరి కచ్చిరాదంటరు. అయినా ఊరే లేనోళ్లం, ఇంగ అచ్చిబాటు యాడ చెప్పు? అంతా గాలి బతుకులను ఏలేట్టి సూపిస్తారు. ఎవని అక్కెరకి వాడు. ఈ జనాలకు అల్కగ మనమే కనబడ్తం. జనంతోటి మనిషిని బతకనీయకుండా ఊరికి దూరంగా నెట్టిరాయె. నిలువ నీడలేక, కడుపుకు బువ్వలేక, మాట్లాడే మనిషి లేక ఈ సంచారి బతుకు ఎన్నాళ్ళు బావా? అడుక్కుతినే బతుకూ... ఒక బతుకేనా? ఆమాటలకు పీటమీద పెట్టిన గుడ్డి దీపంత తలకాయ దించుకొంది. కన్నీరు కారుస్తున్నట్టుంది. చీకట్లో కూడా తళుక్కుమని మెరుస్తున్నాయి ఆ కళ్ళు.
అవునే, గని ఈళ్ళు పోయి ఆ రజాకార్లతో కల్సుడు ఒప్పయితదా? 'చెట్టును నరికి పండ్లు దానం చేసినట్టు' ఈ జనం రజాకార్లల్ల కల్సుడు ఒప్పయితదా? అయినా నాకు తెల్వకడుగుతా గని, ఎవడో ఒక్కడు కల్సిండని, అందరూ గట్టనే ఆల్లతో కలిసింద్రానే? గా మతం మారిన రజాక్ గాని ముచ్చటేగా నువ్వు చెప్పేది.
ఆడొక్కడనే కాదు. అంతటా గదే కన్పడతంది. మేమేం అన్నెం పున్నెం ఎరగమని సగం మంది జాగిర్దార్లు, పశుపతులు, భూపతులంతా దొరల మీద పెత్తనం కోసం కాంగిరేసు రాజకీయంల కల్సింద్రు. పటేల్ తోలిన సేన నిజామోన్ని తరుముకుంట వస్తుంద్రంట. ఈడ జనాన్ని అడ్డేసి దాన్నాపాలని, జంగు చేయాలని రాజుగారి హుకుం వచ్చిందట. కానీ రజాకార్లు ఊర్ల మీదపడి, అందిన కాడికి దోసుకొని పక్క దేశం పారిపోవాలని చూస్తున్నరాయే.
కాంగిరేసోల్లు కాపాడొచ్చుగా మరి!
ఎంత అమాయకుడివి బావా. ఇంకెక్కడి కాంగిరేసోల్లు. పుట్టలో పాలు పోసి, పొట్ట చూసుకున్నట్టు, ఊరూరా మా రాజ్జెం మాకు కావాలని తిరిగింద్రు. రజాకార్ల దెబ్బకు బెదురుపోయి, నిజాం రాజ్జెమొదిలి రేపాలకు పారిపోయింద్రని అయ్య చెప్పిండు. కానీ ఆల్లు పారిపోలేదు. ఆడనుంచి సేనను నడిపించడానికి పోయింద్రని, దేశానికి సొసంత్రం తెచ్చేది ఆల్లేనే పిచ్చిమొగమా! అని చంద్రక్క చెప్పింది. నిజం దేవికెరుక. పేదోన్ని దోచుకుంటుంద్రని దొరలను జనాలు తరిమితే, వాళ్ళను రజాకార్లు తరుముతుంద్రు. రజాకార్లను ఎర్ర కండువాలు, వాళ్ళను పటేల్ సేన తరుముతుంది. ఆ ఊరు కన్నా ఈ అడవే మేలు బావ.
అయితే రాజ్జెం మారతది కదా ఎల్లవ్వా. మనకు అతికారం మొస్తదాయే? ఆశతో

అడుగుతున్న బావ మొఖంలోకి చూసింది ఎల్లవ్వ. గుడిసెలో గుడ్డి దీపం కూడా చిన్న బోయేటట్టు బావ మొకం ఎలిగిపోతంది.

ఏంది బావా! నీ పిచ్చిగానీ...ఈయాల, అతికారం కోసం అంతా.. కుప్ప కావలి కూసుంటే, ఇంక నీకెక్కడ వస్తది. అయినా మన బతుకులు ఊరవతల నుండి ఊరికి మారితే చాలు. అదే పదివేలు. అతికారంల దుష్మన్ యొక్క దోస్తు, దోస్తే... దోస్తు యొక్క దోస్తు దోస్తే. అతికార మొచ్చేదాక ప్రతోడు ఆల్లకు దోస్తే. అది దక్కాక అంతా దుష్మన్ లే. అయినోళ్ళు కానోల్లయితరు. కానోల్లు అయినోల్లయితరు.

వాళ్ళు వాళ్ళు కొట్టుకొని చావక మన తెరువెందుకొస్తున్నారే మరి? ఈ జంజాటమేంది మనకు?

సరే! బాగుంది నీ కత. వచ్చేది రాజుల జమానా కాదు. జనం జమానా. గందుకే ప్రజలకు రచ్చన ఇయ్యడానికి పోటీ పడ్తున్నరు. మన కాడ ఏముందన్నవ్ కదా. మన కాడ ఆల్లను అతికారంలోకి తెచ్చే ఆట, మాట, పాట అన్నీ ఉన్నై. ఆయన్నీ అతికారంలకు రావడానికి ఆల్లకు కావాలె. ఆయుధం పోయింది. ఇయ్యాల పాట ఆయుధం, మాట ఆయుధం.

“రజాకార్లొస్తుంద్రు! ...రజాకార్లొస్తుంద్రు! ...రజాకార్లొస్తుంద్రల్లో......!

మైబెల్లి పెద్దయ్య గొంతు మల్లోపాలి ఇనబడ్డది.”

ఎల్లమ్మ చెవులు పెద్దగ జేసి విన్నది. కండ్లు పెద్దగయినై. నిజంగనే....మైబెల్లి పెద్దయ్య చెప్పినట్టు... దూరంగా... గుర్రాల అడుగుల సప్పుడినబడ్డది. సావాట్ల కాంచి వస్తున్నట్టున్నై. లచ్చయ్య గుండె దడ దడలాడింది. ఎల్లమ్మ గబుక్కున లేశి, మూలనున్న గడ్డపారందుకుంది. ఇంతట్లనే గుర్రాల సప్పుడు దగ్గరైంది. మైబెల్లి గొంతు కంగున హెచ్చరిస్తుంది. రజాకార్లొస్తుంద్ర....ల్లో......! గొంతులో మాట బయట పడక ముందే మైబెల్లి తల ఎగిరి గుడిసె ముందు పడ్డది. గుర్రాల అడుగులు దూరమైనంక ఎల్లమ్మ చెయ్యి వదిలిండు లచ్చయ్య. ఇద్దరూ బయట కొచ్చి దీపం పెట్టి చూస్తే, మైబెల్లి మొండెం ఏదో చెప్పాలని ఆరాటపడుతుంది. ఆ ఊరితలను కొట్టి పోతున్న రజాకార్లనేటాడుతూ ఎనుకే వస్తున్న కాగడాల ఎలుతురులో చీకటి చచ్చి పోయింది. అదే ఎల్తురులో కలిసిపోయారు లచ్చయ్య ఎల్లమ్మ దంపతులు.

******

## 12. బ్యాడ్ టచ్

ఎనిమిదో తరగతిగది. విద్యార్థులు కొత్త బయాలజీ టీచరు కోసం ఆసక్తిగా ఎదురుచూస్తున్నారు. పాత టీచరు బదిలీపై వెళ్ళి చాలాకాలమైంది. ఇంతలో కొత్త బయాలజీ టీచరు రానే వచ్చింది. పిల్లలంతా లేచి 'గుడ్ మార్నింగ్ మేడం' అని ఒక్కసారిగా వందనం చేశారు. టీచరు చిరునవ్వుతో "కూర్చోండి పిల్లలు" అంది. పిల్లలంతా కూర్చున్నారు. అందరిలో ఉత్కంఠ. పిల్లలంతా టీచరునే గమనిస్తున్నారు. ఆమెను చూస్తుంటే అందరికీ పాత టీచరే గుర్తుకొస్తుంది. ఆ టీచరు పిల్లలతో చాలా సన్నిహితంగా ఉండేది. ప్రతీ ఒక్కరిని పేరుపెట్టి పిలిచేది. చదువులో వెనుకబడితే ఇంటికి పిలిపించుకొని మరీ అర్థం అయ్యేలా చెప్పేది. పిల్లలంతా ఆలోచనలో ఉండగానే, కొత్త టీచరు గొంతు సవరించుకుంది. తరగతి గదినంతా పరిశీలిస్తూ, "విద్యార్థులూ! నా పేరు సుహాసిని. నేను బయాలజీ చెబుతాను. ఇక మీరంతా ఒక్కొక్కరుగా నిలబడి, మీ పేరు చెప్పి, పెద్దయ్యాక జీవితంలో ఏమవ్వాలని ఉందో చెప్పండి". అంటూ ముగించింది. టీచరు ముఖంలో గాంభీర్యంతో బాటు పాత టీచరులా నవ్వు మొఖం కొట్టొచ్చినట్టు కనబడడంతో పిల్లలు ఊపిరి పీల్చుకున్నారు.

తరగతి గదిలో ఎప్పుడూ చురుగ్గా ఉండే రజిత ఉత్సాహంగా లేచి నిలబడింది. ఆమె ఎత్తులో పొడుగ్గా ఉన్నా, చదువు మీద ఆసక్తితో మొదటి బెంచీలో గోడవైపు కూర్చుంటుంది. "నా పేరు రజిత. నేను డాక్టరు కావాలనుకుంటున్నాను" అంది. విద్యార్థులంతా రజితవైపు ఆసక్తిగా చూశారు. ఎందుకో సుహాసిని టీచరు కూడా తదేకంగా ఆ అమ్మాయినే చూసింది.

"వెరీగుడ్, నెక్స్ట్" అంది సుహాసిని మేడం.

"నా పేరు చందు. నేను పెద్దయ్యాక లాయరు కావాలనుకుంటున్నాను మేడం." "నా పేరు లావణ్య. నేను టీచరును కావాలనుకుంటున్నాను" ఇంకొకరు. అలా తరగతిలో విద్యార్థులంతా తమ లక్ష్యాన్ని ఒక్కొక్కరుగా చెబుతుంటే, మిగతావారంతా ఆసక్తిగా వింటున్నారు. ఆ తరగతి గదిలో అబ్బాయిలున్నా, అన్నింటా పైచేయి అమ్మాయిలదే. ఒకరి తరువాత మరొకరు పోటీబడి తమ లక్ష్యాన్ని ఉత్సాహంగా చెబుతున్నారు. 'ఈ పాఠశాల మారుమూల గ్రామీణ ప్రాంతంలో ఉంది. మరిక్కడి పిల్లలు తమ భవిష్యత్తుపై ఇంత స్పష్టత కలిగి

ఉన్నారేంటి?' ఆశ్చర్యపోతూ మనసులో అనుకుంది సుభాషిణి.

విద్యార్థులంతా తమ లక్ష్యాన్ని చెప్పడం అయిపోయింది. సుహాసిని రజితనే పరీక్షగా చూస్తుంది. ఆలోచనలో పడింది. ఆమె ఆలోచనల్లో ఉండగానే, "టీచర్! చిన్నప్పుడు మీరేం కావాలనుకున్నారు?" రజిత ప్రశ్నకు ఈలోకంలోకి వచ్చింది. తదేకంగా రజితనే చూస్తూ, "నేను చిన్నప్పుడు టీచరునే అవ్వాలనుకున్నాను. టీచరునే అయ్యాను. మీరు కూడా మీ లక్ష్యాన్ని సంకల్పంగా మార్చుకోవాలి. అర్థమైందా?" అని పాఠం మొదలు పెట్టింది. పిల్లలూ! మొక్కలకు కూడా స్పర్శ ఉంటుంది తెలుసా? అనగానే పిల్లలంతా ఆశ్చర్యంగా చూశారు. మొక్కలలో 'షేం ప్లాంట్స్' అదే అత్తిపత్తి అనేవి ఉంటాయి. వాటికి ఇతరులు ముట్టుకోవడం అసలు ఇష్టం ఉండదు." అని బోర్డు మీద బొమ్మ వేసి, తన బ్యాగులో నుండి ఆ చెట్టు తీసి చూపించింది. దానిని అందరికీ ఇచ్చి, దాని గురించి వివరించింది. టీచరు చెబుతుండగానే గంట మోగింది. "పిల్లలూ! ఇక మనం రేపు కలుద్దాం" అని తరగతి బయటకు నడిచింది సుహాసిని టీచరు. పిల్లలంతా పాఠం ఆసక్తిగా ఉండడంతో, అప్పుడే బెల్లయిపోయిందే! అని నిరాశగా పుస్తకం మూసేశారు. భోజనం గంటవరకు వాళ్ళ ఆలోచనలన్నీ బయాలజీ మేడం చూపించిన చెట్టు మీదే ఉంది.

***

భోజన విరామంలో పిల్లలంతా మధ్యాహ్న భోజనాన్ని పళ్ళెంలో తీసుకొని వేప చెట్లకింద కూర్చున్నారు. పిల్లల భోజనానికి ఆశపడే కాకులు, గద్దలు, కుక్కలూ, కోతులు పాఠశాల ప్రహరీ గోడ వద్దే కాచుకొని ఉంటాయి. వాటికి హెడ్ మాస్టర్ కాపలా లేకపోతే, ఆ మెతుకులన్నీ వాటి పాలే.

"ఇక్కడికి రా చందన్నయ్యా! ఇక్కడ చెట్టు నీడ చాలా ఉంది." పిలిచింది రజిత. ఇద్దరూ ఒకే తరగతి. దూరం బంధువులు. వరుసకు అన్నా చెల్లెళ్ళవుతారు. "రజితా..! బయాలజి మేడం చాలా బాగా చెప్తుంది కదా ?" అంటూ రజిత దగ్గరికి వచ్చి కూర్చున్నాడు చందూ.

"అవును అన్నయ్యా , నాకు బయాలజి అంటే చాలా ఇష్టమని నీకు తెలుసుగదా! " అన్నది రజిత.

"రజిత, బయాలజీ అంటే నీకంత ఇష్టం ఎందుకు?"

"నాన్నకు సరైన వైద్యమందక నా చిన్నప్పుడే చనిపోయాడట. పెద్దయ్యాక నేను

డాక్టరునవుతా. మనలాంటి పేదవాళ్ళకు పైసా తీసుకోకుండా ఉచితంగా వైద్యం చేస్తానన్నయ్యా..” రజిత గొంతు బొంగురుపోయింది. ఆమె కళ్ళల్లో నీటిపొర వానా కాలం చెరువులా నిండుగా కన్పించింది. అది చూసి,“అవుతావులే రజిత, అన్నం తిను ముందు. బెల్లు కొడుతారు. ఆడుకుందాం.” మాట మార్చాడు. మధ్యాహ్న భోజనం పెట్టించి, తన రూంకు వెళ్తున్న హెడ్ మాస్టర్ చెవిలో ఆ పిల్లల మాటలు పడ్డాయి. “చిన్న వయసులో పెద్దరికాన్ని పేదరికమే నేర్పుతుంది” అనుకున్నాడు. గబగబా అన్నం తిని పళ్ళెం కడగడానికి లేచిన చందూతో, రజిత “నువ్వెళ్ళు... నే వస్తాలే అన్నయ్యా” అంది.

“ఆటల మోజులో ఉన్న చందూ, సరే అంటూ అక్కడి నుండి కదిలాడు. రజిత గబగబా అన్నం తిని తరగతి గదివైపు నడిచింది. తన స్థానంలో కూర్చొని గణితం క్లాసుకు సంబంధించిన పుస్తకాలు తీసి జరగబోయే పాఠాలను, అభ్యాసాలను చూస్తుంది. “ఆటకు రమ్మని చందూ వచ్చి పిలిస్తే,” రానని చెప్పింది”.

ఇంకా బెల్లు మోగలేదు. ఈలోగా అరవతరగతి అమ్మాయి వచ్చి, “రజితక్కా! నిన్ను బయాలజి మేడం పిలుస్తుంది” అని చెప్పగానే, కళ్ళు పెద్దవి చేసి ఆశ్చర్యంగా.. “ ఎందుకూ ..?” అంటే, “ఏమో!? నాకు తెలియదు..కానీ త్వరగా రమ్మంటుంది. టీచరు త్వరగా అని చెప్పకున్నా, తన మాటను కలిపి చెప్పింది ఆ అమ్మాయి. తరువాత అక్కడనుండి ఆటలకోసం మైదానం వైపు తుర్రుమంది. చందు కోసం చూస్తే మైదానంలో ఎక్కడా లేడు. మైదానం వెలుపల రోడ్డు దగ్గర ఆడుకుంటున్నాడు కావొచ్చు అనుకుంది. స్టాఫ్ రూమ్ కు ఒంటరిగా వెళ్ళాలంటే బెరుకు కలిగింది. అసలే కొత్త టీచర్లు. వాళ్ళంతా అక్కడే ఉంటారు. భయంభయంగా అక్కడికి వెళ్ళింది రజిత. గుమ్మం దగ్గర ఆగి, “లోనికి రావొచ్చా మేడం !” అని అనుమతిని అడిగింది. బయాలజీ మేడం నవ్వుకుంటూ గుమ్మం దగ్గరికి వచ్చింది. రావడంతోనే భుజంపై చేయివేసి హత్తుకుంది. “ఈ అమ్మాయి, అచ్చం మా అన్నయ్య కూతురులా ఉంది కదా మేడం..చూడండీ..” అంటూ అక్కడి టీచర్లకు చెబుతూ పర్సులో నుండి ఫోటో తీసి చూపెట్టింది. “నిజమే! ఆ అమ్మాయి అచ్చం అలాగే ఉంది. సినిమాలో చూపినట్టు.” మనసులో అనుకుంది. తనతోబాటు అక్కడున్న వారందరూ ఆశ్చర్యపోయారు. అప్పటి నుండి రజిత, సుహాసిని మేడం మానసికంగా బంధువులయ్యారు. రజితపై మేడంకు ప్రత్యేక ఆసక్తి, బయాలజీ అంటే రజితకు

ఇష్టం పెరిగింది.

***

రజిత వరుసగా ఐదురోజులుగా బడికి రావడంలేదు. పబ్లిక్ పరీక్షలు దగ్గర పడుతున్నాయి."రజిత బడికి ఎందుకు రావడం లేదు? ఏమైంది చందూ?" బయాలజి మేడం అడిగింది". "కారణమేంటో నాకు తెలియదు మేడం. వాళ్ళు మాకు చుట్టాలయినా, వాళ్ళింటికి పోవద్దని మా అమ్మ చెబుతుంది. ఈరోజు సాయంత్రం వాళ్ళింటికి పోయి, కారణం కనుక్కుంటాను" చెప్పాడు చందూ. ఆలోచనల్లో పడింది సుహాసిని. 'రజిత చాలా చురుకైన అమ్మాయి. జ్వరం వచ్చినా బడికి హాజరవుతుంది. అలాంటిది ఎందుకు రాలేదు?'. కనుక్కొని రమ్మని మరోసారి చందుకు చెప్పింది. సాయంత్రం రజిత ఇంటికి వెళ్ళాడు చందు. గుమ్మం బయట నిలబడి "రజిత.. ఓ..రజితా" అంటూ గట్టిగా పిలిచాడు. చాలా సేపటి తరువాత లోపలనుండి వాళ్ళమ్మ తలుపు తీసుకొని బయట కొచ్చింది. "ఏంది చందూ!" అనడిగింది. రజిత బడికి రావడం లేదు. ఏమైందో బయాలజీ టీచరు కారణం కనుక్కని రమ్మంది" అని చెప్పాడు చందు. "రజిత ఒంట్లో బాగాలేదు, నాల్రోజులయ్యాక వస్తుందని చెప్పు నాన" అని చెప్పింది. "ఏమైంది చిన్నమ్మా ?" అడిగితే రజిత వాళ్ళమ్మ బదులియ్యలేదు. లోపలికిపోయి గట్టిగా తలుపేసుకుంది. ఇక అక్కడ నుండి ఇసూరుమంటూ కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి బయల్దేరాడు.

రజిత ఇల్లు ఊరికి దూరంగా, బైపాస్ రోడ్డుకు దగ్గరగా ఉంటుంది. రజిత వాళ్ళ అమ్మ అక్కడ ఒక చిన్న టీకొట్టు నడుపుతుంది. బయాలజి మేడం చెప్పిందని అంతదూరం వెళ్ళినా, సరైన సమాధానం దొరకకపోవడంతో నిరాశగా వెనుదిరిగాడు చందు.

***

పదిహేను రోజుల తరువాత రజిత బడికి వచ్చింది. ముఖంలో కొత్త కళ వచ్చింది. ముందటిలా గబాగబా మాట్లాడడం లేదు. బయాలజి మేడం అర్థం జేసుకుంది. మరుసటి రోజు రజిత కోసం బ్యాగులో పెట్టుకొని, కొన్ని తీపి పదార్థాలను తీసుకొచ్చి ఇచ్చింది. రజిత వాటిని చాలా ఇష్టంగా తిని, టీచరుకు కృతజ్ఞతలు చెప్పింది. కాలంలో వచ్చినట్టుగానే రజిత మాటలో, మనిషిలో మార్పులు వచ్చాయి. ఆ అమ్మాయికి అత్తి పత్తి చెట్టు ఎందుకలా ముడుచుకుంటుందో మెల్లగా అర్థం

కాసాగింది.

మధ్యాహ్నం రెండో పీరియడ్. టీచరు సెలవు పెట్టడంతో, తరగతి గది బాధ్యత లీడర్ కొచ్చింది. పరీక్షలు దగ్గర పడడంతో విద్యార్థులంతా పుస్తకంతో కుస్తీ పడుతున్నారు. కిటికీ బయట నుండి బడికి పెద్ద వ్యాను రావడం కనిపించింది. పిల్లలంతా చదవడాన్ని ఆపి అటే చూశారు. అందులో నుండి తెల్లకోటుతో నలుగురు మహిళలు దిగారు. రజితకి ఆసక్తి పెరిగింది. ఆ డ్రెస్ అంటే తనకు ప్రాణం. టీచరు దగ్గర దిద్దిన నోట్సు తీసుకు వస్తానని చెప్పి బయటకు వెళ్ళిన చందూ పరిగెత్తుకుంటూ తరగతికి వచ్చాడు." ఆ డాక్టర్లు మనతో మాట్లాడడానికి వచ్చారట"అని చెప్పాడు. "నట్టల మందు ఇస్తారేమో!?" అంది రజిత. "కాదు కాదు. మనకేవో ముఖ్యమైన విషయాలు చెబుతారట. బయాలజీ మేడం చెప్పింది" రజిత మరియు అక్కడి పిల్లల ఆసక్తిని చందు ఇంకా పెంచాడు.

పెద్దాహాలులో కార్యక్రమం మొదలైంది. పిల్లలందరినీ అక్కడ కూర్చోబెట్టారు. సభ మీదకు అందరినీ బయాలజి మేడం ఆహ్వానించింది. తరువాత పెద్దడాక్టరు మేడం ఉపన్యాసం ప్రారంభించింది. ముందు వరుసలో కూర్చొని ఉన్న రజిత శ్రద్ధగా ఆసక్తితో వింటుంది.

"అందరికీ నమస్కారం". "పిల్లలూ.. నేనొక ప్రశ్న అడుగుతాను చెబుతారా?". "మీకు, గుడ్ టచ్, బ్యాడ్ టచ్ అంటే అర్థం తెలుసా?' పిల్లలవైపు నిశ్శబ్దం."పిల్లల శరీరంను వారి అనుమతి లేకుండా ఇతరులు తాకరాదు. మన శరీరంలో అభ్యంతరకర ప్రదేశాలలో ఎవరైనా తడమడం చట్టరీత్యా నేరం. అని చెప్పి, దగ్గరి బంధువులు లేదా కొత్తవారు మన శరీరంలో తాకగూడని ప్రదేశాలు ఇదిగో చూడండి" అని చార్టును జాగ్రత్తగా ఒకటికి రెండుసార్లు చూపుతూ వివరించింది. అనుచితంగా శరీర భాగాలను తాకడం వలన కలిగే బాధను లోతుగా చెప్పింది. రోజు సీతాకొక చిలుకలతో ఆడే పిల్లలంతా, వాటి రెక్కలను తాకుతూ ఉన్నప్పుడు , అవి పొందే బాధను సహానుభూతి చెందారు. ఇకపై అలా వాటిని బాధపెట్టరాదని నిర్ణయించుకున్నారు.

డాక్టరు మేడం ఉపన్యాసం పూర్తయింది. తరువాత మరొకరు మైకునందుకున్నారు. "విద్యార్థులూ! మన శరీరంలోని నిషేధిత ప్రదేశాలను కావాలని తాకినపుడు, మీకు చట్టపరమైన రక్షణ ఉంటుంది. దానిపేరే పోక్సో చట్టం" అని

చెప్పారు. కొత్త విషయాలు చెబుతున్న వక్త మాటలు రజిత మెదడులో ఎన్నో సందేహాలను రేకెత్తించింది. కానీ అంతమందిలో మాట్లాడడానికి ఇష్టపడలేదు. 'బ్యాడ్ టచ్. అవును...అది బ్యాడ్ టచ్...అది తనకు బాగా తెలుసు. కానీ ఎలా చెప్పాలి...!? అమ్మ ఏనాడు నాకు దీని గురించి చెప్పలేదేం. కార్యక్రమం ముగిసింది. ఒంటరిగా కలుసుకునే అవకాశం వాళ్ళు ఇచ్చారు. అయినా రజితకు కొత్తవారి దగ్గరకు వెళ్ళాలన్పించలేదు. ఇంటి గంట మోగడంతో పిల్లలంతా పుస్తకాలు తీసుకొని ఇంటికి హడావుడిగా బయల్దేరారు. రజిత కూడా సందేహాలతోనే ఇంటికి పయన మయ్యింది. రోజూ పుస్తకాలు బరువన్పించేవి. కానీ ఆ రోజు ఎడతెగని ఆలోచనలతో మనసు బరువెక్కింది.

***

ఇంటిముందు లారీ వచ్చి ఆగింది. "రజితా... లోపల అమ్మ ఏంజేస్తుంది?" చనువుగా అడిగాడు నారాయణ బాబాయి. అప్పుడప్పుడు ఇంటికొస్తాడు. అమ్మ అతన్ని బాబాయని పిలువమంటే, చిన్నప్పటి నుండి అలాగే పిలుస్తుంది. బాబాయి ఎప్పుడొచ్చినా తమ్ముడికి తనకు కొత్త బట్టలు, తినుబండారాలు తీసుకొస్తాడు. చాలా రోజులైంది బాబాయిని చూసి. ఈమధ్య రావడం లేదు. "లోపలుంది బాబాయి" అన్నది. తలుపేసి ఉండడంతో బయట మంచం మీదే కూర్చున్నాడు. ఈలోగా తలుపు తెరుచుకుంది. లోపలినుంచి రాములు బాబాయి బయటకొచ్చాడు. వస్తూ "ఇదిగో .." అని అమ్మను పిలిచాడు. అమ్మ లోపల నుండి గబగబా వచ్చింది.

ఆమె ముఖంలో పొయ్యి దగ్గర కూర్చున్నట్టు, చెమటలు, అలసట బాగా కనపడుతుంది. ఆమె సంసారంలాగే మొఖంలో జుట్టు, బొట్టు చెదిరిపోయి ఉంది. రాములు బాబాయి జేబులో నుండి తీసిన కొన్ని ఐదువందల నోట్లు అమ్మ చేతిలో పెట్టాడు. రాములు బాబాయి ముఖంలో గర్వం, అమ్మ మొఖంలో ఆనందం కనబడింది. నారాయణ బాబాయి వైపు తిరిగి మీసాలు దువ్వుకుంట అక్కడి నుంచి కదిలాడు. నారాయణ బాబాయి మొఖంలో ఒక వికృత ఆలోచన పుట్టినట్టుంది. మంచం మీద నుంచి విసురుగా లేచిన నారాయణ బాబాయి లారీ దగ్గరకు పోయి వెంటనే తిరిగొచ్చాడు. అతని చేతిలో మద్యం సీసా ఉంది. వెంటనే తలుపులు ముసుకున్నాయి.

ఈలోగా వచ్చిన వాళ్లకు టీ అమ్ముతూ, అన్నం వండేసింది రజిత. వాళ్ళంతా

చిన్నప్పటి నుండి చూస్తున్నవాళ్ళే. ఆ తలుపు అలా ముసుకోవడం, తెరుచుకోవడం రజితకు చూసి, చూసి అలవాటైంది. తలుపు వెనుక తపనలు తెలియని వయసు. వయసుకు తగిన ఎదుగుదలలేని లోకం తెలియని పిల్ల.

రాత్రి అన్నంలోకి అమ్మ కోడికూర వండింది. తమ్ముడు కూర ఉడికేంతవరకూ ఆకలికి ఆగలేక పచ్చడిమెతుకులు తిని పడుకున్నాడు. వాళ్ళతో బాటు అన్నం తిని ఆరాత్రి అక్కడే పడుకున్నాడు నారాయణ బాబాయి. తెల్లారింది. ఆరోజు ఆదివారం. స్నానం చేసొచ్చిన బాబాయికి, అమ్మకు ఏదో గొడవ మొదలైంది. రజితకు ఆ గొడవేంటో అర్థం కాలేదు. రజిత పగలంతా టీ స్టాల్ చూసుకుంది. నారాయణ బాబాయి వచ్చిన దగ్గర నుండి అమ్మ బయటకు సరిగ్గా రావడంలేదు. సీసాలో మద్యం అయిపోతే, ఇంకోటి తెచ్చుకున్నాడు. రాత్రయింది. మద్యం తాగడం మొదలైంది. సీసా ఖాళీ కావడంలో అమ్మ సాయం చేసింది. ఇంట్లో మళ్ళీ బాబాయికి, అమ్మకు మధ్య గొడవ మొదలైంది. 'అమరితే ఆడది. లేకపోతే గాడిద.' అమ్మ గాడిదయ్యిందని మెల్లగా అర్థం అవుతుంది. చాలాసేపటికి గొడవ సద్దుమణిగింది. నిద్రపట్టలేదు.

అటుబోర్లి ఇటు బోర్లి నిద్రలోకి జారుకుంది. చటుక్కున మెలుకువ వచ్చింది. వంటిపై ఏమో పారుతున్నాయి. కాసేపటికి గ్రహించింది. తన మీద పడ్డ చేతులను గట్టిగా విదిల్చింది. అవి మరింత గట్టిగా బిగుసుకున్నాయి. బడిలో డాక్టరుగారు చెప్పిన బ్యాడ్ టచ్. "అమ్మా అని గట్టిగా అరిచింది". అప్పటికే అమ్మనోరు డబ్బు, మద్యంతో కట్టివేయబడింది. ఊరికి దూరంగా ఉన్న ఆ ఇంటిలో రజిత ఆర్తనాదాలు అరణ్యరోధనయ్యింది. "భగవంతుడా ..ఇప్పుడేది గతి" రజిత గింజుబాటు అంధునికి అద్దం చూపినట్టయింది. మనసును కమ్మిన చీకటి కాసేపటికి, మనిషిని కమ్మింది. తెల్లారేసరికి బ్యాడ్ టచ్ తన మొకాన్ని చూపలేక పారిపోయింది. మత్తుదిగిన అమ్మమొకంలో బాధలేదు. పచ్చనోట్ల ముందు పశ్చాత్తాపం మరుగునబడింది. రాజితలో నిర్వేదం కమ్మింది. నిరాశగా బడిదారి పట్టింది.

***

బడిలో రజిత నిస్తేజంగా కన్పిస్తుంది. "ఏమైంది రజితా! అలా పరాకుగా ఉన్నావు" చందూ మాటకు బదులియ్యలేదు. అడిగితె చిరాకు పడ్తుంది. మధ్యాహ్న భోజనం సయించక చెత్త కుండీలో వేసింది. తరగతిగదిలో పాఠాలు వినడం లేదు.

డాక్టరు మేడం చెప్పిన బ్యాడ్ టచ్ చెవుల్లో గింగిరాలు కొడ్తుంది. 'ఎవరికీ చెప్పాలో అర్థం కావడం లేదు. ఎవరికీ చెప్పకుండా ఉండ లేకపోతుంది' బయాలజి టీచరు తరగతికి వచ్చింది. ఎంతో శ్రద్ధగా పాఠాలువినే రజిత ఈ లోకంలో లేనట్టు ఉండడాన్ని గమనించింది బయాలజి టీచరు.

క్లాసు పూర్తయిన తరువాత రజితను స్టాఫ్ రూమ్ కు తీసుకబోయి మెల్లగా కదిలించింది. రజిత కన్నీటితో మాటలను తడిపింది. ప్రవాహంలా తన్నుకవచ్చే దుఃఖాన్ని, "ముందురోజు రాత్రి నారాయణ బాబాయి బ్యాడ్ టచ్ ను" గురించి వివరంగా చెప్పింది. తల్లి అదే బ్యాడ్ టచ్‌ను కొనసాగించమని బలవంత పెడుతున్నట్టు చెప్పింది. టీచరుకర్థమైంది. "వెధవ ముండకు దండం పెడితే, వెయ్యేళ్ళ తనలాగే వర్ధిల్లమన్నట్టు" కన్నతల్లయి ఉండి, వ్యభిచారం చేస్తూ, డబ్బుపై మోజుతో సొంత బిడ్డను వ్యభిచారంలోకి దింపడాన్ని అర్థం జేసుకుంది. వెంటనే పోలీసులను సంప్రదించింది. వారు నారాయణను మరియు రజిత తల్లిని కస్టడీకి తీసుకున్నారు.

రజితని హోంకు అప్పగించారు. 'అందితే జుట్టు, లేకపోతే కాళ్ళు' అన్నట్టు నారాయణ కాళ్ళ బేరానికి వచ్చాడు. డబ్బుతో ఆడపిల్ల శీలానికి ధర కట్టడానికి ప్రయత్నం చేశాడు. బయాలజి మేడం వెనక్కి తగ్గలేదు. కోర్టును సంప్రదించి, మైనారిటి తీరని బాలికపై అత్యాచారం చేసినందుకు , అతనికి పోక్సోచట్టంకింద జీవితకాలం శిక్ష వేయించింది.

'సోమరికి సోకులేక్కువ.' బిడ్డల మొఖం చూసి, కనికరించమని రజిత తల్లి సానుభూతి నాటకం ప్రదర్శించింది. రజిత తమ్ముడిని దత్తత తీసుకుంది సుహాసిని మేడం. రజిత భవిష్యత్తుకు ఎలాగైనా ఆటంకాలను తొలగించాలని నిర్ణయించి, రజిత తల్లిని చట్టం ముందు నిలబెట్టింది. ఊచలు లెక్కబెట్టించింది. రజితపై జరిగిన ఆకృత్యం న్యాయస్థానం గ్రహించి దోషులను కఠినంగా శిక్షించి, రజితకి రక్షణ కల్పించమని ప్రభుత్వాన్ని ఆదేశించింది. పోలీసులు రజితని హోంకు తరలిస్తుంటే, కన్నీటితో రజిత కళ్ళను తుడిచాడు చందు. కన్నీళ్లు తుడిచాక, చందుకు రజిత కళ్ళల్లో సంకల్పం మబ్బులు తొలిగిన ఆకాశంలా నిర్మలంగా, స్పష్టంగా కనబడింది.

******

**– వెలుగు, 20 నవంబరు, 2022**

# 13. ఆశ

"నాన్నా! జాతరకు పోదామని" పిల్లలు బలవంతపెట్టడంతో సతీసమేతంగా బయలుదేరక తప్పలేదు. జాతర దగ్గర జనం తండోప తండాలుగా ఉన్నారు. ఉగ్ర రూపంతో నున్న అమ్మవారిని శాంతపరచాలనే ఆశతో పరాయి తలలను తాకట్టు పెడుతున్నారు. వరుసగా తాకట్టు పెట్టిన మూగ తలలు మౌనంగా తెగి దూరంగా పడుతున్నాయి. వాటి మొండాలు మాత్రం మాట్లాడాలని గింజు కుంటున్నాయి. గొంతులో మిగిలిన ఊపిరితో ఆశగా బతకాలని, ఏదో సత్యం చెప్పాలని కాళ్ళు చేతులు నోరులేక నేలపై కొట్లాడుతున్నాయి. మాట్లాడాల్సిన నోరు తలతో ఉంది. పచ్చినెత్తుటి వాసనకలవాటయిన ఈగలు గుంపుగా 'పిలవని పేరంటానికి వచ్చిన బంధువుల్లా' చేరి జిబ్బు మంటున్నాయి. తోసు కోవడం, కొట్టు కోవడం, దాచు కోవడం వాటికి తెలియనట్టుంది. ఆ నెత్తుటిపై వాలి ఆకలిని తీర్చుకుంటున్నాయి. ఆ బలిని ఎవరు చేశారో, ఎందుకు చేశారో వాటికనవసరం. ఆ దృశ్యం వెగటుగా కంటే ఆలోచనాత్మకంగా ఉంది.

అవిలయ్య చేతిలో ప్రేమతో సాదుకున్న గొర్రెపోతుతో అటువైపుగా వచ్చాడు. గొర్రె పోతు అతని భుజాల వరకు ఉంది. దాని మెడకు తెల్లని నైలాను పల్పును కట్టి గుడి ఎదురుగా బలిపీఠం దగ్గరకు బలవంతంగా గుంజుకొని వచ్చిండు. నెత్తుటి వాసనను పసి గట్టిన గొర్రెపోతు ఎనక పట్టు పట్టింది. గొర్రె పోతును బలియిస్తే నర దిష్టి పోయి, భార్య రోగం నయ మవుతుందని సిద్దాంతి చెప్పాడట. భార్యకు నయ మవుతుందనే ఆశతో గొర్రె పోతును బలి పీఠం దగ్గరకు తీసుకు రావడానికి తన బలమంతా ఉపయోగించి మరీ లాగుతుండు. జ్వరమొస్తే సూదిమందుకు భయపడ్డ చిన్న పిల్లలా అది బెదిరిపోతుంది. గొర్రెపోతు రానని గింజుకుంటుంది. ఎంతైనా దానిది సావుతెలివి. ఎలాగైనా బతకాలనేది దాని బలమైన ఆశ. ఇంకోవైపు పొద్దు నెత్తిమీది కొస్తుంది. వచ్చిన చుట్టాలు ఆకలితో ఆగలేరు. అవిలయ్య పట్టువదల్లేదు. మనిషికున్న ప్రత్యేకాయుధం బుద్ధి బలం. దాన్ని ప్రయోగించాడు. గొర్రె చెవులనందుకున్నాడు. మనిషి ఆశ ముందు జంతువు బలం చాలాచిన్నది. అతని చేతిల ఆకలిగొన్న కత్తి గొర్రె అరుపులు విని ఇసుమంతైనా కనికరం చూపలేదు. ఆ కత్తికి గొర్రె అరుపులను వినీవినీ అలవాటయింది. దానికి యజమాని మాటే ముఖ్యం కానీ మాట్లాడలేని తలపై కనికరం లేదు. కత్తివేటుకు

తెగిన గొర్రెపోతు తల ఎగిరి అమాంతం అంతదూరంలో పడింది. అవిలయ్య కళ్ళల్లో తృప్తి. గొర్రెపోతు ఆశ అడివిపాలయ్యింది. "ఆశకు అంతులేదు. ఊపిరిపోతే చింతలేదు." ఇంతలో బుడ్డోడు "డాడీ ...అటూ చూడక్కడ...అంటూ రంగుల రాట్నం చూపించి, అక్కడికి పోదాం డాడీ...అనడంతో అటు వెళ్ళక తప్పలేదు. రంగుల రాట్నం ఎక్కాలనే బుడ్డోడి ఆశ మమ్మల్ని అటువైపుగా లాక్కొనిప్యింది. అదెక్కి కూర్చున్నాక దానివేగంలాగే అప్పటికి మనసులో ఆలోచనలు, తరువాత కాలం గిర్రున తిరిగాయి. ఆర్నెల్ల తరువాత అయిలయ్య హాస్పిటల్లో కనిపించాడు. ఏమిటిలా వచ్చావు? అనడిగితే భార్య ఆరోగ్యం విషమించిందని చెప్పాడు. బతుకంటేనే ఆరాటం...పోరాటం...., చావే అంతులేని ఆశ్చర్యం. సిద్దాంతికి దొరికిన ఆ గొర్రె కష్టాలింకా తీరలేదు. మొండెంతో బలిపీఠం దగ్గర వెర్రి గొర్రె బుర్రలో ఆశతో అరుస్తూ కదలాడింది.

***

ఓ రోజు ఏదో పనిమీద రోడ్డుపై నడుస్తుంటే, "రండయ్యా ...రండి..మంచి తరుణం, మించినా దొరకదు. మీముందుకే కనికట్టు. చూడండి. చూడండి. చూడండి. నచ్చితే మీకు తోచింది ఇవ్వండి. లేకపోతే చప్పట్లు కొట్టి వెళ్ళిపోండి." అని గారడీచేసే ఇంద్రజాలికుడు రోడ్డున పోయే వారినందరినీ పిలుస్తున్నాడు. ఆమాటను నమ్మి పని లేని కొద్ది మందీ చేరారక్కడ. ఒక చిన్న వస్త్రాన్ని నేలపై పరిచి, దానిపై తన పదిహేనేళ్ళ కూతురును నిలబెట్టాడు. ఆమెపై తెల్లని వస్త్రాన్ని కప్పాడు. తన కుడిచేతిలో నున్న పొడవాటి కర్రను ఆమెపై గుండ్రగా తిప్పాడు. వస్త్రం పైభాగాన పట్టుకొని, ఎడమ చేతితో బట్టను అమాంతంలాగి పైకి ఎగరేశాడు. ఆ అమ్మాయి మాయమైంది. జనం ఆనందంతో చప్పట్లు గట్టిగా చరిచారు. జనానికి తమను ఎంతగా మాయచేయడం ఇష్టం. మోసం చేయడం ఇంకా ఇష్టం. ఎంత కనికట్టు చేసినా త్వరగా మర్చిపోతారు. అక్కడ జరిగే కనికట్టు విద్యను చూడడానికి క్రమంగా జనం పోగవుతున్నారు. రోడ్డున పోయేవారికి జనమే వింత. అలాంటిది.. అక్కడి చప్పట్లతో అటుగా పోయే జనానికి వింత రెట్టింపై ఆసక్తిగా అతువైపు పరుగులు తీశారు. గారడీ కార్యక్రమం ఉత్సాహంగా కొనసాగుతుంది. గంట సమయం దాటింది. ఎండ నడినెత్తి మీదకు వస్తుంది. గుమిగూడిన జనం నోరెళ్ళబెట్టి మరీ చూస్తున్నారు. కార్యక్రమం చివరి వరకూ వచ్చింది. ఆ ఇంద్రజాలికుడు తన

భార్యను చూపిస్తూ అనారోగ్యానికి వైద్యం చేయించాలని, సాయం చేయమని భుజానున్న చిరుగులు పట్టిన తువ్వాలను జోలెపట్టి ముందుకు చాపుతూ అందరినీ ప్రార్థించాడు. అందరూ అతనిభార్యవైపు చూశారు. ఆమె ముఖంలో నీరసం చావుకళ పోటీపడ్తున్నాయి. మానవత్వంతో కొందరు, ప్రదర్శన ఆనందంతో చాలామంది చిల్లర విదిల్చారు. తువ్వాల నిండుగానున్న చిల్లర మూటను చూసి తండ్రీబిడ్డలకు ఆనందం అద్దంలో మెరిసిన సూర్యుని వెలుగులా తళుక్కుమంది. ఆ డబ్బును మూటకట్టి భార్య దగ్గర పెట్టాడు. ఈ డబ్బుతో అమ్మరోగం నయమవుతుంది. ఇక నేను బడికెళ్లి చదువుకోవచ్చని పదిహేనేళ్ళ అమ్మాయికి మనసులో పెద్దాశే కలిగింది. ఇద్దరూ ఆలోచనల్లో రెట్టించిన ఉత్సాహంతో ప్రదర్శనను ఇంకోపది నిమిషాలు పొడిగించారు. ప్రదర్శన పూర్తయింది. సామాన్లను సర్దుకుంటూ భార్యవైపు చూశాడు ఇంద్రజాలికుడు. "ఒక్క మెతుకు కాస్త గంజిలో పోయినట్టు" తువాలలో కట్టిన చిల్లర సొమ్ము అక్కడ కనబడలేదు. కనిపెట్టుకుని చూస్తుందనుకున్న భార్య కళ్ళు నీరసంతో ఎప్పుడో మూతపడ్డట్టున్నాయి. బయట ఇంద్రజాలికులకు కొదవలేదు. దొంగాశ ఇంకా పెద్దది. ఆరోజుకు అదే గెలిచింది. గెలుపుకు ఆశతో పనిలేదు. ఓటమినే ఆశను వెతుకుతూ ఇంకో చోటుకు పోతుంది.

***

మరుసటి ఏడాది జాతరకు పిల్లలతో వెళ్ళకతప్పలేదు. అది ఎన్నికలవేళ. జాతరలో అయితే స్వామికార్యం, స్వకార్యం రెండూ జరుగుతాయని పేరున్న రాజకీయనాయకుడొకరు ఆ జాతరకొచ్చాడు. అతను మా ఇంటికి దగ్గరే ఉంటాడు. అతని పేరు దండుగరావు. రియల్ ఎస్టేట్ లో బాగా సంపాదించాడు. దానిని నిలబెట్టుకునేందుకు, మరికొంత కూడబెట్టేందుకు రాజకీయాల్లో చేరానని దగ్గరివాళ్ళతో చెబుతుండేవాడు. అతని రాకతో రోడ్డుపై ట్రాఫిక్ భారీగా ఉంది. టపాసులు పేలుతున్నాయి. తమ నాయకుని పార్టీ రంగును కార్యకర్తలు మొఖాలకు సంబురంగ పులుముకుంటున్నారు. ఆటగాళ్ళు, పాటగాళ్ళు, డప్పులు ఆ వెంటే నాయకుడు...ఆ వెనుకన ర్యాలీ... ఘనంగా ముందుకు సాగుతుంది. "ఏ రోటికాడ పాటను, ఆడనే పాడేవాళ్ళు" పాడుతూ, ఆడుతూ ఉన్నారు. ర్యాలీకి వచ్చిన జనమే అన్నట్టు జాతరజనం వెనుక ఉన్నారు. నాకు తెలుసు. ర్యాలీకి వచ్చిన వాళ్ళతలకు కొంత విలువ ఉంటుంది. తల ఒక్కంటికి రెండువేలు, బిర్యాని పొట్లం, మద్యంసీసా.

అదంతా చూసేసరికి, గతేడాది బలిపీఠం దగ్గరి గొర్రెపోతు గుర్తుకొచ్చింది. జాతరకొచ్చిన ప్రజలకు దండుగారావు వినమ్రంగా దండాలు బెడుతున్నాడు. అభిమానులో కార్యకర్తలో దండలుకొని అతని మెడలో వేస్తున్నారు. దండుగారావు బహుశా ఇలా అనుకుంటున్నట్టున్నాడు. 'ఎలాగైనా ఈసారి గెలిచి, ఈ ఖర్చునంతా పార్టీమారి తన తలకు తగిన ధరను రాబట్టాలని" మనసులో ఆశబడుతుండవచ్చు. కూలీజనం మాత్రం, "అబ్బా! ఈ ఏడాదంతా ఎన్నికలొస్తే బాగుండని ఆశపడుతూ" ర్యాలీలో గుసగుసలాడుకుంటున్నారు. ఎన్నికలలో ఎన్ని 'కలలో..' దండుగరావు జనాన్ని నమ్మించే వాగ్దానాలన్నీ రాసుకొచ్చి మరీ గుప్పించాడు.

జాతరకొచ్చిన జనం అతన్ని నమ్మినట్టే ఉన్నారు. కానీ ఎన్నికలు దగ్గరపడ్డాక మర్చిపోయారు. అంతకంటే పెద్ద నాయకుడు ఈసారి పట్నం నుంచి దిగాడు. దండుగరావును మించిన మత్తువాగ్దానాలను గుమ్మరించాడు. జనం ఆ వాగ్దానాలకు ఆశపడ్డారు. ఎన్నికలు జరిగాయి. ఫలితాలొచ్చాయి. ఆ ఎన్నికల్లో దండుగరావు ఓడిపోయాడు. దండలు ఈసారి విజేత మెడను వెతుక్కుంటూ ఆశగా వెళ్ళాయి. దండల ఆశ దండలది. ఎరనువేసి చేపను పడదామనుకున్న దండుగరావు మొఖంలో రంగులన్నీ వెలిసిపోయాయి. తన రంగు ఓడిపోయింది. జనాల అసలు రంగు బయటపడ్డది. డబ్బుతో అధికారాన్ని కొనుక్కుందామనుకున్నా, పరువు పోయేసరికి తట్టుకోలేకపోయాడు. నాయకుడిగా గెలుస్తాననుకుని ఆశపడ్డ గుండె ఓడిపోవడంతో ఫోటోలో దండతో మిగిలిపోయాడు.

***

మరుసటి ఏడాది జాతరకు పోయి సాయంత్రం ఇంటికి తిరిగివస్తున్నప్పుడు గమ్మత్తైన సంఘటన జరిగింది. జాతరకు దగ్గరలో ఊర్వసి టాకీసు ఉంటుంది. అది కాస్త సందులోకి అన్నట్టుగా ఉంటుంది. ఆ సందులోని గోడలపైన అందాల హీరోయిన్ టకీల బొమ్మలతో అందరినీ మత్తుగా నవ్వుతూ పిలుస్తున్నట్టు పోస్టర్లు అతికించబడి ఉన్నాయి. లేతమీసాల నుండి తెల్ల మీసాల దాక పోస్టరును చూసి చొంగ కారుస్తున్నాయి. అరవింద్ వాళ్ళ ఇల్లు మా ఇంటికి నాలుగోఇల్లు. తల్లిదండ్రులిద్దరూ మంచి ఉద్యోగస్తులే. వారికి తీరికలేక, తమ కొడుకు చదువుకోసమని, ఉన్న ఊర్లోనే అరవింద్ ను ప్రైవేటు హాస్టల్లో వేశారు. అది ఓ పేరున్న ప్రైవేటు కాలేజీ. అక్కడ చదువు విషయంలో చాలా కఠినంగా ఉంటారట. అరవింద్ గారి నాన్న ఓసారి కలిసినపుడు నేను అడగకున్నా చెప్పాడు. ఆరోజు

అరవింద్ పుట్టినరోజు. ఉదయమే ఇంటికి వచ్చి, అంకుల్ ! స్వీట్లు..అంటూ, ఇంట్లోవాళ్ళందరికీ ఇచ్చి, ఈరోజే కాలేజికి తిరిగి వెళ్తున్నాని ఉదయమే నాతో చెప్పాడు. ఆశ్చర్యంగా అరవింద్ తన మిత్రులతో సాయంత్రం చీకటిపడుతున్నవేళ ఆ టాకీసు సందులోకి మిత్రులతో వెళ్తూ కనబడ్డాడు. ఆ వేళ వారికి కాలేజిలో అవుట్ పాస్ దొరకదు. మరి ఎలా వచ్చారో కానీ పదిమంది మిత్రులతో కనబడ్డాడు. ఆసక్తి కలిగి, అటూ పోదామనుకున్నా వెంట కుటుంబసభ్యులు ఉండడంతో ముందుకు కదిలాను. కొద్దిగా ముందుకు వెళ్ళగానే బస్టాండు బయట ఆటోస్టాండు దగ్గర ఓ పద్నాలుగేళ్ళ అమ్మాయి. మొఖంలో తెలివిలేదు. కళ్ళల్లో అమాయకత్వమే ఉట్టిపడుతుంది. కొప్పులో మల్లెపూలు నిండుగా పెట్టింది. అందంకోసమని ముఖాన తెల్లపౌడరును నలుపుపై మందంగా అద్దుకుంది. పెదాలకు ఎర్రనిరంగు పులుముకుంది. లేతఅందాలు పైకి కనబడేవిధంగా బట్టలు వేసుకుంది. మాటిమాటికీ ఆశగా వచ్చేవారిని పోయేవారిని కళ్ళతోనే ఆహ్వానిస్తుంది. బస్టాండులో భార్యను బస్సుఎక్కించినట్టున్నాడు ఆరవింద్ వాళ్ళ నాన్నగారు. అక్కడే పాన్ డబ్బా దగ్గర సిగరెట్ వెలిగించుకొని ఆ అమ్మాయి వంకే ఆశగా చూడడం నా కళ్ళల్లో పడింది. తరువాత నా మిత్రుడొకరు చెప్పాడు. అదేరోజు అతను కూడా ఆ సినిమా థియేటర్ కే వెళ్ళాడట. ఆరోజు జరిగిన సంఘటనను కళ్ళకు కట్టినట్టు చెప్పాడు.

ఆరోజు మిత్రులతో అరవింద్ చేసిన సందడి మామూలుది కాదట. సినిమాహాలు బయట ప్యాంటు జేబుల్లో రెండు చేతులు బెట్టుకొని ఆట ఎప్పుడు మొదలవుతుందాని పదేపదే పోస్టరును చూస్తూ, పచ్చి జోకులేసుకుంటున్నారట. మొదటాట అయిపొయి సినిమాహాలు బయట బెల్లుమోగగానే, జనం బయటకు వస్తుంటే, వీళ్ళు ఎదురుగా వెళ్తూ, వచ్చినవారిని తోసుకొంటూ వాళ్ళతో గొడవపడుతూ వెళ్లారట. హాలు యజమాని వాళ్ళ సంఖ్యాబలాన్ని చూసి ఏమనలేక బిత్తరపోయి చూశాడట. తెరమీద ఆట నడుస్తున్నంత సేపు వాళ్ళ ఆగడం నడుస్తూనే ఉంది. క్షణక్షణానికి తెరమీద విలువలు, హీరోయిన్ వలువల్లా వదులైపోతున్నాయి. ప్రేక్షకులు ఉద్విగ్నత అంతకంతకూ రెట్టింపవుతుంది.

తెరపై విరామం బోర్డు రావడంతో హాల్ లో లైట్లు వెలిగాయి. పెద్ద నిట్టూర్పును విడుస్తూ, అరవింద్ ఏదో ఘనకార్యం సాధించిన వాడిలా, చేతులు పైకెత్తి పక్క సీటులోకి చూసిన అరవింద్ బాంబు పడ్డట్టు అదిరిపడ్డాడు. అక్కడ అరవింద్ నాన్నగారున్నారు. నాన్న చేతిలో బస్టాండు దగ్గర కనిపించిన అమ్మాయి

తన వళ్ళంతా అప్పగించి, నవ్వుతూ కనిపించింది. ఆ పరిస్థితుల్లో తండ్రీకొడుకులు ఒకర్నొకరు చూసుకొని గతుక్కుమన్నారు. అరవింద్ కు నాన్నపై అసహ్యం కలిగింది. తండ్రీ, కొడుకులు ఒకర్నొకరు చూసుకోలేక మొకం వెనక్కు తిప్పుకున్నారు. వెనుక సీట్లో దృశ్యం చూసి ఇద్దరూ నిశ్చేష్టులయ్యారు. ఎవరో కొత్తవ్యక్తి చేతిలో అరవింద్ తల్లి నలిగిపోతూ ఉంది. విలువలు లేనిది తెరమీద కాదు. అందరూ నిశ్శబ్దంగా బయటకు నడిచారు. "ఎద్దు చేనులో మేస్తే, దూడ గట్టున మేస్తుందా?". శారీరక సుఖాలే గొప్పవని పోటీబడి చూపడం, ఎగబడి చూడడం నేటి ఆధునికత అంటున్నారు.

ఆధునికతకు పర్యాయపదంగా స్వేచ్ఛ మారిపోయింది. స్వేచ్ఛ ముసుగులో ప్రచార, ప్రసార సాధనాలెన్నో మన చుట్టూ చేరి, అశ్లీలత, నేరాలు, మత్తుప్రచారంలో పోటీపడుతున్నాయి. నిజానికి స్వేచ్ఛను పొందడానికే అధిక నియమాలవసరపడతాయి. తలుపుల్లేని ఇంట్లోకి సులువుగా ఎలా ప్రవేశించగలమో, అదుపులేని మనిషిలోకి కోరికలలా ప్రవేశించగలవు. మంచి బేరం దొరికింది. కడుపునిండా తిందామనుకున్న ఆ అమ్మాయి ఆశ తీరనేలేదు. నిరాశతో రోడ్డు దాటుతుంటే, యాక్సిడెంట్ జరిగి తీవ్రగాయాలతో తరువాత ఆ అమ్మాయి ప్రభుత్వాసుపత్రిలో కనబడింది.

***

మరుసటి ఏడాది జాతర సందర్భంగా సాహితీప్రియులెవరో కవిసమ్మేళనం జరుపుతున్నారు. తెలుగుసాహిత్యం అంటే నాకు చిన్నప్పటినుండి చాలాఇష్టం. హాస్పిటల్లో డ్యూటీ అయిపోయాక కవిత్వం విందామని ఆశగా అటువెళ్లాను. అక్కడ ప్రముఖకవినని చెప్పుకునే కిరాతకరత్న రాసిన "అమాయకత్వం" అనే పుస్తకావిష్కరణ సభ జరుగుతుంది. ఆ కవిత్వమేంటో, ఆ సభ ఏంటో ఎంతకీ అస్సలర్థం కాలేదు. అప్పటికే గంట గడిచింది. మరో అరగంట చూద్దాం అని ఓపిక పట్టి చూశాను. సభలో వక్తల నాలికకు ఎముక లేదు. 'గాడిద అందానికి, గుర్రం అబ్బురపడ్డట్టు' కవిగారి రచనా కౌశలాన్ని గుక్కతిప్పుకోకుండా, ఒకరితరువాత మరొకరు ఉపన్యాసంలో దంచికొడుతున్నారు. 'అంతా నటన. మనిషి కాకుండా మరే జంతువుకు మనిషిలాగ నటించలేదు. నటన లేకుంటే మనిషిని ఎవరు నమ్ముతారు?. మనిషిని మనిషి మోసం చేయాలంటే నటనే ముఖ్యం.' సభలో వేదికపై వక్తలు

నోరారా దవడకండరాలు అలిసిపోయేట్టుగా పొగుడుతున్నారు. ఒకవైపు భజన నడుస్తుండగానే భోజనాలు మొదలయ్యాయి. అక్కడ వివిధ రకాల వాసనలు ఆకలిని గుర్తుచేస్తున్నా అసలు ఈ కార్యక్రమం ఉద్దేశ్యం ఏంటో, దీని విషయమేంటో.. చూద్దామని పట్టుదలతో కూర్చున్నాను. జుట్టు పీక్కుంటూ స్నానం మరిచిపోయిందా? అన్నట్టున్న ఓ పిచ్చిది చాలాసేపటి నుండి గేటుదాటి లోపలికి రావాలని చూస్తూ ఉంది. ఆమె పిచ్చిది. ఆమెను అప్పుడడూ హాస్పిటల్ కు తీసుకువస్తారు. ఆమెకో కథ ఉంది. నిర్వాహకులు తనను ఎందుకు లోనికి రానీయడ లేదనే విషయం ఆమెకు అర్థం కావడంలేదు. నా పరిస్థితి దాదాపు అదేవిధంగా ఉంది. అక్కడేం జరుగుతుందో, ఏం చెబుతున్నారో అర్థం కావడంలేదు. నాది సాహిత్య అభిలాషతో నున్న ఆకలి. ఆమెది క్షుద్బాధ. వేదిక మీద ఉన్నవారిది మరోరకం పిచ్చి. ఇలా ఆలోచన్లలోనున్న నాకు నిర్వాహకుల అరుపులు గట్టిగా వినబడ్డాయి. అటు చూశాను. ఆమె లోనికి రావాలని తీవ్రంగా ప్రయత్నిస్తుంది.

ఆమెను నిలువరించడానికి కవిగారి మనుషులు విశ్వ ప్రయత్నం చేస్తున్నారు. ఇంతలో ఒక కుర్తా పైజామా ఆమె చూస్తుండగా ఎంగిలి విస్తర్లు తీసుకెళ్ళి దూరంగా విసిరేశాడు. ఆమె దాని కోసం అటు వైపు వెళ్ళింది. అందరూ అతన్ని గొప్పగా చూసేసరికి, ఆయన ఛాతీ పొంగింది. ఆమెను నిలువరించడానికి అదొక ఎత్తుగడ. నేను చూస్తుండగానే ఆమె వీరోచితంగా కుక్కతో పోరాడి చివరికి ఆ ఎంగిలాకును సాధించింది. పాపం కుక్క. తినాలన్న ఆశ నెరవేరకపోవడంతో పాలు తాగాలని దగ్గరికొచ్చిన కుక్కపిల్లను నోటపట్టి అంతదూరంలో విసిరేసింది. కిరాతకరత్న చుట్టూ పత్రికలవాళ్ళు గుసగుస పెడ్తున్నారు. ఆయన చాటుమాటుగా వాళ్ళ చేతిలో ఇంతో అంతో పెడుతున్నారు. వాళ్ళ ఆకలి వాళ్ళది. ఆకలి ఎంత పిచ్చిది. ఆకలికి, పిచ్చికి మందు ఉంది. కానీ మనిషి ఆశకే హద్దులేదు. దాంతో నాకు తినాలన్న, వినాలన్న ఆశ చచ్చిపోయి అక్కడినుండి లేచాను.

*****

**– నవతెలంగాణ, సోపతి, 27 నవంబరు, 2022**

# 14. సంఘర్షణ

డాక్టర్! మా అబ్బాయి ఈమధ్య పిచ్చి పిచ్చిగా ప్రవర్తిస్తున్నాడు. నిద్రలో ఏవేవో కలవరిస్తూ పెద్దగా అరుస్తున్నాడు, వెంటనే ఏడుస్తూ నిశ్శబ్దంగా మారి పోతున్నాడు. దయచేసి సమస్య ఏంటో చెప్పండి. కాలనీలో అందరూ పిచ్చి అని మమ్మల్ని భయపెడుతున్నారు. కొత్తగా పెళ్ళైన కొడుకు ఇలా మారి పోయాడని మేము ఏడవని రోజు లేదు. అని ఆ అబ్బాయి తల్లిదండ్రులు, అతని భార్య చెబుతూ ఏడుస్తున్నారు. అతను మాత్రం వారిని పట్టించుకోకుండా గోడ మీద పోస్టర్లను ఆసక్తిగా చూస్తూ, గోడ మీద కొటేషన్లను ఆసక్తిగా చదువుతున్నాడు.

'సమాజమంతా రోగపీడితులు, మరికొందరు భయపీడితులు, ఇంకొందరు దుఃఖపీడితులు. శారీరక బాధలు కొందరివైతే, మానసిక బాధలు ఎందరివో. ఆరోగ్యం అందని ద్రాక్ష. వస్తు పిచ్చి, డబ్బుపిచ్చి, పలుకుబడి పిచ్చి, మద పిచ్చి.. ఇలా పిచ్చితనమంతా ఏదో రూపంలో మన చుట్టూనే ఉంది. మరి మానసిక జబ్బులను పిచ్చి అంటుంటారు ఎందుకో !?. వాళ్ళని చూస్తూ ఆలోచనల్లో నున్న నా టేబుల్ మీద ఫోన్ మోగింది.'

సిటీలో పేరున్న మానసిక వైద్యశాల నుండి ఆ ఫోను. ఊహించలేదు. మానసిక వైద్యుడుగా నాకు మంచి పేరుంది. కానీ నా క్లినిక్‌ను, నన్ను పోటీగా భావించే మానసిక వైద్యశాల అది. "ఇన్ పేషంట్ గా అక్కడున్న మహిళ ఒకరు నాల్రోజులుగా భోజనం చేయడం లేదని, తన కొడుకును పిలిపించమని... ఏడుస్తూ, అక్కడున్న వాళ్ళతో విచిత్రంగా ప్రవర్తిస్తుందని నిర్వాహకులు ఫోన్ చేసి చెప్పారు. నాకిప్పుడు వీలు కావడం లేదు. పేషంట్లున్నారని సమాధానం చెప్పాను. కానీ వారు పట్టు బట్టి ఎలాగైనా వీలు చూసుకొని రమ్మని బ్రతిమిలాడేసరికి సరేనని అనక తప్పలేదు. నిజానికి నాకు బయటి కేసులను చూసే తీరిక అస్సలుండదు. క్లినిక్ ఎప్పుడూ రోగులతో కిట కిటలాడుతుంది. సంఘర్షణ ప్రకృతి లాంటిది. శ్వాసించని జీవి ఉంటుందేమో కానీ సంఘర్షణ పడని జీవి ఉండదు కదా! నిజానికి దీపం దగ్గర వెలుగూ, చీకటి ఉన్నట్టు, ఆనందం దగ్గర దుఃఖం ఉంటుంది. ప్రశ్న దగ్గరే జవాబు, జవాబు దగ్గరే ప్రశ్న ఉంటుంది. వెతికి కనిపెట్టే ఓపిక ఉంటే ప్రతీ

సంఘర్షణకు ఓ పరిష్కారం లభిస్తుంది. ఆ పని చేయలేనివారికి సహకరించే పని నాది.

ఎదురుగా కూర్చున్న తల్లిదండ్రులతో "మీరు కాసేపు బయట కూర్చోండి." అని చెప్పి ఆ యువకునితో ఒంటరిగా కాసేపు మాట్లాడాను. అతను పెళ్లికాక ముందు సాఫ్ట్వేర్ కంపెనీలో ఉద్యోగం చేసేవాడు. పెళ్ళయ్యాక ఆర్నెల్లకు అతను పనిజేసే కంపెనీ నష్టాల్లో మునిగి, అతడిని ఉద్యోగం నుండి తీసేయడంతో నిరుద్యోగిగా మారాడు. ఎంత ప్రయత్నించినా ఉద్యోగం దొరకడం లేదు. అతని భార్య పేరు ఊర్మిళ. ఆమె ఇల్లు గడవడానికి ఒకచిన్నపాటి ఉద్యోగం చేస్తుంది. ఇటీవలే గర్భవతి అయింది. ఉద్యోగానికి ఇబ్బంది అవుతుందని గర్భం తీసుకుంటానని ఆమె, వద్దని ఇతను రోజు ఘర్షణ పడుతున్నారు. ఉద్యోగం చూసుకోమని లేకపోతే నేను పుట్టింటికి పోతానని ఊర్మిళ గొడవచేస్తుందని చెప్పాడు. ఈ గొడవ వారం రోజులుగా జరుగుతూ ఉందని చెప్పాడు. విషయం నాకర్థమైంది. టేబిల్ పైన బెల్ కొట్టి అతని తల్లిదండ్రులు, భార్యను పిలిపించాను. వారితో చెప్పాల్సింది చెప్పి, కొన్ని మందులు రాసి క్లినిక్ నుండి బయటకు నడిచాను. బయటకు వెళ్తూ ఈరోజు అపాయింట్ మెంట్ లను నిలిపేయమని చెప్పి కారు వైపు నడిచాను.

'గతంలో పెద్ద కుటుంబాలు ఉండేవి. ఇల్లు, వంటి మీద బట్టలు కుదించుకుపోయినట్టే కుటుంబాలు, బంధుత్వాలు చిన్నవై పోయాయి. ఇప్పటి తల్లిదండ్రులూ సరే సరి. వారు పిల్లల చూసి బాధపడడం వరకే చేస్తున్నారు తప్పితే ఆ సంఘర్షణ నుండి ఎలా బయటపడాలో చెప్పలేక పోతున్నారు. వారి అనుభవమూ చాలడం లేదు. నాగరికత మారింది. మానసిక సమస్యలను తీర్చడానికి గతంలో మానసిక డాక్టర్లుగా వ్యవహరించే పెద్దలు ఇప్పుడు అనేక కుటుంబాలలో లేరు. ప్రేమ కేసులు, నిరుద్యోగులు, దంపతుల కలహాలు, వ్యాపారంలో నష్టాలు వచ్చాయని కొందరు, అప్పుల బాధలతో మరికొందరు, విచిత్ర మనస్తత్వంతో నున్న వారు ఇలా నిత్యం వివిధరకాల సమస్యలున్న వారు, ఆత్మహత్య చేసుకోవాలనుకునే వారు నా వద్దకు వస్తారు. వారందరికీ కౌన్సిలింగ్ చేసి వారు హాయిగా జీవించేలా చేయడం అంటే వారికి  రెండోసారి ప్రాణం పోయడంలాంటిది. అందుకే నాకు సంతృప్తి

కూడా ఎక్కువే లభిస్తుంది.' ఆలోచిస్తూ కారు స్టార్ట్ చేశాను.

కారులో రోడ్డుపై వెళ్తుంటే మనసంతా అదోలా అన్పించింది. ఆలోచనల్లోనే డ్రైవింగ్ చేస్తూ, ఆ క్లినిక్ చేరుకున్నాను. నా కోసమే ఎదురుచూస్తున్నట్టు, అక్కడ పనిజేసే డ్యూటీ డాక్టర్ హలో సార్! అంటూ కుర్చీలో నుండి లేచి దగ్గరకొచ్చి చేయి కలిపాడు. "డాక్టర్! ఆమెను ప్రత్యేక గదిలో ఉంచాము" అని చెప్పాడు. పద అంటూ, ఇద్దరమూ కలిసి ఆమె రూం దగ్గరికి వెళ్ళాము. మాతో పాటు నలుగురు సహాయకులు కదిలారు. వారి చేతిలో అవసరమైన మత్తు మందు, ఆమె తిరగబడితే బంధించడానికి అవసరమయ్యే పరికరాలున్నాయి. ఆ గది దగ్గరికి వెళ్లి, తాళం తీయమని చెప్పాను. డ్యూటీ డాక్టరు భయపడుతూ "వద్దు డాక్టర్, కొంచెం.. సేఫ్టీ మెజర్స్ తీసుకోండి' అని సలహా ఇచ్చాడు. కిటికీ నుండి ఆమెను చూశాను. ఆమె ఎందుకో నా హృదయానికి చాలా దగ్గరగా ఉన్నట్టు కన్పించింది. ఆమె ముఖం ప్రశాంతంగా ఉంది. ఎంత సేపు ఏడ్చిందో. ఆకాశంలో నీరు చారికలు కట్టినట్టు, ఆమె బుగ్గలపై ఎండిన కన్నీటి చారికలున్నాయి. ఆ ముఖంలో అలసట తప్ప ఏ భావమూ కనిపించలేదు.

ఆమెను చూసి కంపించి పోయాను. ఆమెపై ఒక డాక్టరుగా జాలి, సానుభూతి కంటే కూడా విడదీయరాని ఆత్మీయత కలుగుతుంది. ఆమె బాధ ఎటువంటిదైనా ఈ క్షణమే తీర్చాలన్న ఆతృత మనసులో జనించింది. "ఏం పర్లేదు. నేను చూసుకుంటాను. దయచేసి మీరు తాళం తీయండి" ధైర్యంగా, నమ్మకంతో స్థిరంగా అన్నాను. వారు అనుమానంగానే తాళం తీశారు. ఆమె నన్ను చూడడంతోనే ఉద్వేగానికి గురయింది. పెద్దగా ఏడుస్తూ కుప్ప కూలిపోయింది. ఏడ్చి ఏడ్చి అలిసి పోయినట్టుంది. నిర్వేదంతో నన్నే చూడసాగింది. నా మనసులో ఏదో అలజడి. ఆమె శోకం నన్ను నిలబడనీయలేదు. రెండు అడుగులు ముందుకేసి ఆమెను సమీపించాను. ఆత్మీయంగా తన చేతులను నా చేతుల్లోకి తీసుకున్నాను. ఆమెలో నెమ్మదితనం ప్రవేశించింది. వయసు తగ్గాక వేగం తగ్గినట్టు, మట్టి తడిశాక విత్తనం మొలకేత్తినట్టు కోపం తగ్గాక మనిషిలో ఆలోచన పుడుతుంది. అది చాలా అందంగా ఆదర్శంగా గొప్పగా ఉంటుంది. దానికి తగిన వసతులు కలుగజేస్తే పెద్దవృక్షం అవుతుంది. ఆమెలోనున్న ఉద్రేకం, కోపం అన్నీ చప్పున చల్లారాయి. ఇక తరువాతి

ఆదర్శవంతమైన ప్రవర్తన కోసం నేను ఎదురుచుస్తుండగా ..ఆమె ప్రవర్తన నాతోబాటు అక్కడున్న వారందరితో ఆశ్చర్యానికి గురిచేసింది. నా తలను, భుజాలను ఆత్రుతగా తడమడంతో బాటు నా ఎడమచేతి మణికట్టును తిప్పి జాగ్రత్తగా, పరిశీలనతో చూసింది. ఆమె కళ్ళలో సంతోషం. పోయినదేదో దొరికింది. కుంభవృష్టితో కురిసిన వానకు మురిసి ఆడుతున్న జలపాతంలా ఆమె కళ్ళు ఆనందాన్ని కారుతున్నాయి. మది ఆనందాన్ని అలుగుబోసినట్టుగా ఆమె కళ్ళ నుండి పొంగి పొర్లుతుంది. ఆమె శరీరం కంపిస్తుంది. అక్కడున్న వారెవరికీ ఆమె ప్రవర్తన అర్థం కాకపోవడంతో, వారు ఆమెను, నన్ను ఆశ్చర్యంతో, ఆందోళనతో అయోమయంతో చూస్తున్నారు. చుట్టూ ఉన్న సహాయకులు ఏ క్షణంలో ఏమి జరుగుతుందోనని మత్తు ఇంజక్షన్‌లు, ఆమెను బంధించడానికి సరిపడా వస్తువులను తయారుగా పట్టుకున్నారు.

కాసేపటికి ఆమె తేరుకొని, కళ్ళు తుడుచుకొని, వచ్చావా బిడ్డా! నన్ను తీసుకుపోతావా? ఇక పోదాం మనింటికి. ఆత్రుతతో అడిగే ఆమె ఆనందాన్ని నిలువరిస్తూ, “ఆయన ఎవరనుకున్నవ్. డాక్టరు గారు. మీ అబ్బాయి కాదు” అన్నాడు ఓ సహాయకుడు. ఆ మాటకు ఆమె చివ్వున తలెత్తి, తీక్షణంగా కళ్ళు పెద్దవిచేసి అతని వైపు ఉరిమి చూసింది. ఆ కళ్ళల్లో కొలిమిలో తిత్తిగాలికి వెలుగుతున్న ఎర్రని బొగ్గు నిప్పుల్లా కణ కణ మండుతున్నాయి. నోర్ముయ్! అని గట్టిగా, ఒక్కసారిగా అరిచింది. ఆ అరుపు ఆ గదితో బాటు హాస్పిటలంతా వినబడింది అనుకుంటాను. రోగులు ఆత్రుతగా ఆ గది వద్దకు వచ్చి, కిటికీల నుండి వింతగా చూస్తున్నారు. “ఇంకెన్నాళ్ళు నన్ను మోసం చేస్తార్రా? వాడు నా కొడుకు. ఈ పేగు తెంచుకొని పుట్టినబిడ్డ. అని తన కడుపును చూపిస్తూ, దుఃఖం వస్తున్నా... ఆపుకొని, కారే కన్నీటిని లక్ష్యపెట్టక... నా కొడుకొచ్చాడు. నన్ను తీసుకెళ్తాడు. అని నా చేతిని గట్టిగా పట్టుకుంది. “నాయినా! నన్ను తీసుకుపోతావు కదూ! మా అయ్య కదూ! చచ్చి నీ కడుపున పుడతాను. నన్ను నన్ను త్వరగా తీసుకుపో బిడ్డా! ఈ నరకంలో ఉండలేను. తీసుకుపోతావు కదూ.....ఆతృత, నమ్మకం కలగలిపి అడుగుతుంది. నాకు ఏం చెప్పాలో అర్థం కాలేదు. నోరు పెగల్లేదు. ‘రోగం నుండి బయటపడేయాలని ప్రతీ డాక్టరుకు ఉంటుంది. కానీ నయం కాని రోగిని సమాజంలోకి ఎలా పంపించడం’. నా సంఘర్షణ నాది. డ్యూటీ డాక్టర్ మాట్లాడుతూ, “ఇదీ సార్

పరిస్థితి. పదిహేనురోజులుగా ఏం తినడంలేదు. ఎవ్వరినీ దగ్గరకు రానీయడం లేదు. అదలా ఉండగా.. ఇప్పుడు ఇదో కొత్త డ్రామా. మిమ్మల్ని తన కొడుకని సతాయిస్తుంది."

డాక్టర్. వీడూ నా కొడుకే. వీడి కుడిచేతి మణికట్టుపై రూపాయి బిళ్ళంత పుట్టుమచ్చ ఉంటుంది చూడండి. అదేవిధంగా వీడి ఎడమతొడపై పెద్దకాలిన మచ్చ ఉంటుంది. కావాలంటే మీరు చూడండి. అది వాడికి చిన్నప్పుడు పొయ్యిమీద పాలగిన్నె పెట్టినపుడు, వాడు ఆకలితో దానిని పొయ్యిమీదనుండి లాగాడు. అప్పుడు ఎడమతొడపై పాలు పడి కాలినమచ్చ అది. కావాలంటే చూసుకోండి. అని తీవ్ర కంఠంతో హెచ్చరించింది. వాళ్ళెవరూ ఆ విషయం పెద్దగా పట్టించుకోలేదు. కానీ ఆ మాటతో పిడుగుపడ్డట్టు ఉలిక్కిపడ్డాను. ఎందుకంటే ఆమె చెప్పింది అక్షరాల నిజం. నా తొడపై కాలిన గాయం ఉంది. అసలు ఎవరీమె..!? ఆలోచన మనసును వేధిస్తున్నా, ఆమెకు వైద్యం చేయాలనే స్పృహతో ప్రిస్క్రిప్షన్ రాసిచ్చి, అవి వాడమని చెప్పాను. కాసేపు అక్కడే ఉండి, ఆమె వైద్యానికి సహకరించేలా ఒప్పించి, వైద్యంచేశాను.

ఆమె అలా నిద్రలోకి జారుకోగానే అక్కడినుండి బయలుదేరాను. మనసంతా సిటీ ట్రాఫిక్ లో వాహనాలు తిరిగినట్టుగా గజి బిజిగా ఆలోచనలు తిరగసాగాయి. అసలింత ఖరీదైన హాస్పిటల్లో ఆమెను ఎవరు చేర్పించారు. నిజంగా ఆమెకు పిచ్చిబట్టిందా? లేక ఏదైనా ఇతర మానసిక వ్యాధినా? అంతుచిక్కడం లేదు. ఆలోచిస్తూ కారులో ఇంటికి చేరాను. కారు హారన్ విని గేటు తీశాడు వాచ్ మన్. "బాగా అలసటగా ఉంది మమ్మీ! నన్ను ఎవ్వరూ డిస్ట్రబ్ చేయకండి" అని చెప్పి స్నానంచేసి నేరుగా బెడ్ పైకి చేరుకున్నాను. కళ్ళు మూసుకుంటే లోకానికి చీకటవుతుందా? కంటికి నిద్రవస్తుందా? ఆమె పిచ్చిదా? ఈ లోకం పిచ్చిదా? ఒక మనిషిని స్వేచ్ఛగా బతకనీయలేని ఈ ప్రపంచంకంటే పిచ్చి ఎక్కడుంది? ఇలా సాగుతున్నాయి ఆలోచనలు. అసలు ఆమె ఎవరు? అవే ఆలోచనలతో రాత్రి రెండు దాటినా పక్కమీద అటూ ఇటూ దొర్లుతూనే ఉన్నాను. అయినా నిద్రపట్టడం లేదు. ఛ..ఛ..ఇక లాభం లేదని పక్క రూంలోకి వెళ్ళి ఏదో పుస్తకం చదువుతున్నా... దానిపై కూడా ఏకాగ్రత నిలవడం లేదు. ఇతరుల సంఘర్షణకు జవాబు తొందరగానే

దొరుకుతుంది. మన సమస్య మనకెప్పుడూ భారమే. మళ్ళీ బెడ్ పై చేరాను. ఆమె పదే పదే గుర్తుకొస్తుంది. ఆమె దీనమైన ముఖం, చింపిరి దుస్తులు, సంస్కారంలేని జుట్టు. పాపం... స్నానంచేసి ఎన్నిరోజులైందో.

"బిడ్డా! నన్ను కాపాడు. నువ్వు నా కొడుకువి. ఇక్కడి నుండి నన్ను ఎలాగైనా బయటపడెయ్యి."

ఆమె ధీనాలాపన హృదయాన్ని ఎందుకో కలిచివేస్తుంది. ఒక మానసిక వైద్యుడిగా అలాంటి రోగులు నాకు కొత్తకాదు. వాళ్ళ బాధలు కూడా కొత్తవి కావు. మరెందుకు నాకీ సంఘర్షణ. ఏమన్నది ఇంకా...!

"అయ్యా ! నువ్వు నా పేగు తెంపుకొని పుట్టావు. నీ కుడిచేతిపై రూపాయి బిళ్ళంత పుట్టుమచ్చ ఉందంటే, కచ్చితంగా నువ్వు నా కడుపున పుట్టినబిడ్డవే."

చేతి మణికట్టుపైన ఉన్న పుట్టు మచ్చ చేతి చొక్కాను పైకి మడిస్తే కాని అది పైకి కనబడదు. ఆ ఆనవాలు చెప్పటమే ఎక్కువంటే తొడ మీది కాలిన మచ్చ ఎలా చెప్పగలిగింది? నా చిన్నప్పటి నుండి ఆ గుర్తు తొడపై ఉంది. కానీ ఎలా సాధ్యం? నాకు మమ్మీ, డాడీ ఇద్దరూ ఉన్నారు. వాళ్ళు నన్ను ఎక్కడి నుండైనా దత్తత తీసుకొచ్చారా? లేక సినిమాలలో చూపినట్టు నన్ను ఆమె నుండి దొంగిలించారా? అసలు ఆమె నాకు అమ్మేనా? ఏంటో ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోతుంది. మానసిక సమస్యలకు నా వద్దకు వచ్చే వారికి చికిత్స చేసే నాకే ఈ ఒత్తిడి ఏమిటో అర్థం కావడం లేదు. ఎంత చదువు చదివినా ఏం ప్రయోజనం? ఒత్తిడి జయించలేని చదువు నిరర్థకం. దృశ్యాన్ని కన్ను మరిచినా, మన మెదడు మరవదు. అన్ని రకాల పిచ్చికి నిద్రే మంచి మందు. కన్ను మూసిన క్షణమే లోకం మాయమవుతుంది. లోకాన్ని మాయజేసె శక్తి కన్నుకు ఉంటే, కన్నును మాయజేసే కని కట్టు మనిషి ఆలోచనలో ఉంది. ఆలోచనల్లోనే చాలాసేపటికి నిద్రపట్టింది.

కోడలు ఆఫీసుకెళ్ళింది. ఇంకా ఏంట్రా ఆ మొద్దు నిద్ర...త్వరగా... లే... డ్యూటీకి వెళ్ళవా? అంటూ మమ్మీ అరుస్తుంది. నిద్రలేచి, మమ్మీ! అదీ ...మమ్మీ! తలగోక్కుంటూ సణిగాను.

వూ! ఏంట్రా? అమ్మ బెడ్ షీట్లను మడతబెడుతూ అడిగింది.

అదీ....అదీ...! బెడ్ మీద నుంచి లేచి, ఎలా అడగాలో తెలియక నసుగుతుంటే,

ఏంటో చెప్పు.. అని విసుక్కుంటూ వంట గదిలోకి నడిచింది మమ్మీ.
ఈ విషయం మమ్మీతో కాకుండా డాడితో చర్చిస్తే బాగుంటుందేమోనని హాల్లోకి నడిచాను. కానీ డాడి ఇంకా వాకింగ్ నుండి రాలేదు. ఆయన తొమ్మిది దాటే వరకు ఇల్లు చేరడు. మిత్రులతో పిచ్చాపాటి అయిపోయాక గాని ఇంటికి రాడు. ఆయనకేం సమస్యలు. రిటైర్డ్ ఉద్యోగి. నెలనెలా చాలినంత పెన్షన్ వస్తుంది. ఇంట్లో ముగ్గురు ఆదాయపరులే.

హూ..! అనుకొని నిట్టూర్చి, క్లినిక్ టైమవుతుందని గబగబా తయారై కారెక్కాను. నేరుగా స్నేహితుడు ప్రసాదు దగ్గరికి వెళ్లాను. అతనికి జరిగిందంతా చెప్పాను. అదంతావిని సమాంతర జీవితాల గురించి విన్నావా? అన్నాడు. అవును విన్నాను. ఈ ప్రపంచంలో ఏ ఇద్దరి జీవితాలు ఒకేలా ఉంటాయి. అదే కదా అన్నాను. అవునన్నాడు వాడు. కానీ.. పుట్టు మచ్చలు ఒకే..కానీ కాలిన మచ్చ ఎలా? సందేహంగా ఆగాను. అతను మాట్లాడుతూ సమాంతర జీవితాలు అంటే అదే కదరా! అన్నీ సమాంతరంగా జరుగుతాయి. అలా జరిగిన వ్యక్తుల్లో అన్ని సంఘటనలు యాదృశ్చికంగా ఒకేలా జరుగుతాయి. ఏంటో! అప్పటికి వాడి సమాధానం సంతృప్తినివ్వకున్నా, ఇంకా వాడితో వాదిస్తే ఆలస్యం అవుతుందని, వూ..అన్నాను. కాసేపు మౌనంగా కూర్చునేసరికి, ఏంట్రా అలా ఆలోచిస్తున్నావు. ధ్యానం చేస్తున్నావా? అన్నాడు. ధ్యానం చేస్తే జ్ఞానం వస్తుందా? అని ఒక జోకును వాడి దగ్గర జోకాను. ఈలోగా క్లినిక్ నుండి ఫోన్ రావడంతో అవే ఆలోచనలతో అక్కడినుండి బయలుదేరాను. కారులో ఉండగా, అసలామె ఎవరు? ఆమె గురించిన పూర్తివివరాలను ముందు తెలుసుకో! అని ప్రసాదు ఇచ్చిన ఉచిత సలహా గుర్తుకొచ్చింది.మనస్తత్వ సిద్ధాంతంలో కొన్ని విషయాలు సాధారణంగా కనిపించినా, అసాధారణ రహస్యాలుగా ఉంటాయని చదువు కున్నాను. ఇప్పుడు నాకే ఎదురు కావడం అసాధారణమే.

రాయి కరిగితేనే మట్టి పుడుతుంది. మట్టిని తడిపితేనే మానైనా, మనిషైనా ఎదిగేది. మొగ్గ మానును చీలుస్తూ పుడితే , మాను భూమి గర్భాన్ని చీలుస్తూ పుడుతుంది. పుట్టుకకు ఈ భూమిలో ఎంతో గొప్పదనం ఉంది. నా పుట్టుకనే రహస్యంగా మార్చిన ఆమె ఎవరు? ఎందుకు నా ఆలోచనలను వెంటాడుతుంది.

ఎంత ఆలోచించినా అర్థం కావడం లేదు. అనన్యమస్తకంగా మధ్యాహ్నం వరకు పేషంట్లను చూసి, ఆమె ఉన్న హాస్పిటల్‌కు వెళ్లాను. నన్ను చూడగానే ఆమె ముఖంలో కోటికాంతుల దీపావళి. ఎవరీమె? అసలేంటి ఈమె కథని కుతూహలంగా అక్కడి డ్యూటీ డాక్టరును అడిగాను. ఆయన దగ్గర కూడా చాలా తక్కువ సమాచారమే దొరికింది. ఆమెది మారు మూల గ్రామీణ ప్రాంతం. ఆమె భర్త వ్యవసాయం చేసుకుంటూ ఆమెను పోషిస్తున్నాడు. ఒక్కగానొక్క కుమారుడు ఏ ఉద్యోగం లభించక మతి స్థిమితం చలించి ఎక్కడికో వెళ్లిపోయాడు. అది తట్టుకోలేని ఆమెను ఒక స్వచ్ఛంద సంస్థ వాళ్ళు తీసుకొచ్చి చేర్పించారు. సరే, ఆ అబ్బాయి పేరేమిటి డాక్టర్? అడిగాను. వరుణ్ !?? ఒక్క క్షణం నిర్ఘాంత పోయాను. నా ప్రపంచం గిర్రున తిరిగింది. ఉరుకులేత్తే భూమి ఆగినట్టు నా శ్వాస ఆగిపోయినట్టైంది. మెదడు మొద్దుబారింది. అంతే! కళ్ళు మగతగా మూసుకు పోతున్నాయి. నా శరీరం నేలపై వాలి పోయింది. చివరగా... ఆందోళనతో "డాక్టర్..." అన్న ఆమె అరుపు.. చెవుల్లో నుండి గుండె లోయలోకి అక్కడినుండి ఇంకా లోతుల్లోకి చేరి నవనాడులకు ప్రసరించింది. శరీరంలో ఏదో కంపం మొదలైంది. రెప్పలు భారంగా, ఆలోచనలు రివ్వుమనే వేగంతో పయణించాయి.

***

వరుణ్...వరుణ్...ఎవరో గట్టిగా తడుముతూ భుజం తట్టి లేపడానికి ప్రయత్నిస్తున్నారు. అబ్బా! ఏంటో? ఈ అర్థరాత్రి వేళ పిలుస్తున్నారు. అనుకుంటూ కళ్ళు తెరిచి చూసేసరికి ఎదురుగా అమ్మ. తనచేతిని నా తలపై నిమురుతూ ప్రేమగా నా వైపే చూస్తుంది. అంతా అయోమయంగా ఉంది.

డ్యూటీ డాక్టర్ దగ్గరికొచ్చాడు. "వరుణ్ ఆర్ యు... ఆల్ రైట్! అనడిగాడు. బెడ్‌పై లేచి కూర్చున్నాను. అంతా అయోమయంగా ఉంది డాక్టర్ అన్నాను. చదువు పూర్తి చేసుకొని సమాజంలోకి వచ్చిన యువ గ్రాడ్యుయేట్‌కు తల కిందులుగా సమాజం ఉన్నట్టు కళ్ళముందు కనిపించింది. ఈలోగా నా ఊర్మిళ దగ్గరి కొచ్చింది. నా చేతిని తన చేతిలోకి తీసుకొని, "రాత్రి జరిగిన గొడవకు... సారీ అండీ. ఇంకెప్పుడూ మిమ్మల్ని బాధపెట్టను" అంటూ కన్నీళ్లు పెట్టుకుంది. మిత్రుడు ప్రసాదు వచ్చి ధైర్యం కోసం భుజం తట్టాడు. నాన్న కళ్ళు అనుభవ భారంతో ఏదో చెప్పాలని

ఆరాట పడుతున్నాయి. ఆయన మాటను ఏదో ఆపుతున్నట్టు ఆగిపోయాడు. ఆయన మౌనభాష నాకర్ధమవుతుంది. జవాబు లేక తలదించుకున్నాను. డ్యూటీ డాక్టర్ మరోసారి... "వరుణ్, ఆర్ యు ఆల్ రైట్?" అడిగాడు.

యెస్ డాక్టర్. ఏమైంది నాకు. అనడిగాను నీరసంగా. ఏం లేదు వరుణ్. మీ భార్యాభర్తల మధ్య రాత్రి ఏదో చిన్న గొడవ జరిగిందట కదా.

అపస్మారకస్థితిలో నున్న నిన్ను, మీవాళ్ళు రాత్రి తీసుకొచ్చి ఇక్కడ జాయిన్ చేశారు. ఎక్కువగా ఆలోచించడం, నీరసంగా ఉండడం వలన డిప్రెషన్‌లోకి వెళ్లావు. అంతే. ఇప్పుడు నువ్వు పర్ఫెక్ట్. అని అక్కడినుండి పక్క పేషంట్ దగ్గరికి వెళ్ళాడు.

కొంత కాలంగా ఏ ఉద్యోగం లేదని ఉర్మిళతో రాత్రి గొడవయిన విషయం గుర్తుకొచ్చింది. ఆ తరువాత నిద్రమాత్రలు ఎక్కువగా వేసుకోవడంతో ఈ పరిస్థితి వచ్చిందని జ్ఞాపకమొచ్చింది.

నేను తేరుకోవడంతో అమ్మ మొఖం తేలికపడింది. నాన్న దగ్గరికొచ్చాడు. నా చేతిని తన చేతిలోకి తీసుకొని "చావు, బతుకులు రెండూ అదృష్టమేరా! పుట్టినాక లోకానితో ఘర్షణ పడతాం. పోయేటపుడు మనలో మనం సంఘర్షిస్తూ పోతాము. సంఘర్షణ లేకుండా పుట్టుక లేదు, చావు లేదు, బతుకు లేదు. కాబట్టి చావడానికి ముందు బ్రతుకును ప్రేమించు." అని చెప్పి అక్కడి నుండి వెళ్ళి పోయాడు.

**-కృతజ్ఞతలు-**

*రచయితగా నా గుర్తింపుకు కారణమైన పత్రికా యాజమాన్యం, పాఠకులు, విమర్శకులు, సుసాహిత్యాభిలాషులు, కుటుంబసభ్యులు, మిత్రులు ... అందరికీ కృతజ్ఞతలు. ఈ పుస్తకముద్రణకు పాక్షికంగా ఆర్థిక తోడ్పాటునందించిన సోదరి సమానురాలు శ్రీమతి గోసిక మంజుల శేఖర్ గారికి, శ్రీమతి కాటేపల్లి సరస్వతి దంపతులకు ప్రత్యేక కృతజ్ఞతలు.*

**-రచయిత**



శీలం భద్రయ్య

## రచయిత పరిచయం

**శీలం భద్రయ్య**

**పుట్టిన స్థలం :** గ్రా. అన్నారం (టి),
మం. తుంగతుర్తి, సూర్యాపేట జిల్లా

**స్థిరనివాసం :** ఇ.నెం 8-1-510, పద్మావతి కాలనీ, నల్గొండ పట్టణం,
తెలంగాణ రాష్ట్రం- 508001, 9885838288

**తల్లిదండ్రులు :** శీలం యాదమ్మ -శీలం బుచ్చయ్య గారు

**కుటుంబం :** శ్రీమతి శీలం కరుణ
చి.శీలం నిశాంత్, చి.శీలం రుగ్వేద్

**వృత్తి :** పోస్టు గ్రాడ్యుయేట్ టీచరు -తెలుగు

**రచనలు :**

1. తెలుగు భాష సాహిత్యం (తెలుగు అకాడమీ ప్రచురణ)- 2017
2. లొట్టపీసు పూలు (తెలంగాణ కథలు)- 2021
3. గంగెద్దు (కథల సంపుటి)-2022

**సంపాదకత్వం :** అంకురం (పిల్లల కవితాసంకలనం) 2019
యాస ( కవితాసంకలనం) 2020

శీలం భద్రయ్య కథల్లో సస్పెన్స్ థ్రిల్లర్తోబాటు, ప్రత్యేకంగా ఉండే సహజమైన తెలంగాణ నుడికారం ఉంటుంది. కథల్లోని ఆ ప్రత్యేకతలే పాఠకుడిని తమవెంట కథ చివరి వరకు తీసుకెళ్ళుతాయి. కథలు చదువుతుంటే కొన్ని చోట్ల మనసు కకావికలం అవుతుంది. చివరికి ఏం జరుగుతుందోనన్న ఆందోళన వెంటాడుతుంది. కథ చదువడం పూర్తయ్యాక కూడా కథలు, కథల్లోని సన్నివేశాలు, పాత్రలు, వాక్యాలు పాఠకుల్ని వెంటాడుతాయి. ఇది మంచి కథ, మంచి కథకుడి లక్షణం. ఈకథల్లో తెలంగాణ జనజీవన సంస్కృతి, భాషాసౌందర్యం, సామెతలు, జాతీయాలు, గ్రామీణ పలుకుబడులు ఉంటాయి. దానితోబాటు అసంబద్ధ సాంప్రదాయ, సామాజిక కట్టుబాట్ల నిరసన, మేలుకొలుపు ఉ ంటాయి. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ కథలన్నీ ఇతర భాషల్లోకి అనువాదం చేయదగిన కథలు.

– డాక్టర్ వి. జయప్రకాశ్


978-93-5493-350-9


శీలం ప్రచురణలు